డా. తాడేపల్లి పతంజలి

# నమక చమకాలు

(అర్థ తాత్పర్య విశేషాలు & అభిషేక విధి)




ప్రచురణ కర్త

గుడిపాటి శ్రీరామకృష్ణశర్మ



# నమక చమకాలు

(అర్థ తాత్పర్య విశేషాలు)

రచన :

**డా. తాడేపల్లి పతంజలి**



ప్రథమ ముద్రణ:
**డిసెంబరు - 2016**
ద్వితీయ ముద్రణ:
**ఫిబ్రవరి - 2019**

ప్రతులు : 1000

మూల్యం :
రూ. 160.00

ప్రచురణ కర్త, ప్రతుల కొరకు:
**గుడిపాటి శ్రీరామకృష్ణ శర్మ**
17-25/3B, ధర్మపురి కాలనీ,
ఉప్పల్, హైదరాబాదు. 500039.
ఫోన్: 9490469300

ముద్రణ :
**సంహిత గ్రాఫిక్స్**
హనుమాన్ గుడివెనుక, అమీర్‌పేట
హైదరాబాద్ - 500 016.
ఫోన్: 23731620/23741620





**RUSHIPEETHAM CHARITABLE TRUST**
SRI LALITHA DHAMAM
PLOT NO 299/300
Phase I, Saket colony
ECIL post, Secunderabad - 500 062,
Tel: 040-2713 2550

email:samavedamshanmukhasarma@gmail.com
http://www.saamavedam.org/

# శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారి ఆశాసనము

అర్థ స్ఫూర్తితో చేసే అనుష్ఠానం సార్థకతని సంతరించి, కృతకృత్యుల్ని చేస్తుంది. తన సాధనను ధన్యం చేసుకొనేందుకు రుద్ర నమక చమకాలను భాష్య సహితంగా అధ్యయనం చేసి, ఈ గ్రంథాన్ని రూపొందించిన శివార్చనాపరులు **డా. తాడేపల్లి పతంజలి** గారు దానిద్వారా అక్షరములతో రుద్రాభిషేకం చేశారు.

అర్థ–తాత్పర్య–విశేషములు... అనే విభాగాలతో రుద్ర మంత్రాలను యథోచితంగా చక్కని తెలుగులో అందించారు. అతివిస్తారము, అతిక్లుప్తత–లేకుండా, జిజ్ఞాసువులకు సుబోధకమయ్యేలా సరళ సుందరంగా రచించిన తీరు అభినందనీయం. వీరికి నాపై ఉన్న ఆత్మీయతాభావానికి బహుధా ధన్యవాదాలు.

'విశేష' రచన ద్వారా మంత్రంలోని ప్రత్యేక భావాలు తెలియడమేకాక, మన సంస్కృతిలో ఉన్న వైశిష్ట్యం, కొన్ని శాస్త్రాంశాల పరిజ్ఞానం కూడా విశదమౌతున్నాయి. ఏక మంత్రరాశిగా ఉన్నరుద్రంలో, ప్రతిమంత్రము ఒక నిర్దిష్ట ఫలార్థమై ప్రయోగింపబడుతుందని కొన్ని శాస్త్రాలు చెబుతున్నాయి. వాటి ముఖ్య విషయాలను కూడా ఇందులో తెలియజేశారు. అధ్యయనార్థమే కాక, అనుష్ఠానార్థం కూడా ఉపయుక్తమయ్యే సద్గ్రంథమిది.



రచించేటప్పుడు తానూ చేసిన అధ్యయనం, అవగాహన ఒక సాధన అయితే, అది తోటి సాధకులకు ప్రయోజనకారిగా అందించడం మరొక ప్రత్యేక వరివస్య.

గ్రంథ రచయిత **డా. తాడేపల్లి పతంజలి**, ప్రచురణకర్త **గుడిపాటి శ్రీరామ కృష్ణశర్మ** గార్లకు శివానుగ్రహ ప్రాప్తిరస్తు.

ఈ శివమయమైన సద్గ్రంథానికి నమస్కరిస్తూ ...

28/10/16





ఓం నమశ్శివాయ

## అక్షరాభిషేక వినతి

ముందుగా ప్రత్యక్షదైవములు నా తల్లిదండ్రులు తాడేపల్లి పార్వతీశశాస్త్రి, సుశీలలకు నా నమస్కారములు.

ఆధ్యాత్మికంగాను, సాహిత్య పరంగాను వారి కాలిగోటికొన యొక్క కాంతికి ఏమాత్రం సరిపోను - కేవలం-వారి వంశములో జన్మించిన ఒకే ఒక్క అదృష్ట బంధు విశేషము చేత-వారిని స్మరించే అదృష్టం కలిగింది కాబట్టి-పెదనాన్నగారు-బ్రహ్మశ్రీ **తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి** గారిని స్మరిస్తూ చేమోడ్పులు అందిస్తున్నాను.

ఆఆలు దిద్దించిన గురువు దగ్గరనుంచి నా జ్ఞాన శరీరాన్ని పెంచిన ప్రతి గురువుకి అంజలిస్తున్నాను.

నా జీవన ప్రయాణంలో సహచరిగా నా అభివృద్ధికి భాగస్వామిని అయిన నా అర్థాంగి మీనాక్షికి, చిరంజీవినులు దీప్తి, కావ్యలకు ఆశిషములు.

*****

శ్రీ రుద్రాధ్యాయము-నమకచమకములు అను ఈరెండు ప్రశ్నములకు తెలుగులో అర్థ తాత్పర్య విశేషములు నాశైలిలో-నా పేరు మీదుగా వ్రాసినది పరమశివుని కరుణా కటాక్ష వీక్షణము. ఇది అతిశయోక్తి కాదు. సహజోక్తి.

రచనా చాపల్యం నాలో విడువని ఒక గుణం. రచనను చేయాలనిపిస్తుంది. నీకు ఆ అర్హత లేదని, నీకేం తెలుసని- నువ్వెంత చదివావని-మనస్సు హెచ్చరిస్తుంటుంది. కాని రచనా చాపల్యం మనస్సును లొంగదీసుకొంటుంటుంది. 11 పుస్తకాలు ఇలానే రచనా చాపల్యం వ్రాయించింది. ఇది 12 వ పుస్తకం.

బ్రాహ్మీ ముహూర్తములో-తెల్లవారు జామున లేచి-నమకచమకాది దైవప్రార్థనలు పలుకుట, వినుట ఒక అలవాటుగా మారింది. నమకచమకాలు వింటున్నప్పుడు అర్థం తెలుసుకొందామని దైవకృపచే కోరిక



కలిగింది. నేను తెలుసుకొన్న అర్థాన్ని –ముఖపుస్తకంలో (ఫేస్ బుక్) పోస్ట్ చేయటం 2012 నుంచి ఒక అలవాటుగా పెట్టుకొన్నాను.

నా రెండు పుస్తకాలను ప్రచురించి, మూడో పుస్తకం లింగోద్భవ మాలికాస్తుతి ప్రచురించబోతున్న పెద్దలు,సౌజన్యమూర్తి **శ్రీ రావి మోహనరావుగారు** ఆగష్టు 2015 నుండి తమ **ఆత్మజ్యోతి** మాస పత్రికలో ఈ నమకచమక అర్థ తాత్పర్య విశేషాలను ప్రచురించటం మొదలుపెట్టారు. పుస్తకంగా ఎప్పుడు వేస్తున్నారని చరవాణులు, సందేశాలు ప్రారంభమయ్యాయి.

సభలు–సమావేశాలకి వెళ్ళినప్పుడు–ఆత్మీయులు శ్రీ గిరిజా మనోహర్ బాబుగారు, కృష్ణమూర్తి గారు మొదలయిన మిత్రులు ప్రచురణ ఎప్పుడు మిత్రమా? అని ఆప్యాయంగా అడిగేవారు."రచన మొత్తం పూర్తి కానివ్వండి." అని నవ్వేసి ఊరుకొనే వాడిని.

*****

ఈ నేపథ్యంలో శివుని ప్రేరణతో పెద్దలు **శ్రీ గుడిపాటి శ్రీ రామకృష్ణశర్మ** గారినుండి 28-11-2015న ఇలా విద్యుల్లేఖ (మెయిల్) వచ్చింది.

**ఆర్యా, నమస్కారము.**

**"నిన్నటిరోజు శ్రీరుద్రాధ్యాయము పారాయణ చేయుసమయమున అర్థంతెలుసుకుని చేసిన బాగుండునని తలపుతో** Google **లో వెతుకుతుంటే మీయొక్క వివరము లభించినది.మీరురచించిన నమక–చమకములకు ప్రతిపదార్థ సహిత తాత్పర్యముతో పుస్తకము పొందుటకై ఈమెయిల్ పంపుతున్నాను.ఎక్కడ లభ్యమగును? పుస్తకము పొందువిధానము వివరించగలరు"**

ఇది వారితో నా మొదటి **పద పరిచయము.**

తరువాత 2016 మే 04వ తేదీన ఇంకొక విద్యు లేఖలో "I had an idea of getting your work "నమక చమకాలు–తెలుగు టీక" printed with your guidance. You examine the issue. On completion of the work we can do it. Really a great work. Srisaila Devasthanam brought out a book similar not so exhaustive that too



only for **నమకం. చమకానికి అనువాకానికంతటికి కలిపి తాత్పర్యము మాత్రము ఇచ్చారు. గనుక ఆస్తిక మహాశయులకిది యెంతయూ ఉపయుక్తము.**" అని శ్రీ రామకృష్ణ శర్మగారు వ్రాసారు. కాదనలేకపోయాను.

వారి సౌజన్యాన్ని ప్రస్తుతిస్తూ నమక చమక ప్రచురణకు అంగీకారం తెలిపాను.

శ్రీ రామకృష్ణ శర్మగారిని, వారి కుటుంబాన్ని నమక చమకం అక్షరాభిషేకం పొందుతున్న శివయ్య ఆయురారోగ్యాభివృద్ధులతో సదా చల్లగా రక్షించాలని ప్రార్థిస్తున్నాను.

*****

రుద్రమంటే ఏమిటి? శతరుద్రీయమంటే ఏమిటి? నమకచమకాలంటే ఏమిటి? అనువాకమంటే ఏమిటి? -ఇలాంటి ప్రశ్నలన్నింటికి నాకు చేతనయినంతవరకు పుస్తకంలో జవాబులిచ్చాను.

ఈపుస్తకానికి శ్రీ మత్సాయన మాధవాచార్య వేదాంత ప్రకాశార్థ భాష్యము, శ్రీ భట్టభాస్కర భాష్యము, డా. వి. సదాగోపన్ గారి శ్రీ రుద్ర వ్యాఖ్యానం, కంచి కామకోటి పీఠం వారు ప్రచురించిన శ్రీ వి.ఆర్ కృష్ణన్ గారి వ్యాఖ్యానం, సుందరరరామశాస్త్రి గారు వ్రాసిన వ్యాఖ్యానము ఆధారములు.

అర్థ నిర్ణయానికి నేను ఆధారపడిన నిఘంటువులు ఇవి.

1. శబ్దరత్నాకరము (బహుజనపల్లి సీతారామాచార్యులు) 1912
2. ఆంధ్రవాచస్పత్యము (కొట్ర శ్యామలకామశాస్త్రి) 1953 (2వ ముద్రణ)
3. ఆంధ్రశబ్దరత్నాకరము (చెలమచెర్ల రంగాచార్యులు) 1966
4. తెలుగువ్యుత్పత్తికోశం (ఆంధ్రవిశ్వకళాపరిషత్తు) 1978
5. వావిళ్ల నిఘంటువు (వావిళ్ల) 1949
6. శబ్దార్థదీపిక (ముసునూరి వేంకటశాస్త్రి) 1956
7. శ్రీహరి నిఘంటువు తెలుగు-తెలుగు (రవ్వా శ్రీహరి) 2004
8. తెలుగు నిఘంటువు తెలుగు-తెలుగు (జి.ఎన్.రెడ్డి-ఆం.ప్ర.సా.అ.) 1979
9. తెలుగు పర్యాయపద నిఘంటువు (జి.యన్.రెడ్డి) 1990
10. సీమపలుకువహి - అచ్చతెనుగుమాటలపేరుకూర్పు (ఆదిభట్ల



నారాయణదాసు) 1967

11. పురుషోత్తమ కవీయము అనుశబ్దరూపప్రబోధకనిఘంటు త్రిత యము (నాదెళ్ల పురుషోత్తమకవి) 1918
12. పురాణనామచంద్రిక (యెనమండ్రం వెంకటరామయ్య) 1879
13. సంకేతపదకోశము (రవ్వా శ్రీహరి) 2002
14. పారమార్థికపదకోశం (పొత్తూరి వేంకటేశ్వరరావు) 2010
15. సంస్కృతన్యాయములు (కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, ఘట్టి లక్ష్మీ నరసింహశాస్త్రి) 1939
16. సంస్కృతన్యాయదీపిక (రవ్వా శ్రీహరి) 2006
17. అమరకోశము-(వావిళ్ల ప్రతికి పునర్ముద్రణ) శ్రీ జయలక్ష్మీ పబ్లికేషన్స్, హైదరాబాద్

పైన పేర్కొన్న గ్రంథ రచయితలందరికి ధన్య వాదములు

వావిళ్ల సంస్థ అంటే పుస్తక రంగంలో ఐయస్ఐ మార్క్ (ఇండియన్ స్టాండర్స్ ఇన్‌స్టిట్యూట్) అనే విశ్వాసము వలన నమక చమక పాఠాలను వారి పుస్తకాలనుండి యథాతథంగా స్వీకరించాను.

*****

బ్రహ్మశ్రీ **సామవేదం షణ్ముఖశర్మ**గారు పుంభావ సరస్వతి. ఆర్షసాహిత్యంపై సాధికార ద్రఢిమ కలిగినవారు. వారు ఈ పుస్తకానికి ముందు మాట వ్రాయటం నా అదృష్టంగా భావిస్తూ, వారికి నమోవాకములు అర్పిస్తున్నాను.

*****

సంధ్యావందన సమయంలో అంగన్యాస కరన్యాసాలు చేస్తారు. ఇవి రెండు భాగాలు. 1. అంగన్యాసం, 2. కరన్యాసం. 'ఓమ్ తత్సవితుః బ్రహ్మాత్మనేహృదయాయ నమః' అంటూ హృదయస్థానాన్ని స్పృశించడం, అదే పద్ధతిలో గాయత్రి మంత్రంలో మిగతా భాగాలను ఉచ్చరిస్తూ శిరస్సు, శిఖాదులను స్పృశించి 'ఓమ్ ప్రచోదయాత్ సర్వాత్మనే అస్త్రాయఫట్' అనడం, కుడిచేతి చూపుడు వేలు పైకి ఉండే విధంగా చూపుడు వేళ్ళు రెండింటిని లంకెవేస్తూ 'దిగ్బంధః' అనడం అంగన్యాసం.



కరన్యాసంలోనూ గాయత్రీ మంత్ర భాగాలను ఉచ్చరిస్తూ అంగుష్ఠ, తర్జని, మధ్యమ, అనామిక, కనిష్ఠిక వేళ్ళను బొటన వేలిని తర్జనితోనూ, మిగతా వేళ్ళను బొటన వేలితోనూ తాకాలి. మంత్రంలో చివరి భాగమైన 'ఓమ్ ప్రచోదయాత్' అన్నప్పుడు ఒక అరచేతి వెనుక భాగంతో రెండవ అరచేతిని రాయడం కరన్యాసం చివరి అంశం. **(పారమార్థికపదకోశం)**

ఇదే పద్ధతిలో నమక చమకాలను మహాన్యాస పూర్వకముగా చేయాలి.

శ్రీ రుద్ర జప, హోమ, అర్చన, అభిషేకాదులు చేయుటకు అధికారి కావటానికి, వాటికి ముందు మహా మహిమలు కలిగిన రుద్రుని తన (ఆత్మ) యందు నిలుపుకొనే రౌద్రీకరణ ప్రక్రియను మహాన్యాసము అంటారు. పంచాంగన్యాసములలో వివిధ మంత్రాలు చదువుతూ , తన సర్వాంగములను తాకుతూ, రుద్రుని తనలో ప్రవేశపెట్టి రుద్రార్చనకు అధికారిని చేసే విశిష్ట ప్రక్రియ మహా న్యాసము.

గురు ముఖతః దీనిని నేర్చుకొని నమక చమకాలను స్వరసహితముగా చదివి శ్రీ శివానుగ్రహాన్ని అందరూ పొందాలని కోరుతున్నాను.

*****

నాకు దూరదర్శన మాధ్యమాలలో (టీవీ ఛానల్స్‌లో) మాట్లాడే భాష అలవాటు అయినందువల్ల వ్యాకరణ విరుద్ధమయిన వ్యావహారిక భాష ఈ నమక చమక రచనలో అక్కడక్కడ తొంగిచూస్తుంటుంది. పెద్దలు ఇది గమనించ మనవి.

ఎంతగా కళ్లలో ఒత్తులు వేసుకొని చూసినా అక్షర దోషాలు ఈ పుస్తకంలో ఇంకా ఉన్నాయేమోనని ఒక సంశయం. దయచేసి పెద్దలు మన్నించవలసినదిగా మనవి. మీరు గమనించిన దోషాలను నా చిరునామాకు తెలియచేస్తే వాటిని మలిముద్రణలో సవరించుకొంటాను.

ధన్యవాదములు

**– డా. తాడేపల్లి పతంజలి**
patanjali1576@gmail.com



గుడిపాటి శ్రీరామకృష్ణశర్మ
M.A.,B.L
"శ్రీ సాయి ధామం",
ధర్మపురి కాలని,
ఉప్పల్, హైదరాబాద్-500 039



## మనవి

తొలుతగా నా తల్లిదండ్రులు **శ్రీ గుడిపాటి సత్యనారాయణ శర్మ, కనకదుర్గ** గార్లకు నా వందనములు.

అటులనే విద్యగరిపినట్టి గురువులకు, ఆధ్యాత్మిక జీవన ప్రయాణానికి చేయూతనిచ్చి 'తారక మంత్రోపదేశము' ఒసగిన నా తండ్రి గారైన శ్రీ సత్యనారాయణశర్మ గారికి నమస్కరించుచున్నాను.

ఒక విధముగా నేను బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారికి "ఏకలవ్యశిష్యుడను. జూలై 1999లో వారి ఋషిపీఠం - భారతీయ మానస పత్రిక ఆవిర్భావము మొదలు నేటి వరకు ఆ పత్రిక పాఠకుడను. ప్రతి సంవత్సరము జులై నుండి జూన్ వరకు గల వచ్చిన ఋషిపీఠం 12 పత్రికలను బౌండు చేయించి నా పుస్తక భాండాగారములో భద్రపరచుకుంటున్నాను. ఇలా - నాటి నుండి నేటి వరకు వచ్చిన ఋషిపీఠం పత్రికలన్నీ నా దగ్గర ఉన్నాయి.

2004వ సంవత్సరములో అష్టలక్ష్మి దేవాలయంలో బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ వారి శ్రీ విష్ణు సహస్రనామ ప్రవచన సమయములో వారి పరిచయమేర్పడినది. నాటి నుండి వీలున్నంతవరకు ఆసక్తితో వారి ప్రవచనములకు హాజరగుట జరుగుతోంది. ఈ క్రమములోనే 2014లో 'సియాటిల్' - రెడ్మాండ్‌లోని హిందూ దేవాలయములో SVETA వారి ఆధ్వర్యంలో జరిగిన వారి ప్రవచన కార్యక్రమమునకు హాజరగుట జరిగినది. ఋషిపీఠం ప్రచురణలు - పుస్తకాలు CD/DVD లు ఖరీదు చేసి వినుట జీవితంలో భాగమయినది.

మా నాన్నగారు నాటిన 'శివార్చన' అనే బీజము బ్రహ్మశ్రీ సామవేదం



ప్రవచనములు వినుట ద్వారా మొక్క రూపము సంతరించుకుని నేడు వేళ్ళూనుకొని వృక్షమయి దినదినాభివృద్ధి చెందుచున్నది. బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారు ఈ పుస్తకము గురించి తమ అమూల్య అభిప్రాయ సహిత అశిషములు ఇచ్చుట వాస్తవానికి శివానుగ్రహమే తప్ప ఇంకొకటి కాదు.

2015–నవంబర్ నెలలో నేను సియాటిల్‌లో ఉండగా శివానుగ్రహ ముతో ఆచార్య **తాడేపల్లి పతంజలి** గారితో 'ఇ-మెయిల్' ద్వారా పరిచయమేర్పడినది. ఆపై చరవాణిలో సంభాషణల ద్వారా వారు 'ఆత్మజ్యోతి' (ఆధ్యాత్మిక – వైజ్ఞానిక మాస పత్రిక) లో 2015 ఆగష్టు నెల నుంచి ధారావాహికగా "నమక, చమకాలు–తెలుగు టీక" శీర్షికన ప్రచురణ జరుగుతూ ఉందని తెలుసుకొని అట్టి దానిని పుస్తక రూపంలో ప్రచురించిన ఉపయుక్తముగా ఉండును కదా అనే ప్రేరణతో శ్రీ పతంజలి గారిని సంప్రదించగా సహృదయముతో వారు అంగీకరించిరి. ఈ నేపథ్యంలో "నమక, చమకాలు–తెలుగు టీక" పుస్తక రూపములో ఈ విధముగా ఈశ్వర ప్రసాదముగా సాక్షాత్కరిస్తోంది.

"అర్థం తెలియని చదువు గుడ్డి ఎద్దు చేలో పడ్డట్టే – కనుక నీవు చదివేది ఏదైనా అర్థం తెలుసుకొని ముందుకు సాగు" అని మా నాన్నగారు చెప్పేవారు. ఈ ఆదేశం నాకు నమక చమకాలు అర్థం తెలుసుకొని శివాభిషేక, అర్చనాదులు చేయవలెనను కోరిక కలిగించినది.

శ్రీశైల సంస్థానము వారి నమక ప్రచురణ, శ్రీ పాతూరి సీతారామ ఆంజనేయులు గారి "రుద్రార్చనాభిషేక విధి మరియు వారితో వ్యక్తిగత సమావేశము నా కోరికను కొంత వరకు తీర్చినవి.

ఆపై బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మ గారి ప్రవచనములు, ఋషిపీఠం – భారతీయ మానస పత్రిక నా అభిలాష నెరవేర్చుటలో దోహదపడినవి. అటుపై ఈశ్వర ప్రసాదంగా "నమక చమకాలు – అర్థ తాత్పర్య విశేషాలు" అను పుస్తకముతో నా కోరిక సంపూర్ణముగా నెరవేరినది.

కోరినంతనే ఈ గ్రంథ ప్రచురణకు అంగీకరించిన **డా॥ తాడేపల్లి పతంజలి** గారికి నా కృతజ్ఞతాభివందనములు. వారిని, వారి కుటుంబాన్ని ఆ సదాశివుడు రక్షించు గాక!



ఎన్నో పనులున్నా వీలు చేసుకొని నాపై అభిమానముతో బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారు వారి అమూల్య అభిప్రాయంతో కూడిన ఆశీస్సులు అందజేసినందుకు వారికి కృతజ్ఞతాభివందనములు.

**'శివ నీ నామము సర్వవశ్యకరమౌ శ్రీకాళహస్తీశ్వరా'** అన్న ధూర్జటి వాక్కుకు నిదర్శనం ఈ పుస్తక ప్రచురణ.

శివేభక్తి శ్శివేభక్తి శ్శివేభక్తిర్భవే భవే!!

బుధజన విధేయుడు

**గుడిపాటి శ్రీరామకృష్ణ శర్మ**

ఉప్పల్, హైదరాబాద్ – 500 039

9490469300



శ్రీః

హరహర మహాదేవ

## నమక చమకాలు – ద్వితీయ ముద్రణకు ముందుమాట

మేము ప్రచురించిన "నమక చమకాలు" అర్థ తాత్పర్య విశేషాలు తొలి ముద్రణ అతిత్వరలోనే ఆస్తిక మహాశయులను చేరుటతో ప్రతులన్నియు చెల్లిపోయినవి. పెక్కుమంది ఆస్తికుల నుంచి పుస్తకములు కావలనెడి అభ్యర్థనతో బాటు, పుస్తకములో 'అభిషేక విధి'తో పాటు నమక చమకములను స్వరసహితముగా అందజేసిన మిక్కిలి ఉపయుక్తముగా నుండుననెడి సూచనలు చేసిరి.

వారి సూచనలను దృష్టినిడుకొని మేము ఈ ద్వితీయ ముద్రణలో ఈక్రింది మార్పులు చేసాము.

1. అభిషేక విధి –స్వరసహితముగా నమక చమకాలు
2. స్వరసహితముగా గురుముఖతః శ్రీ రుద్ర పాఠం చెప్పుకొను వారికి కూడా ఉపయుక్తముగా ఉండునని ఋషులు శ్లోక రూపములో అందజేసిన శ్రీ గణేశకృత రుద్రాధ్యాయము అనుబంధము 1 మరియు 2లు గా పొందుపరచితిమి.

ఈ పుస్తకము ద్వితీయ ముద్రణకై అత్యంత శ్రద్ధ వహించి సహకరించిన గ్రంధకర్త డా. తాడేపల్లి పతంజలి గారికి ధన్యవాదములు. అటులనే మిత్రులు శ్రీ కె. నరేంద్ర గారు ఈ పుస్తక ముద్రణకై అందించిన సహకారములు మరువలేనివి. వారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని చదివి, ఆకళింపు జేసుకొని శ్రీ రుద్రుని అర్చించి ఆస్తికులు మా ఈ ప్రయత్నాన్ని సఫలం చేయగలరని ఆశిస్తున్నాము

పుస్తకములో దోషములను మాదృష్టికి తెచ్చిన, ఏవేని మార్పులు కూర్పులు కూడా తెల్పిన మలిముద్రణలో తప్పక చేర్చగలము.

లోగడ చూపిన ఆదరణ ఈ 2వ ముద్రణ పట్లచూపగలరని ఆశిస్తూ....

శ్రీః

మంగళం మహత్

హైదరాబాద్ — **గుడిపాటి శ్రీ రామకృష్ణ శర్మ**

మాఘ శుద్ధ పూర్ణిమ — ప్రచురణ కర్త

(19–2–2019)



ఓం నమశ్శివాయ

ఓం నమో భగవతే రుద్రాయ

'శివా ! నువ్వు ఇటువంటి వాడివి. నీకు నమస్కారము' అని చెప్పేది నమకము.'ఓ శివా ! ఇది కూడా (చ) నాకు ఇవ్వు. (మే) ' అని ప్రార్థనా పూర్వకంగా చెప్పేది చమకము. నమకము, చమకము కలిపితే అది శతరుద్రీయము.

సహస్రము అంటే 'వేయి' అని కాదు. అనంతము– అంటే లెక్కపెట్టలేనన్ని అని అర్థం చెప్పుకోవాలి. అలాగే శతరుద్రీయములోని శతకు –వంద – అని అర్థం కాదు. అనేక అని చెప్పుకోవాలి. అనేకమంది శివులు కనబడేది శతరుద్రీయము. ఈ నమకచమకాల ప్రార్థనా శ్లోకము ఇది.

**ఆపాతాళ నభః స్థలాంత భువన బ్రహ్మాండ మావిర్భవ**
**జ్యోతిః స్ఫాటికలింగమౌళి విలసత్ పూర్ణేందువాంతామృతైః,**
**అస్తోకాప్లుత మేకమీశ మనిశం రుద్రానువాకం జపన్**
**ధ్యాయేదీప్సిత సిద్ధయే ధ్రువపదం విప్రోభిషించేచ్ఛివమ్.**

**ప్రతి పదార్థము**

| | | |
|---|---|---|
| ఆపాతాళ | = | పాతాళము మొదలుకొని, |
| నభః స్థలాంత | = | ఆకాశతలము తుదిగాఉన్న, |
| భువన | = | భువనములతో గూడిన, |
| బ్రహ్మాండం | = | బ్రహ్మాండరూపముగా |
| ఆవిర్భవత్ | = | ఆవిర్భవించు |
| జ్యోతిః స్ఫాటికలింగ | = | జ్యోతిర్మయమగు స్ఫటికలింగము యొక్క |
| మౌళి | = | తలపై |
| విలసత్ | = | వెలుగు, |
| పూర్ణేందు | = | నిండు చంద్రుని నుండి, |
| వాంత | = | కురియు, |

(టు వమ ఉద్గిరణే)



| | | |
|---|---|---|
| అమృతైః | = | అమృతములచే, |
| అస్తోకాప్లుతం | = | దట్టముగా ముంచబడినట్టియు, |
| ఏకం | = | కేవలుడగు, |
| ఈశం | = | ఈశ్వరుని, |
| ఈప్సితసిద్ధయే | = | కోరిక నెరవేరుటకు, |
| అనిశం | = | ఎల్లపుడును |
| రుద్రానువాకాన్ | = | రుద్రానువాకములను, |
| జపన్ | = | జపించుచు, |
| ధ్యాయేత్ | = | ధ్యానించునది, |
| ధ్రువపదం | = | మూడుకాలములందును చెడని, |
| శివం | = | శివుని, |
| విప్రః | = | విప్రుడు, |
| అభిషించేత్ | = | అభిషేకించునది. |

**తాత్పర్యము**

పాతాళం నుండి ఆకాశం వరకూ సమస్తం ఒకటే లింగం. ఆ లింగ రూపం బ్రహ్మాండం (బ్రహ్మ + అండం అనగా ఒక కోడి గుడ్డు )

ఆ వెలుగులతో కూడిన జ్యోతిర్మయమయిన లింగం శుద్ధమయిన స్ఫటికంలా ఉంటుంది.

మౌళి అంటే తల. కనుక ఆ తలలో చంద్రమండలం ఉంది. చంద్రుని లోని ఆ అమృతం శివలింగం తల నుంచి క్రిందకి అభిషేకంలా పడుతోంది.. అందువల్ల బ్రహ్మాండంలో ఉన్నలోకాలన్నింటికి కూడా ఈ అమృతధార వలన చల్లదనం కలుగుతోంది.! శివలింగానికి అభిషేకం చేసేటప్పుడు, మూడు కాలాల్లోనూ నమకచమకాలు చదివేముందు ఈ శ్లోకం చదువుతూ ఈ సృష్టి మొత్తంగా వ్యాపించిన ఆ మహాశివ లింగానికి అభిషేకం చేస్తున్నా మని భావించాలి.



**విశేషాలు**

1. ఈశ్లోకమున "**అస్తోకాప్లుతమేకమ్**'కు బదులు "**అస్తోకాప్లుత లోకమ్**' అనియు "ధ్రువపదమ్'కు బదులు "**అద్రుతపదమ్**' అనియు '**ఆవిర్భవత్**' అనుటకు '**ఆవిస్ఫురత్** అనియూ ఇతర పాఠాలు ఉన్నాయి.
2. "ఆపాతాళ నభః స్థలాంత భువన బ్రహ్మాండమ్"అను మొత్తాన్ని ఒక పదంగా( సమస్త పదము) భావించి కొంతమంది అర్థం చెప్పారు. పాతాళము మొదలు ఆకాశము వరకు బ్రహ్మాండాన్ని ప్రతిబింబిస్తూ స్ఫాటిక లింగమున్నదని వివరించారు. " ఇక్కడ ఈ అర్థములో వీరు "అస్తోకాప్లుత లోకమ్' అని చదివి దానిని "ఈశ' పదానికి విశేషణముగా చెబుతారు.
3. ఇంకొందరు–"బ్రహ్మాండ మభితః' (=అంతటా బ్రహ్మాండము వ్యాపించి ఉన్నది) అని అధ్యాహరించి(= ఊహించి) బ్రహ్మాండమును ద్వితీయావిభక్తిగా చెబుతూ బ్రహ్మాండ మంతటను ఆవిః స్ఫురజ్జ్యోతిః – ప్రకాశించు (ఆవిస్ఫురత్) శివస్వరూప మని చెబుతారు..
4. అర్థముల్లో కొంచెము తేడా ఉన్నప్పటికీ తాత్పర్యమొకటే.
5. నడిచే దేవుడు కంచి స్వామి ఈ శ్లోకానికి ఇలా వ్యాఖ్యానం చేసారు.

పాతాళలోకంనుండి ఆకాశపర్యంతము వ్యాపించి ప్రకాశిస్తున్న స్ఫటిక లింగాన్ని అభిషేకిస్తున్నాను – అని దీనిభావం. స్ఫటికలింగం నిర్లిప్తమైనది. శుద్ధమైనది. నైసర్గికంగాగాని, ఔపాధికంగాకాని అది పరిణామం చెందు తుంటుంది. అది గుణదోషరహితమైనది. జ్ఞానమెట్లు నిరంజనమో, పరిశు ద్ధమో స్ఫటికమూ అట్లే పరిశుద్ధమైనది. పచ్చని ఆకును దానిమీద ఉంచితే అది పచ్చగానూ, ఎర్రని పూవుతో అలంకరిస్తే ఎర్రగాను కనపడుతుంది. స్వతహాగా అది నిర్వికారమైనది. నిర్వికార పరబ్రహ్మము, మన మనోభావాలను అనుసరించి మారుతుంది. అనుటకు స్ఫటికలింగ మొక దృష్టాంతం. అది నిర్గుణ పరమాత్మకు చిహ్నం.

స్ఫటికలింగానికి శిరోభాగంలో ఒక చంద్రకళ, సహస్రార కమలములోని చంద్రకళను జ్యోతిస్వరూపాన్ని ధ్యానించేవారికి చంద్రకళ నుండి అమృతం స్రవించి ఆనందమిస్తున్నది. ఈసమస్త ప్రపంచమున్నూ ఆనందజ్యోతి స్వరూప



మైన ఒక లింగమే. దానిని చల్లచేసినామంటే లోకమున్నూ చల్లనౌతుంది. రుద్రాభిషేకానికిముందు ఈ శ్లోకం చెప్పి మరీ ధ్యానించాలి.

ఈ బ్రహ్మాండమే ఒక శివలింగమనీ, అభిషేక కాలంలో అట్లు ధ్యానిస్తూ అభిషేకం చేయాలనీ, శ్రీరుద్రం నిర్దేశిస్తున్నది. మంచీ, చెడ్డా అన్నీ భగవత్స్వరూపంగా భావించవలెననే రుద్రం చెప్పుతున్నది. అతి మధురమును, శీతలమునూ అయిన చంద్రమండలాన్ని, నిదానంగా ఉచ్చారణచేస్తూ రుద్రాధ్యయనం చేస్తూ లింగాన్ని అభిషేకించాలి.

లింగానికి ఆద్యంతాలులేవు. మనం ఏరీతిగా స్ఫటికాన్ని చూస్తున్నామో, ఆ రీతిగానే అది మనకు కనబడుతుంది. భగవంతుడున్నూ మనం ఏ విధంగా ప్రార్థిస్తున్నామో ఆ విధంగానే మనలను అనుగ్రహిస్తున్నాడు. మన మనస్సునకు ఒక ఆకృతి అవలంబంలేక ప్రతీకం ఉంటేనేకాని ఆనందం కలగటంలేదు. మనం ప్రేమించే బంధువర్గం విషయంలోకూడా క్షేమవార్త వినటం ఒకరకం, సమక్షంలో దర్శించటం మరొక రకం. ప్రత్యక్షమైతేనే ఆనందం కలుగుతున్నది. భగవద్విషయంలోకూడా ఒక మూర్తి ద్వారా లభించే అనుగ్రహమే సంతోషదాయకంగా ఉంటున్నది. ఆద్యంతరహితంగా పరమేశ్వరమూర్తి జ్యోతి స్వరూపంలో అరుణాచల క్షేత్రంలో ఆవిర్భవించాడు.

ఆపాతాళ నభస్థలాంత భువన బ్రహ్మాండంగా వ్యాపించియున్న ఆ జ్యోతి స్వరూపాన్ని చంద్రమౌళీశ్వరుని స్ఫాటికలింగ రూపంగా మనం ధ్యానిస్తే వారి అనుగ్రహంకల్గి మనకు ఆనందం కల్గుతుంది.

6. **కే శివానంద మూర్తిగారు** ఈ శ్లోకానికి ఇలా వివరణ చేసారు.

'తూర్పు దిశ నుండి అష్ట వసువులు గాయత్రీ ఛందస్సులో మహాదేవుని పొగుడుతూ అమృతముతో అభిషేకిస్తున్నారు. దక్షిణ దిశనుండి ఏకాదశ రుద్రులు త్రిష్టుప్ ఛందస్సులో రుద్రుని పొగుడుతూ అభిషేకిస్తున్నారు. ద్వాదశాదిత్యులు పడమర దిశనుండి జగతీ చందస్సులోనూ, విశ్వేదేవతలు ఉత్తర దిశనుండి అనుష్టుప్ ఛందస్సులోనూ శివునికి అభిషేక క్రియ చేస్తున్నారు.. బృహస్పతి పంక్తీ ఛందస్సులోని మంత్రములతో బ్రహ్మాండములో ఊర్ధ్వ దిశనుంచి దశ దిశలనుంచి అభిషేక క్రియ నిర్వహిస్తున్నాడు. (Structure of the Universe- Vedic by K Sivananda Murty, 2013)



7. లింగములో వెలుగు, తడి రెండూ ఉన్నాయి. తడి ఆయన అర్ధ స్వరూపాన్ని సూచిస్తోంది.

**8.భాషా విశేషాలు**

**ఆపాతాళ**

ఆపాతాళ శబ్దాన్ని మురారి కవి చక్కగా ప్రయోగించాడు. ఆ ప్రయోగమిది.

**దేవీం వాచ ముపాసతే హి బహవ: సారంతు సారస్వతమ్**
**జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారి: కవి:**
**అబ్ధిర్లంఘిత ఏవ వానర భటై: కింత్వస్య గంభీరతాం**
**ఆపాతాళ నిమగ్న పీవర తనుర్జానాతి మంద్రాచల:**

సరస్వతిని ఎంతోమంది పూజించవచ్చు.కాని సారస్వతము గురుకుల ములో శ్రమపడి చదువుకొన్న ఒక "మురారి" కే తెలుస్తుంది.సముద్రమును ఎన్నో కోతులు దాటాయి. కాని సముద్రపులోతు – పాతాళం వరకు మునిగిన మందరపర్వతానికి మాత్రమే తెలుస్తుంది.

ఈ ఆపాతాళ శ్లోకం లోతు కూడా ధ్యానపరులకు మాత్రమే విస్పష్టంగా తెలుస్తుంది.

**రుద్రాభిషేకంలోని రెండవ ధ్యానశ్లోకం**

ఈ శ్లోకంలో అనేక మంది రుద్రులవర్ణన జరిగింది .జ్యోతిర్మయమైన శివలింగంలో అనేకమంది రుద్రులను దర్శించి వారు సుఖాన్ని ఇవ్వాలని ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు ద్రష్టలు.

**బ్రహ్మాండ వ్యాప్త దేహాః భసిత హిమరుచా భాసమానా భుజంగైః**

**కంఠే కాలాః కపర్దాః కలితశశికలాశ్చండ కోదండ హస్తాః**

**త్ర్యక్షాః రుద్రాక్షమాలా స్సలలితవపుషః శ్శాంభవామూర్తిభేదాః**

**రుద్రాశ్శ్రీరుద్రసూక్త ప్రకటిత విభవా నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్!!**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| బ్రహ్మాండ | = | రుద్రులు బ్రహ్మాండమంతా |
| వ్యాప్త | = | నిండిపోయిన |



| | | |
|---|---|---|
| దేహాః | = | శరీరము కలవారు |
| భసిత హిమరుచాః | = | బూడిదవంటి , మంచువంటి తెల్లని కాంతులతో ఉన్నారు. (దానికితోడు భస్మ రేఖలు దిద్దుకొన్నారు.) |
| భాసమానా భుజంగైః | = | పాములతో అలంకరించబడి ఉన్నారు |
| కంఠే కాలాః | = | అందరి కంఠములందు నల్లని మచ్చలు ఉన్నాయి. అందరూ నీలకంఠులే. |
| కపర్దాః | = | అందరూ కపర్దమను పేరు గల జటాజూటములను ధరించి ఉన్నారు |
| కలితశశికలాః | = | అందరు చంద్రరేఖలను ధరించి ఉన్నారు. |

చండ కోదండ హస్తాః = వాడియైన కోదండాలను ధరించారు.

| | | |
|---|---|---|
| త్ర్యక్షాః (త్రి+అక్షాః) | = | అందరూ మూడు కన్నులు కలవారు |
| రుద్రాక్షమాలాః | = | అందరూ రుద్రాక్షలు ధరించి ఉన్నారు |
| సలలితవపుషాః | = | లావణ్యమైన, లోకానికి అతీతమయిన శరీరములు కలిగి ఉన్నారు. |
| శాంభవాః | = | అందరూ లోకానికి శుభమును కలిగించువారు |
| మూర్తిభేదాః | = | అనేక మూర్తులతో ఉన్నవారు |
| రుద్రాః | = | అటువంటిరుద్రులు |

శ్రీరుద్రసూక్త ప్రకటిత విభవాః=ఈ రుద్ర సూక్తము ద్వారా (నమక చమకములద్వారా) తమ సంపదను(కాంతిని) ప్రకటింపచేస్తున్నారు.

నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్= అటువంటి రుద్రులు వారు నమక చమక పారాయణము చేయబోవు మాకు– సౌఖ్యమును ఇచ్చెదరు గాక !

**తాత్పర్యము**

రుద్రులు బ్రహ్మాండమంతా నిండిపోయిన శరీరము కలవారు. బూడిద



వంటి, మంచువంటి తెల్లని కాంతులతో ఉన్నారు. దానికితోడు భస్మ రేఖలు దిద్దుకొన్నారు. పాములతో అలంకరించబడి ఉన్నారు. అందరి కంఠములందు నల్లని మచ్చలు ఉన్నాయి. అందరూ నీల కంఠులే. అందరూ కపర్దమను పేరు గల జటాజూటములను ధరించి ఉన్నారు. అందరు చంద్రరేఖలను ధరించి ఉన్నారు.

వారు వాడియైన కోదండాలను ధరించారు. అందరూ మూడు కన్నులు కలవారు. అందరూ రుద్రాక్షలు ధరించి ఉన్నారు. లావణ్యమైన, లోకానికి అతీతమయిన శరీరములు కలిగి ఉన్నారు. అందరూ లోకానికి శుభమును కలిగించువారు. అనేక మూర్తులతో ఉన్నవారు. అటువంటి రుద్రులు ఈ రుద్రసూక్తము ద్వారా (నమక చమకములద్వారా) తమ సంపదను ప్రకటింప చేస్తున్నారు. వారు నమక చమక పారాయణముము చేయబోవు మాకు–సౌఖ్యమును ఇచ్చెదరు గాక !

**విశేషాలు**

బ్రహ్మాండమంటే ప్రపంచము. ఆకాశానికి శబ్ద గుణము ఉంది. వాయువుకి శబ్ద, స్పర్శ గుణాలు ఉన్నాయి. అగ్నికి శబ్ద, స్పర్శ, రూప గుణాలు ఉన్నాయి. నీటికి శబ్ద, స్పర్శ, రూప, రస గుణాలున్నాయి. భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస , రస గంధ గుణాలున్నాయి. ఇవన్నీ కలిస్తే బ్రహ్మాండమైందని బ్రహ్మ పురాణంలో ఉంది. (23 వ అధ్యాయము) ఈ బ్రహ్మాండము వెలగ పండు విత్తనంలా ఉంటుందని పోలిక చెప్పారు. ఈ మానవ శరీరము బ్రహ్మాండము యొక్క సూక్ష్మ రూపం. హరి బ్రహ్మాండములో వ్యాపించినట్లే ఈ శరీరములో కూడా వ్యాపించి హృదయ సీమలో అలంకరించి ఉంటాడని ప్రశ్నోపనిషత్తు చెబుతోంది. (ఆరవ అధ్యాయము)

కాలము అనగా నల్లనిది. **కాలయతి మనఇతి కాలః.** మనస్సును ప్రేరేపించునది కనుక నల్లని రంగుకు కాలమని పేరు.

భూతభవిష్యద్వర్తమానములు కాలత్రయము: ప్రాతస్సంగమ మధ్యాహ్న పరాహ్ణ సాయంకాలములు. కాలపంచకము, వీటిని కూడా శివులు



కంఠమునందు కలిగి ఉన్నారని ఇంకొక సమన్వయము

**కపర్ది**

'కపర్దిన్' పదము సంస్కృతమున శివునకు రూఢివాచకముగను, జటాధారులకు సామాన్యవాచకముగను నున్నది. కపర్దమనగా కిరీటమని అర్థము గలదు ఈ 'కపర్ది' యన గిరీటి కావచ్చును. ఇందుకు సంస్కృతమున బ్రయోగము మృగ్యము.కాని, ఋగ్వేదమున 'కపర్దిన్, శబ్దము 'కిరీటి' పదమునకు బర్యాయముగ వాడబడియున్నది. "**అయం సోమ: కపర్దినే ఘృతం నృపవతే మధు, ఆభక్షత్ కన్యాను న:**" (ఋగ్వేదము 07- 67- 11.) దీనిలోని 'కపర్దినే' అను పదమునకు భాష్యమున 'కల్యాణ ముకుటవతే' అని యర్థము చెప్పబడినది. ఈ సంప్రదాయార్థము ననుసరించి 'కిరీటి' పదమునకు బర్యాయపదముగా 'కపర్ది' శబ్దభవమగు 'కవ్వడి' పదము తెనుగు భారతమున నుపయోగింప బడియుండును. కాని, 'కిరీటి' పదమునకు గ్రీడియను తద్భముండనే యున్నది కావున 'కవ్వడి' పదము 'కపర్ది' భవముగనే అనగా 'కపర్దము' లేక 'జటాజూటము' కలవాడను నర్థముననే యుపయోగింప బడినట్లెంచుట యుక్తమని తోచుచున్నది.

అయినను భారతమున గాని మరి యెచ్చటగాని యర్జుననకు కపర్దియను నామము కానరాదు. అంతమాత్రమున 'కవ్వడి' పదమునకు 'కపర్ది' భవత్వ మును త్రోసివేయుటకు వీలులేదు. 'కవ్వడి' యనునది లక్షణార్థమున దొలుత నుపయోగింపబడి తరువాత రూఢ్యర్థమున దెలుగుకవుల వాడుక యందు నెలకొన్నదని చెప్పవలెను. అర్జునుడును కపర్దము కలవాడే యనుట కాతని 'గుడాకేశ' నామము తెలుపుచున్నది. గుడాకేశుడనినను కపర్ది యనినను నర్థమొక్కటే. కపర్దాకారముగల కేశపాశమును జుట్టు కొనువారి కెల్లరకు కపర్ది, గుడాకేశనామములు చెల్లును.(**ఆంధ్ర భాషా చరిత్రము 846 పుట**)

దేవాలయానికి కాని, పుణ్య క్షేత్రాలకు కాని వెళ్ళే ముందు, "కపర్ది కపర్ది కపర్ది" అని 3 సార్లు అనుకొని బయలుదేరితే, దారిలో ఎదురయ్యే అడ్డంకులు తొలగిపోతాయి. ఆ గంగమ్మ నీటితో తడుస్తున్న "పరమ శివుడి" జటాజూటాన్ని తలుచుకుంటే మన పాపరాశి దగ్ధమవుతుందని పెద్దలు చెప్పారు.



## ఓం నమోభగవతే రుద్రాయ

అత్యంత శక్తివంతమైన వేదమంత్రంగా నమకానికి ప్రసిద్ధి. నమకానికి రుద్రప్రశ్న అని ఇంకో పేరు. రుద్రుడి యొక్క పేర్లను స్మరించి 'నమః' అని ఈ మంత్రాలలో చెబుతారు కనుక దీనికి 'నమకం' అని పేరు వచ్చింది. జప, హోమ అర్చనాదులలో నమక మంత్రాలు చెప్పి, స్వామివారి రుద్రత్వాన్ని విడిపిస్తారు. ఆయనను శివునిగా మార్చిన పిమ్మట కోరిన ఫలితాలు పొందటానికి చమకము చదువుతారు. నమక చమకములను కలిపి చెబితే రుద్రమంటారు. ప్రస్తుతము నమకమంత్రానికి తెలుగులో అర్థ విశేషాలు వరుసగా అందించటానికి ప్రయత్నిస్తాను.

### ప్రథమానువాకం

**01. నమస్తే రుద్ర మన్యవ ఉతో త ఇషవే నమః ।**
**నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | ఓ శివా! |
| తే | = | నీయొక్క, |
| మన్యవే | = | కోపముకొరకు |
| నమః | = | నమస్కారం, (అస్తు= ఆగుగాక!) |
| ఉతో | = | ఇంకా, |
| తే | = | నీ యొక్క |
| ఇషవే | = | బాణముకొరకు |
| నమః | = | నమస్కారం. |
| తే | = | నీ యొక్క |
| ధన్వనే | = | ధనుస్సుకొరకు, |
| నమః + అస్తు | = | నా నమస్సు ఉండుగాక!, |
| ఉత | = | ఇంకా, |



| | | |
|---|---|---|
| తే | = | నీ యొక్క, |
| బాహుభ్యామ్ | = | రెండు చేతులకు, |
| నమః | = | నమస్కారం. |

**తాత్పర్యము:**

ఓ శివా! నీకోపము మా మీదగాక,మా శత్రువుల మీద ప్రవర్తించుగాక!

నీ ధనుస్సుతో బాణములు మా మీద ప్రయోగింపబడకుండుగాక!

నీ చేతులలోని బాణ ప్రయోగము మా మీద ప్రయోగింపబడకుండుగాక!

**విశేషాలు:**

1) మూలమంత్రంలో 'మన్యవ' అని మాత్రమే ఉంది. అర్థవివరణలో మన్యవే వచ్చింది.

2) ఓ రుద్రా! నీ కోపానికి, బాణానికి, నీ ధనుస్సుకు, చేతులకు నమస్కారమని భావం.

3) రుద్ర శబ్దానికి 'దుష్టుల దుఃఖింపజేయువాడు' మొదలైన అర్థాలున్నాయి.

**2. యా త ఇషుశ్శివతమా శివం బభూవ తే ధనుః ।**
**శివా శరవ్యా యా తవ తయా నో రుద్ర మృడయ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | రుద్రుడా!, |
| తే | = | నీ యొక్క, |
| యా ఇషుః | = | ఏ బాణమయితే ఉన్నదో అది, |
| శివతమా | = | చాల శుభాన్ని కలిగిస్తుంది, |
| తే ధనుః | = | నీ యొక్క ధనుస్సు, |
| శివం బభూవ | = | శుభాన్ని కలిగిస్తుంది. |
| తవ | = | నీ యొక్క, |
| శరవ్యా | = | అమ్ములపొది |
| యా | = | ఏది |



| | | |
|---|---|---|
| శివా | = | శుభమగుచున్నదో |
| తయా | = | ఆ బాణము, ధనుస్సు, ఆ అమ్ములపొది మొదలయిన వాటి చేత, |
| నః | = | మాకు, |
| మృడయ | = | సంతోషము కలిగించవలసినదిగా ప్రార్థన. |

**తాత్పర్యము :**

రుద్రుడా! నీ యొక్క ఏ బాణమయితే ఉన్నదో అది చాల శుభాన్ని కలిగిస్తుంది. నీ ధనుస్సు శుభాన్ని కలిగిస్తుంది. నీ అమ్ములపొది శుభాన్ని కలిగిస్తుంది. ఆ మూడింటిచే మాకు సంతోషము కలిగించవలసినదిగా ప్రార్థన.

**విశేషాలు :**

1) యాత ఇషుః అని పాఠం – కాని అర్థం చెప్పుకొనేటప్పుడు యాతే ఇషుః (తే యా ఇషుః) అని పెద్దలు చెప్పారు.

2) భక్తులను సంతోష పెట్టువాడు కనుక శివునికి మృడుడని పేరు. ఈ మంత్రంలో ఆయన పేరుకు సంబంధించిన మృడయ వాడటం గమనార్హం.

**3. యా తే రుద్ర శివా తనూరఘోరాఽ_పాపకాశినీ ।**
**తయా నస్తనువా శంతమయా గిరిశంతాభిచాకశీః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | ఓ శివా! |
| తే | = | నీ యొక్క, |
| యా తనూః | = | ఏ శరీరం ఉన్నదో అది |
| అఘోరా | = | ఘోరము కానిది (భయంకరము కానిది), |
| శివా | = | శుభాన్ని ప్రసాదించేదయిన, |
| అపాప కాశినీ | = | ఆత్మ జ్ఞానాన్ని ప్రసాదించేదయిన, (హింసాభయాన్ని పోగొట్టేది) |
| గిరిశంత | = | పర్వతమునందు ఉండు ఓ పరమేశ్వరా!, |



| | | |
|---|---|---|
| శంతమయా తనువా | = | శాంతిమయమైన ఆ శరీరముతో, |
| నః | = | మాకు (మమ్ములను), |
| అభిచాకశీః | = | ఆశీర్వదింపుము. (మాయందు ప్రకాశింపుము) |

**తాత్పర్యము:**

ఓ శివా! నీ యొక్క శరీరం భయంకరము కానిది. శుభాన్ని ప్రసాదించేది.

ఆత్మ జ్ఞానాన్ని ప్రసాదించేది. ఓ పరమేశ్వరా! శాంతిమయమైన ఆ శరీరముతో, మాయందు ప్రకాశింపుము.

**విశేషాలు :**

1) ఈ మంత్రంలో మానవుని ముక్తి కోరబడుతోందని శంకర భగవత్పాదులు చెప్పారు. 2) అఘోరమంటే మిగుల భయంకరమని, శివుని ముఖములలో ఒకటని అర్థా లు న్నాయి. కాని ఇక్కడ అఘోరానికి 'భయంకరము కాని' అని అర్థం చెప్పుకోవాలని పెద్దలు చెప్పారు. ఘోరమంటే ఆయుధాలతో భయం పుట్టించేది. అఘోరమంటే అలా భయం కలిగించనిది. 3) **గిరిశంత** = కైలాసగిరిలో నివసించి ప్రాణాలకు శాంతి ఇచ్చువాడు కనుక శివుడు గిరిశంతుడు. గిరి అంటే మేఘము. మేఘరూపంలో నీటిని ఇచ్చి సుఖం కలుగచేయువాడు గిరిశంతుడు

4 **యామిషుం గిరిశంత హస్తే బిభర్ష్యస్తవే ।**
**శివాం గిరిత్ర తాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| గిరిశంత | = | ఓ శివా! |
| యాం ఇషుమ్ | = | (ఏ) నీ బాణము, |
| అస్తవే | = | శత్రువుల మీదికి వదులుటకు, |
| హస్తే | = | చేతిలో |
| బిభర్షి | = | ధరించి ఉన్నావో |
| గిరిత్ర | = | కైలాసములో నివాసముండి, దానిని రక్షించేవాడా! |



| | | |
|---|---|---|
| తామ్ | = | ఆ బాణమును, |
| శివాం కురు | = | నాకు శుభాన్ని ప్రసాదించునట్లు చేయుదువుగాక! |
| పురుషమ్ | = | నాకు సంబంధించిన వ్యక్తులకు, |
| జగత్ | = | స్థావర జంగమాత్మకమైన ప్రపంచానికి, |
| మా హిం సీః | = | హాని చేయకు. |

**తాత్పర్యము:**

ఓ శివా! కైలాసములో నివాసముండి, దానిని రక్షించే వాడా! ఏ బాణము శత్రువుల మీదికి వదులుటకు చేతిలో ధరించి ఉన్నావో ఆ బాణమును నాకు శుభాన్ని ప్రసాదించునట్లు చేయుదువుగాక! నాకు సంబంధించిన వ్యక్తులకు, స్థావర జంగమాత్మకమైన ప్రపంచానికి, హాని చేయకు.

**విశేషాలు:**

త్రిపురాసుర వధ సందర్భములోని శివుని ఘోరరూపము ధరించుట లోకకంటకులయిన శత్రువుల కొరకు మాత్రమే. ఆది ఈ మంత్రములో గుర్తు చేయబడినది.

**5. శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి ।**
**యథా నః సర్వమిజ్జగదయక్ష్మగ్ం సుమనా అసత్ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| గిరిశ | = | కైలాసమందు ఉండువాడా! ఓ పరమేశ్వరా! |
| త్వాం | = | నిన్ను |
| అచ్ఛ | = | పొందుటకు, |
| శివేన వచసా | = | శుభకరమైన మాటలతో, |
| యథా | = | ఎట్లు, |
| నః | = | మా యొక్క |
| జగత్ సర్వమిత్ | = | ఈ స్థావర జంగమాత్మకమైన ప్రపంచము, |
| అయక్ష్మగ్ం | = | రోగములు లేకుండా, |



| | | |
|---|---|---|
| సుమనః | = | మంచి మనస్సులతో, |
| అసత్ | = | ఉండేటట్లు ఆగునో , |
| వదామసి | = | అట్లు చేయవలసినదిగా మేము ప్రార్థించు చున్నాము. |

**తాత్పర్యము :**

పరమేశ్వరా! నిన్ను శుభకరమైన మాటలతో పొందాలని, రోగాలు లేకుండా ఈ చరాచర జగత్తు ఉండాలని మేము మంచి మనస్సులతో ప్రార్థించుచున్నాము.

**విశేషాలు :**

1) మన సంస్కృతి యొక్క గొప్పతనం ఈ అయిదవ మంత్రంలో స్పష్టంగా కనబడుతోంది. నేనొక్కడిని కాదు – అందరము బాగుండాలని, రోగాలు లేకుండా ఉండాలని కోరుకోవటం మన మనస్సుల గొప్పతనం.

2) సాయణుడు అచ్ఛ అను పదానికి పొందుట అను అర్థమిచ్చాడు.

**6. అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ ।**
**అహీగ్శ్చ సర్వాన్ జంభయన్త్సర్వాశ్చ యాతుధాన్యః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అధివక్తా | = | దేవతల తరపున పక్షపాతముగా మాట్లాడువాడు, |
| ప్రథమః | = | శ్రేష్ఠుడు, |
| దైవ్యః | = | దేవతలయందు కూడా అంతర్యామిగా ఉండువాడు, |
| భిషక్ | = | వైద్యుడు (భవరోగములను నిర్మూలించువాడు), |
| సర్వాన్ అహీంశ్చ | = | అన్ని రకముల విషసర్పముల నుండి, |
| యాతుధాన్యః | = | రాక్షస జాతులు, |
| సర్వాశ్చ | = | అందరిని |



| | | |
|---|---|---|
| జంభయన్ | = | పాపములనుండి నశింపచేయుచు |
| అధ్యవోచత్ | = | నాకు అనుకూలముగా మాట్లాడుగాక! |
| | = | నన్ను ఆధికునిగా చెప్పుగాక! (అనగా శివుడు అన్ని రకాల పీడలనుండి నన్ను రక్షించుగాక అని భావం) |

**తాత్పర్యము :**

దేవతల తరపున పక్షపాతముగా మాట్లాడువాడు, (శ్రేష్ఠుడు, దేవతలయందు కూడా అంతర్యామిగా ఉండువాడు, భవరోగములను నిర్మూలించువాడు),అన్ని రకముల విషసర్పముల నుండి, రాక్షస జాతులందరిని పాపములనుండి నశింప చేయుచూ నాకు అనుకూలముగా మాట్లాడుగాక!నన్నుఆధికునిగా చెప్పుగాక!

**విశేషాలు :**

1) పరమేశ్వరుని ధ్యానించువారికి పాపాలన్ని నశిస్తాయి. దీనిని '**జంభయన్ అద్యవోచత్**' గా చెప్పబడింది.

2) మహర్షి బోధాయణుడు ఈ మంత్రాన్ని కవచంగా పేర్కొన్నాడు.

3) యాతువులనగా బాధపెట్టే మాయలు.

**7. అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుః సుమంగళః ।**
**యే చేమాం రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశో వైషాం హేడ ఈమహే।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యః | = | ఏ పరమేశ్వరుడు (సూర్య స్వరూపుడు), |
| తామ్రః | = | ఎఱ్ఱనివాడో (ఉదయకాలమున), |
| అరుణః | = | ఇంచుక ఎఱుపు రంగు కలిగిన వాడో (ఉదయ కాలము కొంచెము గడిచిన తర్వాత), |
| ఉత | = | ఇంకా, |
| బభ్రుః | = | బంగారు రంగు కలిగినవాడో (మరికొంత సమయము తర్వాత), |
| సుమంగళః | = | చక్కని శుభాలనిచ్చువాడో, |



| | | |
|---|---|---|
| అసౌ | = | సూర్యునివలె ప్రకాశిస్తూ, |
| యే చ | = | మరియూ ఏ |
| రుద్రాః | = | రుద్ర స్వరూపాలు |
| సహస్రశః | = | వేలకొలదిగ, |
| ఇమామ్ | = | ఈ భూమికి, |
| అభితః | = | చుట్టునూ |
| దిక్షు | = | నాలుగు దిక్కుల, |
| శ్రితాః | = | నిలిచి ఉన్నవారో, |
| ఏషామ్ | = | అట్టి వీరియొక్క , |
| హేడః | = | కోపమును, |
| అవ ఈమహే | = | పోవుటకొరకు ప్రార్థించుచున్నాము. |

**తాత్పర్యము :**

సూర్య స్వరూపుడైన ఏ పరమేశ్వరుడు , ఉదయకాలమున

ఎఱ్ఱనివాడు. ఉదయకాలముకొంచెము గడిచిన తర్వాత ఇంచుక ఎఱుపు రంగు కలిగిన వాడు. ఇంకా, మరికొంత సమయము తర్వాత బంగారు రంగు కలిగినవాడు. చక్కని శుభాలనిచ్చువాడు. ఆ సూర్య స్వరూపుడైన శివుని కోపము పోవుటకొరకు ప్రార్థించుచున్నా ము. రుద్ర స్వరూపాలు వేలకొలదిగ ఈ భూమికి, చుట్టునూ నాలుగు దిక్కుల, నిలిచి ఉన్నవారు. వారి కోపము పోవుటకొరకు ప్రార్థించుచున్నాము.

**విశేషాలు :**

పరమేశ్వరునికి ఎనిమిది మూర్తులలో ఒకటయిన సూర్యుని గూర్చి ఈ మంత్రంలో పొగడబడింది. వేద విహిత కర్మలు చేయటానికి చాలా సందర్భాలలో మనకు కుదరదు. అందువలన పరమేశ్వరునికి జనించే కోపాన్ని తగ్గించమని ఈ మంత్రంలో అభ్యర్థన.

**8 అసౌ యో౽వసర్పతి నీలగ్రీవో విలోహితః ।**
**ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః ।**
**ఉతైనం విశ్వా భూతాని స దృష్టో మృడయాతి నః ॥**

**ప్రతిపదార్థము :**



| | | |
|---|---|---|
| యః | = | పరమేశ్వరుడు (ఎవడు), |
| నీలగ్రీవః | = | నల్లటి మచ్చ కంఠమందు కలవాడు, |
| విలోహితః | = | ఎఱుపురంగు కలవాడు, |
| యః | = | పరమేశ్వరుడు (ఎవడు), |
| అసౌ | = | సూర్య మండలంలో కనిపించే వాడై, |
| అవసర్పతి | = | ఆకాశంలో సంచరిస్తుంటాడో, (ఉదయాస్త మయముల కొరకు) |
| ఉత | = | ఇంకా |
| ఏనమ్ | = | ఈ రుద్రుని |
| గోపాః | = | గోపాలకులు కూడ, |
| చ | = | సూర్యరూపంలో ఉన్న రుద్రుడు, |
| అదృశన్ | = | చూచుచున్నారో, |
| ఉత | = | ఇంకా |
| ఏనమ్ | = | ఈ రుద్రుని, |
| విశ్వాభూతాని | = | అన్ని జీవులు |
| అదృశన్ | = | చూచుచున్నారో, |
| సః | = | అటువంటి అతడు (ఆ పరమేశ్వరుడు), |
| దృష్టః | = | మాచే చూడబడిన వాడై |
| నః | = | మాకు, |
| మృడయాతి | = | మాకు సుఖము కలిగించుగాక! |

**తాత్పర్యము :**

నల్లటి మచ్చ కంఠమందు కలవాడు, ఎఱుపురంగు కలవాడు ఆగు పరమేశ్వరుడు సూర్య మండలంలో కనిపించే వాడై, ఆకాశంలో సంచరిస్తుంటాడు. ఈ సూర్యరూపంలో ఉన్న రుద్రుని గోపాలకులు కూడ చూచుచున్నారు. ఇంకా ఈ రుద్రుని అన్ని జీవులు చూచుచున్నారు. అటువంటి





ఆ పరమేశ్వరుడు మాచే చూడబడిన వాడై మాకు, సుఖము కలిగించుగాక!

**విశేషాలు :**

1. గోపాలకులు శబ్దం సామాన్యులకు ప్రతీక. సామాన్యులకు కూడా శివుడు సూర్యరూపంలో తన దర్శనం కలిగిస్తున్నాడని భావం.

2. పిల్లవాడు మొదలుకొని గొల్లవాని వఱకు అను అర్థంలో ఆబాలగోపాలం అను పదబంధం తెలుగులో ఉంది. దీనినే నమకంలో **గోపా ఉత** అని ప్రయోగించారు.

**9 నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే ।**
**అథో యే అస్య సత్వానో௨హం తేభ్యో௨కరం నమః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సహస్రాక్షాయ | = | అనేకమైన కన్నులు కలవానికి, |
| మీఢుషే | = | మేఘ రూపంలో భక్తుల కోరికలను తీర్చువానికి, |
| నీలగ్రీవాయ | = | కంఠమందు నల్లని (విష) మచ్చ కలిగిన స్వామికి, |
| నమః + అస్తు | = | నా నమస్కారములు (ఉండుగాక), |
| అథః | = | ఇంకా, |
| అస్య సత్వానః | = | దగ్గరగా ఉన్న ఆ శివుని ప్రమథ గణములు, |
| యే తేభ్యః | = | ఎవరయితే ఉన్నారో వారికి కూడా, |
| అహమ్ | = | నేను, |
| నమః | = | నమస్సు, |
| అకరమ్ | = | చేయుచున్నాను. |

**తాత్పర్యము :**

అనేకమైన కన్నులు కలవానికి, మేఘ రూపంలో భక్తుల కోరికలను తీర్చువానికి, కంఠమందు నల్లని మచ్చ కలిగిన స్వామికి, నా నమస్కారములు. ఈ శివుని ప్రమథ గణములకు కూడా నేను నమస్సు చేయుచున్నాను.

**విశేషాలు :**



సహస్రాక్షుడులోని 'సహస్ర'పదం ఇక్కడ వేయి అను అర్థమును కాకుండా 'అనేకము' అను అర్థాన్ని ఇస్తుంది. జీవ స్వరూపమే ఆయన కనుక ఆయన కన్నులు లెక్కించుటకు అసాధ్యమైనవని అనేకమని భావం.

**10 ప్రముంచ ధన్వనస్త్వముభయోరార్త్నియోర్జ్యామ్ ।**
**యాశ్చ తే హస్త ఇషవః పరా తా భగవో వప ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భగవః | = | ఓ భగవంతుడా!పరమేశ్వరా! |
| ధన్వనః | = | నీయొక్క ధనుస్సు యొక్క |
| ఉభయోః ఆర్త్నియోః | = | రెండయిన చివరల యందు, |
| జ్యామ్ | = | నారిని, |
| ప్రముంచ | = | విడువుము (నారిని ధనుస్సు నుండి వేరు చేయుమని భావం), |
| తే హస్తే | = | నీ చేతియందు, |
| యాః ఇషవః | = | ఏ బాణములు ఉన్నవో, |
| తాః చ | = | వాటిని, |
| పరా వప | = | ప్రయోగించకు.(విడిచివేయుము) |

**తాత్పర్యము :**

ఓ పరమేశ్వరా! నీయొక్క ధనుస్సు యొక్క రెండయిన చివరల యందు,నారిని, విడువుము. నీ చేతియందు ఏ బాణములు ఉన్నవో, వాటిని ప్రయోగించకు.

**విశేషాలు :**

**1.** పరమశివుని బాణ ప్రయోగము చేయవద్దని ఈ మంత్రంలో విజ్ఞప్తి.

**11. అవతత్య ధనుస్త్వం సహస్రాక్ష శతేషుధే ।**
**నిశీర్య శల్యానాం ముఖా శివో నః సుమనా భవ ॥**



**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సహస్రాక్ష | = | అనేకమైన కన్నులు కలిగిన ఓ పరమశివా!, |
| శతేషుధే | = | అనేకమయిన అమ్ముల పొదులు కలిగినవాడా!, |
| త్వం ధనుః అవతత్య | = | నీ ధనుస్సును దించి(నారిని వదులుచేసి) |
| శల్యానామ్ | = | బాణములయొక్క, |
| ముఖాః | = | అంచులను |
| నిశీర్య | = | వాడిలేనివిగా చేసి, |
| నః | = | మాకు, |
| సుమనాః | = | మంచి ఆలోచనలుకలవానిగా |
| శివః | = | శాంతునిగా |
| భవ | = | అగుము. |

**తాత్పర్యము :**

అనేకమైన కన్నులు కలిగిన ఓ పరమశివా! అనేకమయిన అమ్ముల పొదులు కలిగిన వాడా! నీ నారిని ధనుస్సు నుండి వేరు చేసి బాణములయొక్క అంచులు వాడిలేనివిగా చేసి మాకు శుభాన్ని, మంచి ఆలోచనలను అనుగ్రహించు.

**విశేషాలు :**

శివుడు ఈ నమక మంత్రం చదివిన భక్తులకు కష్టాలు రానీయకుండా కాపాడాలనే ప్రార్థన ఈ మంత్రంలో అంతర్లీనంగా కనిపిస్తుంది.

**12 విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత ।**

**అనేశన్నస్యేషవ ఆభురస్య నిషంగధిః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కపర్దినే | = | ఓ పరమశివుడా! (శివుని జటాజూటము పేరు కపర్ది. సుఖముచే నిండించునది అని ప్రతిపదార్థము), |



| | | |
|---|---|---|
| ధనుః | = | ధనుస్సు, |
| విజ్యమ్ | = | అల్లె త్రాడులేనిదిగా ఆగుగాక! |
| ఉత | = | ఇంకా |
| బాణావాగ్ం | = | అమ్ములపొది |
| విశల్యః అస్తు | = | మేకులు బయటికి కనబడక బాణముల అడుగు భాగమున ఉండుగాక! |
| అస్య | = | ఈ పరమశివుని యొక్క |
| ఇషవః | = | బాణములు, |
| అనేశన్ | = | గుచ్చుటకు శక్తి విహీనములగుగాక!, |
| నిషంగధిః | = | కత్తి ఒర |
| ఆభుః అస్తు | = | కొంచెము సమర్థము అగుగాక! |

**తాత్పర్యము :**

ఓ పరమశివుడా! నీ ధనుస్సు నారినుంచి వేరు చేయి ! అమ్ముల పొదిలో కూడాబాణములు లేకుండుగాక! పరమశివుని యొక్క బాణములు గుచ్చుటకు శక్తి విహీనములగుగాక! కత్తి ఒర కొంచెము సమర్థము ఆగుగాక! (కత్తి ఒర ఎక్కడనో తగిలింపబడి ఉండుటవలన కత్తిని లాగుటకొరకు గాక కేవలము కత్తిని ధరించుట కొరకు మాత్రమే ఉపయోగపడాలని సాయణ భాష్యము)

**విశేషాలు :**

ఆయుధాలు, బాణాలు ప్రసక్తి ద్వారా కీడు ఎవరికి కలిగించవద్దనే ప్రార్థన ఇందులో ప్రతీకాత్మకంగా కనిపిస్తుంది.

**13 యా తే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః ।**
**తయాఽస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయా పరిబ్భుజ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| మీఢుష్టమ | = | భక్తుల కోరికలను వర్షించేవాడా! (తీర్చేవాడా!) ఓ శివా! |



| | | |
|---|---|---|
| యా తే హేతిః | = | ఏది నీయొక్క కత్తి మొదలైన ఆయుధము, |
| అస్తి | = | కలదో ; |
| యా | = | ఏది |
| తే హస్తే | = | నీ చేతిలో |
| ధనుః | = | ధనుస్సు, |
| బభూవ | = | ఉన్నదో; |
| అయక్ష్మయా | = | భక్తులకు రోగములు రాకుండా, (ఉపద్రవములు రాకుండా) |
| తయా | = | ఆ ఆయుధములచేత, |
| త్వమ్ | = | నువ్వు, |
| అస్మాన్ | = | మమ్ములను, |
| విశ్వతః | = | అన్ని రకముల ప్రమాదములనుండి, |
| పరిబ్భుజ | = | రక్షించుము. (పరిపాలింపుము) |

**తాత్పర్యము :**

భక్తుల కోరికలను తీర్చేవాడా! ఓ శివా! నీ చేతిలోని కత్తి ,ధనుస్సులచేత నువ్వు, మమ్ములను అన్ని రకముల ప్రమాదములనుండి రక్షించుము.

**విశేషాలు :**

ఈ మంత్రంలో శివుని చేతిలో ఉన్న అన్ని ఆయుధములు భక్తులను రక్షించాలని మంత్రద్రష్ట కోరుతున్నాడు.

**14 నమస్తే అస్త్వాయుధాయానాతతాయ ధృష్ణవే ।**
**ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే ॥**

**ప్రతిపదార్థము :**

పరమేశ్వరా!

| | | |
|---|---|---|
| అనాతతాయ | = | చంపనుద్యుక్తము కానిది (చాపబడనిదియూ) |



| | | |
|---|---|---|
| ధృష్ణవే | = | దిట్ట తనము కలది అయిన, (బాధించుటకు సమర్థమైనది) |
| తే ఆయుధాయ | = | నీ ఆయుధమయిన బాణముకొరకు |
| నమః + అస్తు | = | నమస్కారము ఆగుగాక! |
| ఉత | = | ఇంకా, |
| తే ఉభాభ్యాం బాహుభ్యామ్ | = | నీ రెండు చేతుల కొరకు |
| తవ ధన్వనే | = | నీ ధనుస్సు కొరకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

పరమేశ్వరా! చాపబడనిదియూ, దిట్ట తనము కలది అయిన నీ ఆయుధ మయిన బాణముకొరకు నమస్కారము. ఇంకా, నీ రెండు చేతులకు, నీ ధను స్సుకు నమస్కారము.

**విశేషాలు :**

శక్తి కలిగినప్పటికీ నీ బాణములు ఎవరికీ హాని చేయవని, చేయ వద్దని ఈ మంత్రంలో ప్రార్థన.

**15 పరితే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః ।**
**అథో య ఇషుధిస్తవా౽౽రే అస్మన్నిధేహి తమ్ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తే | = | ఓ పరమేశ్వరా! |
| ధన్వనః | = | నీ ధనుస్సు యొక్క |
| హేతిః | = | ఆయుధము (బాణము), |
| అస్మాన్ | = | మమ్ము |
| విశ్వతః | = | ప్రపంచములోని అన్ని వైపులనుండి, |
| పరివృణక్తు | = | విడుచుగాక! (బాధింపవద్దని భావం) |
| అథ | = | ఇంకా, |



| | | |
|---|---|---|
| తవ | = | నీయొక్క |
| ఇషుధిః | = | అమ్ములపొది |
| యః | = | ఏదిగలదో |
| తం | = | దానిని |
| అస్మత్ | = | మాకంటె |
| ఆరే | = | దూరమునందు |
| నిధేహి | = | ఉంచుము |

**తాత్పర్యము :**

ఓ పరమేశ్వరా! నీ బాణము ప్రపంచములోని అన్ని వైపుల నుండి మా సమీపమునకు వచ్చునట్లు చేయవద్దు (ప్రయోగించవద్దు), ఇంకా నీయొక్క అమ్ములపొది మాకు దూరంగా ఉంచుము.

**విశేషాలు :**

1. **ఆరే** అను పదానికి భట్ట భాస్కరీయ భాష్యములో **శత్రువుల సమూహములో** అని అర్థముఉంది.

2. ఈమొదటి ఆనువాకమున ఉన్నవాటిని ఋక్కులంటారు. రెండు వాక్యములున్నది ఋక్కు. ఒక వాక్యమున్నది యజుస్సు. యజుస్సులలో కూడ తేడాలున్నాయి.

***÷ ఇంతటితో నమకంలో మొదటి అనువాకం సమాప్తము. ÷***





# ద్వితీయానువాకము

**01 నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమః ।**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| హిరణ్యబాహవే | = | బంగారమువంటి చేతులు కలవానికొరకు (బంగారపు ఆభరణాలు ధరించిన చేతులు కలవానికి), |
| సేనాన్యే | = | (జీవులనే సైన్యానికి) సేనాధిపతి రూపుడైన శివునికొరకు |
| దిశాం చ పతయే | = | దిక్కులకు అధిపతియైన వానికొరకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

బంగారపు ఆభరణాలు ధరించిన చేతులు కలవానికి, సేనాధిపతి రూపుడైన శివునికి, దిక్కులకు అధిపతియైన వానికి నమస్కారము.

**విశేషాలు :**

హితమును,రమణీయము ఆయినది హిరణ్మయము. అట్టి చేతులు కలవాడనుట ద్వారా శుభకరుడని భావం.

**'హిరణ్య బాహవే'** సంబోధన అంతరాదిత్యవిద్యకు సంబంధించినది. ఛాందోగ్యోపనిషత్ ప్రకారము సర్వప్రపంచమునకు అధినాయకుడు హిరణ్య బాహువు.

**2 నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| హరికేశేభ్యః | = | ఆకుపచ్చ రంగుగల కేశములు ఆకులరూపంలో కలిగిన (సత్వ, రజస్, తమో గుణములు ఆకులుగా కలిగిన), |
| వృక్షే భ్యః | = | సంసార వృక్ష రూపంలో ఉన్న, |



| | | |
|---|---|---|
| పశూనాం పతయే | = | పశువులకు ప్రభువయిన శివునికి, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఆకుపచ్చ రంగుగల కేశములు ఆకులరూపంలో కలిగిన సంసార వృక్ష రూపంలో ఉన్న పశువులకు ప్రభువయిన శివునికి నమస్కారము.

**విశేషాలు :**

1) సాధారణంగా ఆకులు చెట్లకు పైగా ఉంటాయి కాబట్టి వాటిని కేశములుగా చెప్పటం జరిగింది.

2) మానవులు మొదలైన జీవులందరూ తమ తమ కర్మలనే తాళ్లతో బంధింపబడి ఉంటారు కనుక వారు పశువులు. వారందరికి పతి **పశూనాం పతి.**

**3 నమస్సస్పింజరాయ త్విషీమతే పథీనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సస్పింజరాయ | = | ఎఱుపు మించిన పసుపురంగు కలిగిన, |
| త్విషీమతే | = | అధికమైన కాంతి కలిగిన (ప్రకాశించెడు జ్ఞానము కలిగిన), |
| పథీనాం | = | మార్గములకు, |
| పతయే | = | అధిపతివైన ఓ పరమేశ్వరా!, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఎఱుపు మించిన పసుపురంగు కలిగిన ప్రకాశించెడు జ్ఞానము కలిగిన పితృయాన, దేవయాన విదేహ ముక్తి మార్గములకు అధిపతివైన ఓ పరమేశ్వరా! నమస్కారము.

విశేషాలు :

1) సస్పి అనగా లేత గడ్డి. దాని రంగు పసుపు, ఎఱుపు రంగులతో కలిసి ఉంటుంది.



2)సస్పులనగా రాక్షసులని భట్ట భాస్కరీయము. వాళ్లను జీర్ణింపచేయువాడు సస్పింజరుడు.

**4 నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| బభ్లుశాయ | = | వాహనమైన ఎద్దుపై శయనించువాడు, |
| వివ్యాధినే | = | శత్రువులను బాగా పీడించువాడు , |
| అన్నానాం పతయే | = | అన్నములైన ఓషధులను పరిపాలించు ప్రభువయిన శివునకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

వాహనమైన ఎద్దుపై కూర్చుండి, శత్రువులను బాగా పీడించు, అన్నములైన ఓషధులను పరిపాలించు ప్రభువయిన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

స్కంద పురాణంలో ధర్మము ఎద్దుగా చెప్పబడింది.

**5 నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| హరికేశాయ | = | నల్లని జుత్తు కలిగినవానికొరకు , |
| ఉపవీతినే | = | శుభకరమైన యజ్ఞోపవీతమును ధరించిన వానికొరకు, |
| పుష్టానాం పతయే | = | జ్ఞానము మొదలైన పదిగుణములతో పరిపుష్టులైన వారికి స్వామియైన పరమశివునకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

నల్లని జుత్తు కలిగిన శుభకరమైన యజ్ఞోపవీతమును ధరించిన, జ్ఞానము మొదలైన పదిగుణములతో పరిపుష్టులైన వారికి, స్వామియైన పరమశివునకు నమస్కారము.



**విశేషాలు :**

1) వాక్కు, 2) జ్ఞానము, 3) ఇంద్రియాలు, 4) ఇల్లు, పొలాలు, 5) ధనధాన్యాలు, 6) సంతానము, 7) జంతువులు, 8) గ్రామము, 9) ధర్మము, 10) అణిమాది సిద్ధులు

ఇవి పది పుష్టులు. శివుని అనుగ్రహంతో ఈ పుష్టులు లభిస్తాయని ఈ నమక మంత్రం లోని అర్థం.

**6 నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భవస్య | = | ఈ సంసార బంధములను, |
| హేత్యై | = | నరికివేసే కత్తిలాంటి వాడివయిన శివునకు, |
| నమః | = | నమస్కారము |
| జగతాం పతయే | = | ప్రపంచములకు ప్రభువయిన శివునకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఈ సంసార బంధములను నరికివేసే కత్తి లాంటి వాడివయిన శివునకు నమస్కారము. ప్రపంచములకు ప్రభువయిన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1) సంసార వృక్షానికి ఛేదకుడు శివుడు. అనగా సంసార బంధములు శివుని దయతో తొలగుతాయని భావం.

2) స్వామి ఆధిపత్యము, మరియూ ముక్తినిచ్చే శక్తి సామర్థ్యాలు **జగతాంపతయే** – (ప్రపంచములకు ప్రభువు) అను సంబోధనలో చెప్పబడినవి.

3) దుఃఖము కలిగించువాడు, దుఃఖము తొలగించువాడు రుద్రుడని భట్టభాస్కరీయము ఈ మంత్రానికి అర్థం చెప్పింది.



**7 నమో రుద్రాయాఽఽ తతావినే క్షేత్రాణాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఆతతావినే | = | విస్తరింపబడిన ధనుస్సుతో రక్షించు, శత్రువులను శిక్షించి, భక్తులను రక్షించుట) |
| రుద్రాయ | = | సంసార బంధములను తొలగించే రుద్రునికొఱకు, |
| నమః | = | నమస్కారము |
| క్షేత్రాణాం పతయే | = | శరీరములకు – పుణ్యక్షేత్రములకు పరిపాలకుడైన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

విస్తరింపబడిన ధనుస్సులతో లోకములను రక్షించు రుద్రునకు నమస్కారము. శరీరములకు – పుణ్యక్షేత్రాలకు పరిపాలకుడైన శివునకు నమస్కారము.

**8 నమస్సూతాయాఽ హంత్యాయ వనానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సూతాయ | = | సారథియైన వానికొఱకు,(ప్రపంచమను రథమును నడపువానికి) |
| అహంత్యాయ | = | సంహరించుటకు శక్యము కానివానికొఱకు, |
| నమః | = | నమస్కారము. |
| వనానాం పతయే | = | అరణ్యముల పరిపాలకునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

సారథికి, సంహరించుటకు శక్యము కానివానికి, అరణ్యముల పరిపాలకుడైన పరమశివునికి నమస్కారము.



**విశేషాలు :**

ఇక్కడ సారథి అంటే శివుడు ప్రపంచానికి సారథి అని ఒక అర్థం .సుతమనగా సోమలత. దాని రూపుడని మరొక అర్థం.

**9 నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రోహితాయ | = | ఎఱుపు వర్ణము కలిగినవాడు, |
| స్థపతయే | = | శ్రేష్ఠుడును (ప్రతిచోట ఉండేవాడును, రక్షకుడును, ప్రభువును), |
| నమః | = | నమస్కారము. |
| వృక్షాణాం పతయే | = | చెట్లకు అధిపతియైన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఎఱువు వర్ణము కలిగినవాడు, శ్రేష్ఠుడును, ప్రతిచోట ఉండేవాడును, రక్షకుడును, చెట్లకు అధిపతియైన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

రోహితుడనగా వాచ్యరూపుడని భట్టభాస్కరీయము.

**10 నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| మంత్రిణే | = | ఏడు కోట్ల మహామంత్రములకు, ఉపనిషత్తులకు అధిపతికొఱకు (మంత్రిరూపమున ఉండువాడు) |
| వాణిజాయ | = | వర్తకునివలె అన్ని ప్రాంతములలోని రహస్యములు తెలిసినవానికొఱకు, |
| నమః | = | నమస్కారము. |
| కక్షాణాం పతయే | = | ఎక్కుటకు, దిగుటకు కష్ట సాధ్యములైన పర్వ తములకు, నదులకు ప్రభువయిన, బోదె లేని చెట్లు పాలించు శివునికొఱకు, |



| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఏడు కోట్ల మహామంత్రములకు, ఉపనిషత్తులకు అధిపతియు, వర్తకునివలె అన్ని ప్రాంతములలోని రహస్యములు తెలిసినవాడు, ఎక్కుటకు, దిగుటకు కష్టసాధ్యములైన పర్వతములకు, నదులకు ప్రభువయిన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

వాణిజుడనగా వాణి= వాక్కునందు జ= పుట్టినవాడని భట్టభాస్కరీయము.

**11 నమో భువంతయే వారివస్కృతాయౌషధీనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భువంతయే | = | భూమిని విస్తరించు (కాపాడు) శివునికొఱకు, |
| వారివస్కృతా | = | భక్తుల శరీరములలో నివాసమున్నట్టి రుద్రునికొఱకు, (ధనమును రక్షించు రుద్రునకు), |
| నమః | = | నమస్కారము. |
| ఓషధీనాం పతయే | = | ఓషధులకు ప్రభువగు (చెట్లను రక్షించు) శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

భూమిని విస్తరించు శివునకు, భక్తుల శరీరములలో నివాసమున్నట్టి రుద్రునకు (ధనమును రక్షించు) ఓషధులకు ప్రభువగు (చెట్లను రక్షించు) శివునకు నమస్కారము.

**విశేషాలు :**

వరివ ః అనగా సేవ. ఆది చేయువారు వరివస్కృతులు అనగా భక్తులని భట్టభాస్కరీయము.

**12 నమ ఉచ్చైర్ఘోషాయాక్రందయతే పత్తీనాం పతయే నమః ।**



**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఉచ్చైర్ఘోషాయ | = | యుద్ధరంగములో పెద్దగా ధ్వని చేసే వానికొఱకు, |
| ఆక్రందయతే | = | శత్రువులను ఏడిపించి సంహరించు వానికొఱకు |
| నమః | = | నమస్కారము. |
| పత్తీనాం పతయే | = | పాదచారులైన యోధులకు నాయకుని కొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

యుద్ధ సమయమున మహోన్నత ధ్వనిగా కల శివునకు నమస్కారము. శత్రువుల నేడిపించు శివునకు నమస్కారము. పాదచారులైన యోధులకు పాలకుడైన రుద్రునకు నమస్కారము.

**విశేషాలు :**

**ఉచ్చైర్ఘోషాయ** అనగా గొప్ప శబ్దము కలవాడు, గొప్ప స్తోత్రము కలవాడని భట్టభాస్కరీయము.

**13 నమః కృత్స్నవీతాయ ధావతే సత్వనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కృత్స్న వీతాయ | = | అన్నిచోట్ల వ్యాపించిన వానికొఱకు |
| ధావతే | = | భక్తులను రక్షించుట కొరకు పరుగులిడు వానికి, పరుగెత్తుచున్న శత్రువులను వెంటబడి తరుము వానికొఱకు |
| నమః | = | నమస్కారము. |
| సత్వనాం పతయే | = | ధర్మమును ఆచరించువారి ప్రభువైన శివునకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

అన్నిచోట్ల వ్యాపించిన వానికి, భక్తులను రక్షించుట కొరకు పరుగులిడువానికి, ధర్మమును ఆచరించువారి ప్రభువైన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

కృత్స్న వీతాయ అనగా సమస్త జగత్తును భక్షింపబడినదిగా కలవాడని భట్టభాస్కరీయము.

***(నమకములోని రెండవ అనువాకము (వేదభాగము) సమాప్తము.)***





# తృతీయానువాకం

**1 నమస్సహమానాయ నివ్యాధిన అవ్యాధినీనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సహమానాయ | = | శత్రువులను అణిచివేయువానికి, |
| నివ్యాధినే | = | ఆశ్చర్యకరముగా శత్రువులను కొట్టువానికొఱకు, |
| నమః | = | నమస్కారము, |
| అవ్యాధినీనాం పతయే | = | పరాక్రమవంతులైన సైన్యములకు పరిపాలకుడైన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

శివునకు నమస్కారము. శత్రువులను అణచివేయువానికి ఆశ్చర్యకరముగా శత్రువులను కొట్టువానికి, పరాక్రమవంతులైన సైన్యములకు పరిపాలకుడైన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

సహమానాయ అనగా ఆపరాధములు చేసిననూ క్షమించువాడని భట్టభాస్కరీయము.

**2 నమః కకుభాయ నిషంగిణే స్తేనానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కకుభాయ | = | 1. శ్రేష్ఠునికి 2. మద్దిచెట్టువలె ప్రధానునికి, 3. వృషభము యొక్క మూపునందు ప్రకాశించువానికొఱకు |
| నిషంగిణే | = | ఖడ్గము చేతిలో ధరించినవానికొఱకు |
| నమః | = | నమస్కారము, |



| | | |
|---|---|---|
| స్తేనానాం పతయే | = | రహస్యముగా దొంగతనము చేయు దొంగలకు పాలకుడైన శివునకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

మద్దిచెట్టువలె ప్రధానునికి, ఖడ్గము చేతిలో ధరించిన వానికి, రహస్యముగా దొంగతనము చేయు దొంగలకు పాలకుడైన శివునకు నమస్కారము.

**3 నమో నిషంగిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నిషంగిణే | = | చేత బాణము ధరించిన విలుకానికొఱకు, |
| ఇషుధిమతే | = | అమ్ములపొది కలవానికొఱకు, |
| తస్కరాణాం పతయే | = | బహిరంగముగా దొంగిలించు దొంగలకు పాలకుడును అయిన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

చేత బాణము ధరించిన విలుకాడును, అమ్ములపొది కలవాడును, బహిరంగముగా దొంగిలించు దొంగలకు పాలకుడును అయిన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

నితరాం సంగీ తస్మై అను వివరణలో నిషంగి పదానికి "దయాశాలి" అని ఇంకొక అర్థం చెప్పుకోవచ్చు.

**4 నమో వంచతే పరివంచతే స్తాయూనాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వంచతే | = | నమ్మకంగా ఉండి యజమాని సొమ్మును అపహరించు మోసగాడి స్వరూపములో ఉండు శివునికొఱకు, |



| | | |
|---|---|---|
| పరివంచతే | = | అన్నివేళలా మోసపు స్వరూపముతో ఉండే శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |
| స్తాయూనాంపతయే | = | ఇతరులకు ఏమాత్రము తెలియకుండా సొమ్మును అపహరించే దొంగలకు పరిపాలకుడైన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

నమ్మకంగా ఉండి యజమాని సొమ్మును అపహరించు మోసగాడి స్వరూపములోఉండే శివునికొఱకు, అన్నివేళలా మోసపు స్వరూపముతో ఉండే శివునికొఱకు నమస్కారము. ఇతరులకు ఏమాత్రము తెలియకుండా సొమ్మును అపహరించే దొంగలకు పరిపాలకుడైన శివునికొఱకు నమస్కారము.

**5 నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నిచేరవే | = | 1. యజమాని ఇంటిలో దొంగతనము చేయుటకు జాగ్రత్తగా పరిసరాలు గమనించువానికి, 2. దొంగలతో కలిసి అరణ్యములలో తిరుగు శివునికొఱకు , |
| నమః | = | నమస్కారము. |
| పరిచరాయ | = | బహిరంగ ప్రదేశములలో తిరుగాడు దొంగ అయిన శివునికొఱకు |
| అరణ్యానాం పతయే | = | అరణ్యములలో తిరుగు దొంగలకు ప్రభువైన శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

యజమాని ఇంటిలో దొంగతనము చేయుటకు జాగ్రత్తగా పరిసరాలు గమనించు శివునికి నమస్కారము. బహిరంగ ప్రదేశములలో తిరుగాడు



దొంగ అయిన శివునకు ,అరణ్యములలో తిరుగు దొంగలకు ప్రభువైన శివునకు, నమస్కారము.

**విశేషము :**

దొంగలకు ప్రభువు అను శివుని వర్ణనలో స్వామిపట్ల నింద లేదు. స్వామిలో సర్వవ్యాపకత్వము ఉంది. అందరి జీవులలోను ఉన్నట్లే పరమేశ్వరుడు దొంగలలోను ఉన్నాడు. అందువలననే వారికి ప్రభువు.

**6 నమః సృకావిభ్యో జిఘాంసద్భ్యో ముష్ణతాం పతయే నమో ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| సృకావిభ్యః | = | తమ ఉపకరణములతో శరీరమును రక్షించు కొనుచూ, |
| జిఘాంసద్భ్యః | = | జంతువులను హింసించెడి, |
| ముష్ణతాం పతయే | = | దొంగలకు ప్రభువైన శివునకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

తమ ఉపకరణములతో శరీరమును రక్షించుకొనుచూ, జంతువులను హింసించెడి దొంగలకు ప్రభువైన శివునకు నమస్కారము.

**7 నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః ప్రకృంతానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| అసిమద్భ్యః | = | ఖడ్గము కల చోరులకు, |
| నక్తంచరద్భ్యః | = | రాత్రిపూట తిరుగువారికి, |
| ప్రకృంతానాం పతయే | = | కుత్తుకలు కత్తిరించువారికి ప్రభువైన శివునకు, |
| నమః | = | నమస్కారము. |





**తాత్పర్యము :**

నమస్కారము. ఖడ్గము కల చోరులకు, రాత్రిపూట తిరుగువారికి, కుత్తుకలు కత్తిరించువారికి ప్రభువైన శివునకు నమస్కారము.

**8 నమ ఉష్ణీషినే గిరిచరాయ కులుంచానాం పతయే నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఉష్ణీషినే | = | గ్రామస్థుల వలె తలపాగా ధరించు దొంగలకు, |
| గిరిచరాయ | = | పర్వత ప్రాంతాలలో తిరుగు, |
| కులుంచానామ్ | = | దొంగలకు, |
| పతయే | = | నాయకుడైన శివునకు, |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

గ్రామస్థుల వలె తలపాగా ధరించు దొంగలకు, పర్వత ప్రాంతాలలో తిరుగు దొంగలకు నాయకుడైన శివునకు నమస్కారము.

**9 నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఇషుమద్భ్యః | = | బాణములు చేతిలో ధరించినట్టి, |
| ధన్వావిభ్యశ్చ | = | ధనుస్సులు కలిగినట్టి, |
| వః చ | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా ! నమస్కారము! భక్తులు కానివారిని భయపెట్టుటకు బాణములు చేతిలో ధరించినట్టి, ధనుస్సులు కలిగినట్టి, మీకు నమస్కారము.



**10. నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఆతన్వానేభ్యః | = | ధనుస్సున త్రాటిని, |
| ప్రతిదధానేభ్యశ్చ | = | బాణమును ఆరోపించు (సంధించు), |
| వః | = | మీకు (రుద్రులకు), |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ధనుస్సున త్రాటిని సంధించు రుద్రులకు  నమస్కారము.

**విశేషాలు :**

**ధనుర్గుణ న్యాయమని ఒక న్యాయముంది.** వంకరగా ఉండే వింటికి విలుకాండ్లు గుణాన్ని (అల్లిత్రాటిని) సంధించినట్లుగా – గొప్పవారు చెడ్డ బుద్ధి ఉన్న దుష్టులకు కూడా గుణాలను ఆరోపిస్తారు అని భావం. అలాగే దుష్ట బుద్ధి కలిగిన భక్తులకు శివుడు గుణాన్ని ఆరోపిస్తాడని ఈ నమక మంత్రంలో శివ స్తుతి.

**11 నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఆయచ్ఛద్భ్యః | = | వింటి త్రాటిని బిగించునట్టి, |
| విసృజద్భ్యశ్చ | = | వింటి నుండి బాణములను విడుచునట్టి ఓ శివా!, |
| వః | = | మీకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

నమస్కారము! వింటి త్రాటిని బిగించునట్టి, వింటి నుండి బాణములను విడుచునట్టి ఓ రుద్రులారా! మీకు నమస్కారము.





**12 నమోऽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| అస్యద్భ్య | = | లక్ష్యము చేరు వరకు బాణము విడుచు, |
| విధ్యద్భ్యశ్చ | = | లక్ష్యములో బాణము ఉంచు, |
| వః | = | మీకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. లక్ష్యము చేరు వరకు బాణము విడుచు, లక్ష్యములో బాణము ఉంచు మీకు నమస్కారము.

**13 నమ ఆసీనేభ్యశ్శయానేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఆసీనేభ్యః | = | కూర్చునట్లుగా, |
| శయానేభ్యః చ | = | నిద్రించునట్లుగా కనబడు, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము! కూర్చున్నవారు, నిద్రించువారు – రెండూ మీరే! మీకు నమస్కారము.

**14 నమస్స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| స్వపద్భ్యః | = | నిదురించినట్టి, |
| జాగ్రద్భ్యః + చ | = | మేల్కొని ఉన్నట్టి, |



| | | |
|---|---|---|
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. నిదురించినట్టి, మేల్కొని ఉన్నట్టి మీకు నమస్కారము.

**15 నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| తిష్ఠద్భ్యః | = | నిశ్చలముగా, కదలకుండా నిలబడిన మీకొఱకు, |
| ధావద్భ్యః + చ | = | పరుగులు తీయు, |
| వః | = | మీకొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. నిశ్చలముగా, కదలకుండా ఉండునట్టి పరుగులు తీయు మీకు నమస్కారము.

**16 నమస్సభాభ్యస్సభాపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| సభాభ్యః | = | సభలో కూర్చుని ఉన్నవారికి (సభలయిన మీకొఱకు), |
| సభాపతిభ్యః + చ | = | సభలకు అధ్యక్షునిగా ఉన్న మీకొఱకు (సభలకు ప్రభువైన), |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. సభలో కూర్చుని ఉన్నవారికి సభలకు అధ్యక్షునిగా ఉన్న మీకొఱకు నమస్కారము.

**17 నమ అశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| అశ్వేభ్యః | = | అశ్వ రూపముగలమీకు (తనదయిన ధనము లేని మీకొఱకు), |
| అశ్వపతిభ్యః + చ | = | అశ్వముపై విహరించు మీకు (అశ్వ స్తనికులగు మునులకు పాలకులయిన మీకొఱకు), |
| వః | = | మీకొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. అశ్వ రూపముగలమీకు , అశ్వ స్తనికులగు మునులకు పాలకులయిన మీకొఱకు నమస్కారము.

*(ఇంతటితో నమకంలో తృతీయానువాకం సమాప్తము)*





# చతుర్థానువాకం

**1 నమ అవ్యాధినీభ్యో వివిధంతీభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఆవ్యాధినీభ్యః | = | అన్నివైపులనుండి ఎదుర్కొనుటకు సిద్ధమైన స్త్రీల రూపములో ఉండు, |
| వివిధ్యంతీభ్యః + చ | = | వివిధ రకములుగా ఎదుర్కొనుటకు సిద్ధముగా ఉండే స్త్రీల రూపములో ఉండు, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము అన్నివైపులనుండి ఎదుర్కొనుటకు సిద్ధమైన శక్తుల రూపములో ఉండు, వివిధ రకములుగా ఎదుర్కొనుటకు సిద్ధముగా ఉండే స్త్రీల రూపములో ఉండు మీకు నమస్కారము.

**విశేషము :**

శివుడు సర్వభూతస్వరూపుడు అని ఇందులో అంతరార్థం.

**2 నమ ఉగణాభ్యస్తృగ్ంహతీభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఉగణాభ్యః | = | గొప్ప గుణముల స్వరూపులైన సప్త మాతృకల రూపంలో ఉండు, |
| తృగ్ంహతీభ్యః + చ | = | దుష్టులను హింసించే దుర్గ మొదలైన భయంకరమైన దేవతల రూపంలో ఉండు, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! గొప్ప గుణముల స్వరూపులైన సప్త మాతృకల రూపంలో ఉండు, దుష్టులను హింసించే దుర్గ మొదలైన భయంకరమైన దేవతల రూపంలో ఉండు మీకు నమస్కారము.

**విశేషము :**

1. బ్రాహ్మి, 2. మాహేశ్వరి, 3. కౌమారి, 4. వైష్ణవి, 5. వారాహి, 6. ఇంద్రాణి, 7 చాముండి. సప్త మాతృకలు.

**3 నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| గృత్సేభ్యః | = | విషయములందు ఆసక్తి కలిగినవారి స్వరూపములో ఉన్న, |
| గృత్సపతిభ్యః + చ | = | విషయములందు ఆసక్తి కలిగినవారి రక్షించు వారి స్వరూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! విషయములందు ఆసక్తి కలిగినవారి స్వరూపములో ఉన్న మరియూ విషయములందు ఆసక్తి కలిగినవారి రక్షించు వారి స్వరూపములో ఉన్న మీకు నమస్కారము.

**విశేషము :**

విషయము అంటే ఇక్కడ ఇంద్రియములకు సంబంధించినది. ఇంద్రియములు పది. చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు (ఇవి జ్ఞానేంద్రియములు), వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము (ఇవి కర్మేంద్రియములు). మనస్సుతో కలిపి కొంతమంది 11 ఇంద్రియాలంటారు.



**4 నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| వ్రాతేభ్యః | = | నానా జాతుల సంఘముల స్వరూపులైన |
| వ్రాతపతిభ్యః + చ | = | ఆ జాతుల సంఘముల అధిపతుల స్వరూపులైన, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. నానా జాతుల సంఘముల స్వరూపులైన ఆ జాతుల సంఘముల అధిపతుల స్వరూపులైన మీకు నమస్కారము.

**5 నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| గణేభ్యః | = | ప్రమథ గణముల స్వరూపులైన, |
| గణపతిభ్యః + చ | = | ప్రమథ గణముల ప్రభు స్వరూపులైన, |
| వః | = | మీకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. ప్రమథ గణముల స్వరూపులైన, ప్రమథ గణముల ప్రభు స్వరూపులైన మీకు నమస్కారము.

**విశేషము :**

శివుని అనుగ్రహము వలన కైలాసమున అతనితోకూడ ఉండు భక్తుల సమూహమును ప్రమథ గణము అంటారు.



**6 నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| విరూపేభ్యః | = | వికృత రూపములుగా కనిపించు రూపములను ధరించు, |
| విశ్వరూపేభ్యః + చ | = | గుఱ్ఱము, ఏనుగు మొదలైన అనేక రూపములను ధరించు, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. వికృత రూపములుగా కనిపించు రూపములను ధరించు, గుఱ్ఱము, ఏనుగు మొదలైన అనేక రూపములను ధరించు మీకు నమస్కారము.

**విశేషములు :**

విరూపము అనగా రూపములేని, విశ్వరూపము అనగా చరాచర సృష్టిలోని అనేక రూపములని కూడా అర్థాలు చెప్పుకోవచ్చు.

**7 నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| మహద్భ్యః | = | అణిమ మొదలైన అష్ట సిద్ధులుఉన్న, |
| క్షుల్లకేభ్యః + చ | = | అణిమ మొదలైన అష్టసిద్ధులు లేకున్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. అణిమ మొదలైన అష్టసిద్ధులు ఉన్న, అణిమ మొదలైన అష్టసిద్ధులు లేకున్న మీకు నమస్కారము.



**విశేషములు :**

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనునవి అష్టసిద్ధులు. ఇవి ఉన్నవాడు, లేనివాడు అనగా సర్వము శివమయమని అర్థం.

**8 నమో రథిభ్యోఽ రథేభ్యశ్చ వో నమః।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| రథిభ్యః | = | రథమును ఎక్కిన వారి రూపములో, |
| అరథేభ్యః + చ | = | రథమును ఎక్కనివారి రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. రథమును ఎక్కినవారి రూపములో, రథమును ఎక్కనివారి రూపములో ఉన్న మీకు నమస్కారము.

**విశేషములు :**

ఇక్కడ శరీరము రథము. దీనిలో పరమాత్మ రూపములో కొలువై ఉన్నవాడు శివుడని తాత్పర్యము. రథము ఎక్కనివారు అనగా జన్మను పొందని ఆత్మలని అర్థము.

**9 నమో రథేభ్యో రథపతిభ్యశ్చ వో నమః।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| రథేభ్యః | = | రథ రూపములో ఉన్న, |
| రథ పతిభ్యః + చ | = | రథమునకు ప్రభువైన వాని రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. రథ రూపములో ఉన్న మరియూ రథమునకు ప్రభువైన వాని రూపములో ఉన్న మీకు నమస్కారము.

**10. నమస్సేనాభ్యస్సేనానిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| సేనాభ్యః | = | రథ గజ తురగ పదాతి రూపములలో ఉన్న, |
| సేనానిభ్యః + చ | = | సేనా నాయకుల రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. రథ గజ తురగ పదాతి రూపములలో ఉన్న, సేనా నాయకుల రూపములో ఉన్న మీకు నమస్కారము.

**11. నమః క్షత్తృభ్యః సంగ్రహీతృభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| క్షత్తృభ్యః | = | అశ్వములను మరపువారి రూపములో ఉన్న, |
| సంగృహీతృభ్యః+చ | = | రథ బాధ్యతలను గ్రహించు సారథుల రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. అశ్వములను మరపు వారి రూపములో ఉన్న, మరియూ రథ బాధ్యతలను గ్రహించు సారథుల రూపములో ఉన్న మీకు నమస్కారము.



**12 నమస్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| తక్షభ్యః | = | వడ్రంగుల రూపములో ఉన్న, |
| రథకారేభ్యః + చ | = | రథము చేయువారి(శిల్పుల )రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. వడ్రంగుల రూపములో ఉన్న, శిల్పుల రూపములో ఉన్న మీకు నమస్కారము.

**13 నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| కులాలేభ్యః | = | కుండలు తయారు చేసే కుంభకారుల రూపములో ఉన్న, |
| కర్మారేభ్యః + చ | = | ఆభరణాలు తయారుచేసే కంసాలుల రూపములో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. కుండలు తయారు చేసే కుంభకారుల రూపములో ఉన్న, ఆభరణాలు తయారుచేసే కంసాలుల రూపములో ఉన్న మీకు నమస్కారము.



**14 నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| పుంజిష్టేభ్యః | = | పక్షులను పట్టు బోయవాని రూపములలో ఉన్న, |
| నిషాదేభ్యః + చ | = | చేపలను పట్టి ఆ సమూహములను సంహరించు వాని రూపములలో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. చేపలను పట్టి ఆ సమూహములను సంహరించువాని రూపములలో ఉన్న, పక్షులను పట్టు బోయవాని రూపములలో ఉన్న మీకు నమస్కారము.

**విశేషములు :**

ఎవనియందు పాపము ఉంటుందో వాడు నిషాదుడు. సమూహాములుగా చుట్టి చంపుదురు కనుక చేపలు చంపువారికి నిషాదులనిపేరు.

**15 నమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| ఇషుకృద్భ్యః | = | బాణములు తయారు చేయువారి రూపములలో ఉన్న, |
| ధన్వకృద్భ్యః + చ | = | ధనుస్సులను చేయువారి రూపములలో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. బాణములు తయారు చేయు వాని రూపములలో ఉన్న, ధనుస్సులను చేయువారి రూపములలో ఉన్న మీకు నమస్కారము.

**16 నమో మృగయుభ్యశ్శ్వనిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| మృగయుభ్యః | = | జంతువులను వేటాడి చంపు వేటగాని రూపములో ఉన్న, |
| శ్వనిభ్యః + చ | = | కుక్కల మెడలలోనితాళ్లను ధరించి ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా!నమస్కారము. జంతువులను వేటాడి చంపు వేటగాళ్ళ రూపములో ఉన్న, కుక్కల మెడలలోని తాళ్లను ధరించి ఉన్న మీకు నమస్కారము.

**విశేషములు :**

1. కుక్కలను అంత తేలికగా చూడనవసరంలేదు. కొన్ని కుక్కలు కృష్ణచతుర్దశి నాడు ఉపవసిస్తాయి. దానినే **శ్వానిశం** అంటారు.

2. కాలభైరవుడు కుక్కను వాహనంగా చేసుకుని తిరిగే పరమేశ్వరాంశ కలిగినవాడు. ఈ స్వామిని చూడనిదే కాశీ యాత్ర పూర్తి కానట్లు.

కనుక అన్నింటా స్వామి ఉన్నాడని నమకమంత్రాలలో భావించుకొంటూ భక్తిగా చదవాలి.

**17 నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చ వో నమః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |



| | | |
|---|---|---|
| శ్వభ్యః | = | కుక్కల రూపములలో ఉన్న, |
| శ్వపతిభ్యః + చ | = | కుక్కల స్వాముల రూపములలో ఉన్న, |
| వః | = | మీకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓ రుద్రులారా! నమస్కారము. కుక్కల రూపములలో ఉన్న, కుక్కల స్వాముల రూపములో ఉన్న మీకు నమస్కారము.

**విశేషములు :**

కుక్కచావు (= దిక్కులేని చావు, నీచమైన చావు), కుక్కజట్టీ (= చిల్లర తగువు, కారణం లేకుండా పెట్టుకునే తగువు) ఇలా కుక్కను నీచంగా చిత్రించే మన పద బంధాల్లో 'కుక్క తులసి' అని ఒక పద బంధముంది. 'కుక్క తులసి' అంటే ఒకజాతి తులసి (the white basil, Ocimum albuoe, Ocimum canum). అంటే నీచంగా భావించే కుక్కను పవిత్రమైన తులసితో కలిపాం. ఇది అన్నింటిని సమానంగా చూసే శివమయమైన సంస్కృతి. అనేకరకాలుగా శివుని ఉపాసించిన జాతులు ఈ అనువాకములో పేర్కొనబడినవి.

*(ఇంతటితో నమకంలో చతుర్థానువాకం సమాప్తము)*





# పంచమానువాకం

**1 నమో భవాయ చ రుద్రాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భవాయ చ | = | ప్రపంచము యొక్క పుట్టుకకు కారణమైన వానికొఱకు, |
| రుద్రాయ చ | = | సంసార దుఃఖమును తొలగించునట్టి శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ప్రపంచము యొక్క పుట్టుకకు కారణమై, సంసార దుఃఖమును తొల గించునట్టి శివునకు నమస్కారము.

**విశేషాలు:**

ఈ మంత్రంలోని రుద్ర శబ్దంతో కలిసిన ప్రసిద్ధమైన పదబంధాలు ఇవి:

**1. రుద్రాభిషేకం :**

లింగాకృతిలో ఉండే శివుడి మీద, అంటే రుద్రుడిని అభిషేకించడం రుద్రాభిషేకం. పదకొండు అనువాకాలు కలిగిన నమకం పఠిస్తూ చేసే రుద్రాభిషేకం రుద్రం. అది ఒకసారి చేస్తే ఏకరుద్రం. పదకొండు సార్లు చేస్తే ఏకాదశరుద్రాభిషేకం. దీనిని "రుద్రి" అని కూడా అంటారు. పదకొండు ఏకాదశ రుద్రాభిషేకాలు చేస్తే అది లఘురుద్రాభిషేకం. పదకొండు లఘురుద్రాలు చేస్తే, అంటే 121ని 11తో హెచ్చవేస్తే ఎన్నిసార్లో అన్నిసార్లు అభిషేకాలు చేస్తే అది **మహారుద్రం** అవుతుంది. అలాంటి మహారుద్రాలు పదకొండు చేస్తే అది **అతిరుద్రం** అవుతుంది. అంటే పది నాలుగు వేల ఆరు వందల నలుబది ఒక్క సార్లు అభిషేకం చేయడం అతిరుద్రం.

**2. రుద్ర వింశతి :**

వింశతి అంటే ఇరవై. ప్రభవాది అరవై సంవత్సరాలలో చివరి ఇరవై సంవత్సరాలు. అంటే ప్లవ నుంచి అక్షయ (క్షయ అని కొందరంటారు)



వరకు రుద్ర వింశతి. ప్రభవ నుండి వ్యయ వరకు **బ్రాహ్మీ వింశతి,** సర్వజిత్ నుంచి పరాభవ వరకు **వైష్ణవీ వింశతి** అని పేర్లు పెట్టారు.

**3. రుద్రసంప్రదాయం :**

రుద్రుడి పేరుతో ఒక వైష్ణవసంప్రదాయం 15వ శతాబ్ది కాలంలో ఏర్పడి, ఉత్తరభారతంలో వ్యాప్తి చెందింది. ఆ కాలంలో వ్యాపించిన నాలుగు ప్రధాన వైష్ణవ శాఖలలో ఒకటిగా పేరు పొందింది. ఇందులో శ్రీకృష్ణుడే పరమాత్మ. భాగవతం పరమపవిత్రగ్రంథం. సాక్షాత్తు శివుడే శ్రీమహావిష్ణువు తనకు అందించిన విజ్ఞానంతో ఈ సంప్రదాయాన్ని ప్రారంభించాడని ఈ సంప్ర దాయం వారి విశ్వాసం. ఈ సంప్రదాయానికి విష్ణుస్వామి అనే ఆయన ఆద్యుడని కొందరు పరిశోధకులు తేల్చారు. విష్ణుస్వామి ఏకాలం వాడో పరిశోధకులు తేల్చలేకపోయారు. ఈ సంప్రదాయంలో సంన్యసించడం అనేది లేదు. గృహస్థాశ్రమంలో ఉండే మోక్షాన్ని సాధించవచ్చు. కాలక్రమంలో రుద్ర వైష్ణవం విష్ణుస్వామి మార్గమనీ, వల్లభ మార్గమనీ రెండు శాఖలుగా చీలిపోయింది. రుద్ర సంప్రదాయ తత్త్వాన్ని శుద్ధాద్వైతం అన్నారు.

**4. పంచ – రుద్రములు :**

1. అథర్వశిఖా రుద్రము, 2. కైవల్య రుద్రము, 3. కాలాగ్ని రుద్రము, 4. శ్వేతాశ్వతర రుద్రము, 5. రుద్రము.

**5. యజుస్సులు**

ఈ అనువాకమునుండి మొదట నమస్కారముగల (నమః ) యజుస్సులు ప్రారంభమయినవి.

**2 నమశ్శర్వాయ చ పశుపతయే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శర్వాయ చ | = | శర్వునికొఱకు,,(పాపములను హింసించువాడు) |
| నమః | = | నమస్కారము, |
| పశుపతయే చ | = | పశుపతి కొఱకు కూడా నమస్కారము. |



**తాత్పర్యము :**

శర్వుడైన, పశుపతియైన శివునకు నమస్కారము.

**విశేషము :**

1. శర్వుడు అనగా ప్రళయకాలమున భూతములను హింసించువాడు.
2. పశువులనగా జీవులు. వారిని సంసార బంధమునుండి రక్షించువాడు పశుపతి.
3. నేపాల్ దేశ రాజధాని ఖాట్మండు ఈశాన్య దిక్కులో పశుపతినాథ్ దేవాలయం ఉన్నది. ఇక్కడ శివుని అష్టమూర్తులలో ఒకటయిన యజమానలింగము ఉంది.

**శివుని అష్టలింగములు ఇవి :**

1. భూలింగము – ఏకామ్రేశ్వరశివలింగము – **శివకంచి,** తమిళనాడు
2. జలలింగము – జంబుకేశ్వర శివలింగము – **జంబుకేశ్వరం,** తిరుచునాపల్లి, తమిళనాడు
3. తేజోలింగము – అరుణాచలేశ్వర శివలింగము – **తిరువణామలై,** తమిళనాడు.
4. వాయులింగము – శ్రీకాళహస్తీశ్వర శివలింగము – **శ్రీకాళహస్తి,** చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
5. ఆకాశలింగము – చిదంబరేశ్వర లింగము – **చిదంబరం,** తమిళనాడు
6. యజమానలింగము – పశుపతినాథ శివలింగము – **ఖాట్మండు,** నేపాల్
7. సూర్యలింగము – సూర్య శివలింగము – **కోణార్క్,** ఒరిస్సా
8. చంద్రలింగము – చంద్రనాథ శివలింగము – **సీతాకుండ్,** చట్గావ్, బంగ్లాదేశ్

**3. నమో నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| నీలగ్రీవాయ చ | = | నల్లని విషపు మచ్చ కంఠమునందు కలవాని కొఱకు, |



| | | |
|---|---|---|
| శితి కంఠాయ చ | = | తెల్లని కంఠము కలవాడు అయిన శివునికొఱకు, నమస్కారము. |

**తాత్పర్యము :**

నల్లని విషపు మచ్చ కంఠమునందు కలవాడు, తెల్లని కంఠము కలవాడు అయిన శివునకు నమస్కారము.

**విశేషము :**

**1. నీలగ్రీవుడు :**

లోకముల రక్షణార్థము విషమును కంఠమున ధరించినవాడు కనుక నీలగ్రీవుడు అని శివునికి పేరు వచ్చింది. ఇక్కడ శివుని ఆర్తరక్షణ శీలము చెప్పబడింది.

2. వేయింట ఒక భాగము మాత్రమే నలుపు.మిగతా శివుని కంఠమంతయూ తెలుపే.

**4. నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| కపర్దినే చ | = | కపర్దము అనెడి జటాజూటము కలవానికొఱకు, |
| వ్యుప్తకేశాయ చ | = | జుత్తు లేనివాడు అయిన శివుని కొఱకునమస్కారము. |

**తాత్పర్యము :**

కపర్దము అనెడి జటాజూటము కలవాడు, జుత్తు లేనివాడు అయిన శివునకు నమస్కారము.

**విశేషము :**

1. కపర్దములు కలవాడు కపర్ది. అనగా జటలు కలవాడు. 'వ్యుప్తకేశుడు' అనగా క్షవరము చేసికొన్న శిరస్సు కలవాడు.(సన్యాసి) ఈ రెండు చాలా విరుద్ధమైన అర్థాలు కల పదాలు. '**చతుర్భి స్సహశిష్యైః...**" అని వాయు



పురాణంలో పరమేశ్వరుడు నల్గురు శిష్యులతో సహా గురువుగా అవతరిస్తారని ఒక అర్థం ఉంది. ఈ అర్థం ప్రకారం **'వ్యుప్తకేశులు'** అంటే, జుత్తు లేని శంకరాచార్యులే అని భాష్యకారులు తీర్మానించారు.

**5 నమస్సహస్రాక్షాయ చ శతధన్వనే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| సహస్రాక్షాయ చ | = | ఇంద్రరూపములో వేయి కన్నులు కలవానికొఱకు, |
| శతధన్వనే చ | = | అనేక ధనుస్సులు కలవాడు అయిన శివునికొఱకు, నమస్కారము. |

**తాత్పర్యము :**

ఇంద్రరూపములో వేయి కన్నులు కలవాడు, అనేక ధనుస్సులు కలవాడు అయిన శివునకు నమస్కారము.

**విశేషము :**

వివిధ సందర్భములలో ప్రణవము, వేదము, మేరు పర్వతము, పినాకము మొదలైన ధనుస్సులు ధరించినవాడు కనుక శివునకు శతధన్వుడు అని పేరు

**6. నమో గిరిశాయ చ శిపివిష్టాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| గిరిశాయ చ | = | కైలాసమున నివసించువానికొఱకు, |
| శిపివిష్టాయ చ | = | విష్ణురూపములో ఉండు శివునికొఱకు నమస్కారము. |

**తాత్పర్యము :**

కైలాసమున నివసించువాడును, విష్ణురూపములో ఉండు శివునకు నమస్కారము.



**విశేషములు :**

1. గిరౌ శేతే – కైలాసములో శయనించువాడు కనుక శివునకు గిరిశుడు అని పేరు వచ్చింది. లేదా గిరామ్ ఈశః – గిరిశః – వాచకములగు వేదములకు ప్రణవమునకు నాథుడు గిరిశుడు.
2. పశువులయందు (= జీవులయందు) వ్యాపించినవాడు కనుక శివుడు శిపివిష్టుడు.
3. శిపివిష్టుడనే పదం శివకేశవుల అభేదాన్ని చెబుతుంది. (విష్ణుః శిపివిష్టః
4. శిపి అనగా వెలుగులయందు, విష్టుడు అనగా వ్యాపించిన వాడు కనుక విష్ణువుకు శిపివిష్టుడని పేరు వచ్చిందని **విష్ణుసహస్రనామ భాష్యము.**
5. శిపి అనగా పశువులయందు విష్టుడు అనగా వ్యాపించి సేవలందు కొనేవాడు కనుక శివునకు శిపివిష్టుడని పేరు వచ్చిందని **అమరకోశము.**

**7. నమో మీఢుష్టమాయ చేషుమతే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| మీఢుష్టమాయ చ | = | మేఘ రూపములో బాగా వర్షము కురిపించు వానికొఱకు(విశ్వకర్త), |
| ఇషుమతే చ | = | దుష్టులను బాధించుటకు బాణములు కలిగిన శివునికొఱకు నమస్కారము. |

**తాత్పర్యము :**

మేఘరూపములో బాగా వర్షము కురిపించువాఁడు (విశ్వ కర్త), దుష్టులను బాధించుటకు బాణములు కలిగిన శివునకు నమస్కారము.

**8. నమో హ్రస్వాయ చ వామనాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| హ్రస్వాయ చ | = | బాగా తక్కువ పరిమాణములో కురుచగా ఉన్నశివునికొఱకు |



| | | |
|---|---|---|
| వామనాయ చ | = | వామనావతారములో ఉన్న శివుని కొఱకు నమస్కారము. |

**తాత్పర్యము :**

బాగా తక్కువ పరిమాణములో ఉన్న, వామనావతారములో ఉన్న శివునకు నమస్కారము.

**విశేషములు :**

1. 'హ్రస్వ' శబ్దము దహరాకాశంలో ఉన్న (హృదయ కమలంలో ఉన్న చిదాకాశం) మూర్తిని, 'వామన' శబ్దము మహాగణపతిని సూచిస్తుంది.

2. **'ఆకారో హ్రస్వః గుణాస్తు విపులాః'** short is his stature, great his fame అన్నట్లు శివుని ఆకారము చిన్నదయినా గుణములు విపులములు.

**9. నమో బృహతే చ వర్షీయసే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము, |
| బృహతే చ | = | ఆకారములో పెద్దవాడైన శివునికొఱకు, |
| వర్షీయసే చ | = | గుణములచే సమృద్ధుడైన శివునికొఱకు నమస్కారము. |

**తాత్పర్యము :**

నమస్కారము. ఆకారములో పెద్దవాడైన, గుణములచే సమృద్ధుడైన శివునకు నమస్కారము.

**విశేషములు :**

**'బృహత్తు'** అనునది త్రికాలములలో ఉన్న, త్రికాలములకు సంబంధించిన పరబ్రహ్మమునకు కూడా పర్యాయ పదము.

**10. నమో వృద్ధాయ చ సంవృధ్వనే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వృద్ధాయ చ | = | బాగా వయస్సు మళ్లినశివునికొఱకు, |



| | | |
|---|---|---|
| సంవృద్ధ్వనే చ | = | సాటిలేని వేద కీర్తనలచే వృద్ధి పొందిన వాడును అగు(పొగడబడిన) శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

బాగా వయస్సు మళ్లినవాడును, సాటిలేని వేద కీర్తనలచే వృద్ధి పొందినవాడును అగు (వేదములచే పొగడబడినవాడగు) శివునకు నమస్కారము.

**విశేషములు :**

1. 'వృద్ధ' శబ్దము శివుని యొక్క సర్వపూజాధిక్యతను తెలియచేస్తుంది.

2. 'సంవృద్ధ్వ' శబ్దము భక్తులకు వరములను సంవృద్ధి చేయువాడను ఇంకొక అర్థాన్ని ఇస్తుంది.

**11. నమో అగ్రియాయ చ ప్రథమాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అగ్రియాయ చ | = | ఈ విశ్వము పుట్టడానికి పూర్వము ఉన్నశివుని కొఱకు, |
| ప్రథమాయ | = | అందరికంటె ముందు ఉన్నశివుని కొఱకు, (ఉత్తముడనిభావం) |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఈ విశ్వము పుట్టడానికి పూర్వము ఉన్నవాడు, అందరికంటె ముందు ఉన్నవాడు అయిన శివునకు నమస్కారము.

**12. నమ ఆశవే చాజిరాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఆశవే చ | = | అంతటా వ్యాపించినశివునికొఱకు, |
| అజిరాయ చ | = | ప్రతిచోటకు వెళ్లగలిగిన సర్వ సమర్థుడు అయిన శివునికొఱకు, |



నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

అంతటా వ్యాపించినవాడు, ప్రతిచోటకు వెళ్లగలిగిన సర్వసమర్థుడు అయిన శివునకు నమస్కారము.

**13 నమశ్శీఘ్రియాయ చ శీభ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

శీఘ్రియాయ చ = వేగముగా వెళ్లు శివునికొఱకు,

శీభ్యాయ చ = నీటి ప్రవాహాలలో ఉన్న శివునికొఱకు,

నమః = నమస్కారము.

**తాత్పర్యము**

వేగముగా వెళ్లువాడును, నీటి ప్రవాహాలలో ఉన్న శివునకు నమస్కారము.

**14 నమ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

ఊర్మ్యాయ చ = తరంగములతో కూడియున్న శివునికొఱకు,

అవస్వన్యాయ చ = చప్పుడు లేని స్థిరంగా ఉన్న నీటిలో ఉన్న శివుని కొఱకు

నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

తరంగములతో కూడియున్న, చప్పుడు లేని స్థిరంగా ఉన్న నీటిలో ఉన్న శివునకు నమస్కారము.

**15 నమస్స్రోతస్యాయ చ ద్వీప్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

స్రోతస్యాయ చ = ప్రవాహములో ఉన్నట్టి శివునికొఱకు ,

ద్వీప్యాయ చ = నీటి మధ్యలో ఉన్న ద్వీపములలో ఉన్నట్టి శివునికొఱకు,



నమః = నమస్కారము

**తాత్పర్యము :**

ప్రవాహములో ఉన్నట్టి, నీటి మధ్యలో ఉన్న ద్వీపములలో ఉన్నట్టి (భూమిలో ఉన్నట్టి) శివునకు నమస్కారము.

**విశేషములు :**

1. తనంతట పారుచున్న ప్రవాహాన్ని **స్రోతస్సు** అంటారు.
2. **ద్విధా గతః ఆపః అస్మిన్నితి ద్వీపః** – దేనియందు నీరు రెండు భాగాలుగా ప్రవహిస్తుందో దానిని ద్వీపము అంటారు.
3. శివుడు అన్నిచోట్ల ఉన్నాడనే విషయాన్ని ఈ మంత్రం స్పష్టం చేస్తోంది.

***(పంచమానువాకము సమాప్తము)***





# షష్ఠానువాకం

**1. నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| జ్యేష్ఠాయ చ | = | విద్య, ఐశ్వర్యము మొదలైనవాటిలో పెద్దవాడయిన శివునికొఱకు; |
| కనిష్ఠాయ చ | = | విద్యాదులు లేని ఆకృతులలో చిన్నవాడును అగు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

విద్య, ఐశ్వర్యము మొదలైనవాటిలో పెద్దవాడు, విద్యాదులు లేనివారిలో చిన్నవాడును అగు పరమేశ్వరునకు నమస్కారము.

**విశేషాలు :**

జ్యేష్ఠుఁడు = 1. అగ్రజుడు, 2. మిక్కిలి వృద్ధుడు 3. మిక్కిలి శ్రేష్ఠుడు; కనిష్ఠుడు = 1.తమ్ముఁడు,2. మిక్కిలి అల్పుడు, 3. మిక్కిలి కొంచెపు వయస్సు కలవాడు. అన్ని రూపాలు శివుడేనని భావము.

**2. నమః పూర్వజాయ చాపరజాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| పూర్వజాయ చ | = | ప్రపంచము పుట్టకకుముందు ఉన్న శివునికొఱకు (ప్రపంచము పుట్టుకకు కారణమైనవాడు) |
| అపరజాయ చ | = | ప్రపంచము నశించేసమయములో అగ్నిరూపంలో ఉండే శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ప్రపంచము పుట్టుకకుముందు ఉన్నవాడు (ప్రపంచము పుట్టుకకు కారణమైన వాడు), ప్రపంచము నశించే సమయములో అగ్నిరూపంలో ఉండేవాడు అయిన శివునకు నమస్కారము.

**3. నమో మధ్యమాయ చాపగల్భాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| మధ్యమాయ చ | = | మధ్యమ కాలమున అనగా దేవ మనుష్యాది రూపములో ఉన్న శివునికొఱకు |
| అపగల్భాయ చ | = | బాలునిరూపములో ఉన్న శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

దేవమనుష్యాదిరూపములో ఉన్న శివునికొఱకు ,బాలునిరూపములో ఉన్న శివునికి నమస్కారము.

**విశేషాలు :**

సృష్టికి, లయానికి మధ్య ఉన్న స్థితిని "మధ్యమాయ" అను పదం సూచిస్తుంది. సృష్టిలోని అన్ని రూపాలు శివునివే అని తాత్పర్యము.

**4. నమో జఘన్యాయ చ బుధ్నియాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| జఘన్యాయచ | = | ఆవుల వెనుకభాగమున నడిచే దూడల రూపములో ఉన్న శివుని కొఱకు |
| బుధ్నియాయ చ | = | వృక్షముల మూలమైన వేర్ల రూపములో ఉన్న శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఆవుల వెనుకభాగమున నడిచే దూడలరూపములో ఉన్నవాడును, వృక్షముల మూలమైన వేర్ల రూపములో ఉన్న శివునకు నమస్కారము.

**విశేషాలు :**

జఘనమునందు(వెనుక భాగమునందు) పుట్టినవి జఘన్యములు.

బుధ్నమునందు అనగా మూలమునందు పుట్టినవి బుధ్నియములు.

**5. నమస్సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సోభ్యాయ చ | = | మనుష్య లోకములో కనిపించు శివుని కొఱకు |
| ప్రతిసర్యాయ చ | = | కదిలే జీవులలో అంతర్యామిగా ఉండే శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

మనుష్య లోకములో కనిపించువాడును, కదిలే జీవులలో అంతర్యామిగా ఉండేవాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. వేదంలో 'ఉభాభ్యమేవ మనుష్యలోకం' అని ఉన్నది. కనుక మనుష్యులతో నిండిన ఈ ప్రపంచాన్ని 'సోభ' అంటారు. మానవుడు పాపము, పుణ్యము రెండింటితో కూడుకొని ఉన్నవాడు కనుక సోభుడు అని పిలువబడతాడు.
2. అయితే మహాభారతంలో **'సాల్వః సోభమధిష్ఠాయ'** అను శ్లోకపాదంలో సోభః అంటే గంధర్వుల పట్టణంగా చెప్పబడింది.
3. దీక్షాదులలో ముంజేతగట్టిన తాడును ప్రతిసరము అంటారు. (రక్షాబంధనము)



**6. నమో యామ్యాయ చ క్షేమ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యామ్యాయ చ | = | యమలోకంలో పాపులను శిక్షించువాని రూపంలో ఉన్న శివునికొఱకు |
| క్షేమ్యాయ చ | = | స్వర్గలోకంలో మంచివారిని కాపాడు రూపంలో ఉన్నశివునికొఱకు; |
| నమః | = | నమస్సులు. |

**తాత్పర్యము :**

యమలోకంలో పాపులను శిక్షించువాని రూపంలో ఉన్నవాని కొరకు, స్వర్గలోకంలో మంచివారిని కాపాడు రూపంలో ఉన్నశివునికొఱకు నమస్సులు.

**విశేషాలు :**

క్షేమశబ్దము మోక్షప్రదాతగా శివుని సూచిస్తుంది. కనుక క్షేమ్యాయకు మోక్షస్థానమునందున్న శివునికొఱకు అని ఇంకొక అర్థము.

**7. నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఉర్వర్యాయ చ | = | అన్నిరకాల ఆహారధాన్య విశేషములలో ఉన్న శివునికొఱకు, |
| ఖల్యాయ చ | = | నాగలిరూపములో భూమిని దున్ను శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

అన్నిరకాల ఆహారధాన్య విశేషములలో ఉన్నవాడును, నాగలిరూపములో భూమిని దున్నువాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

పశువులను కట్టుటకు పాతిన గుంజ కూడ ఖలమని పేరుతో పిలువ బడుతుంది.



**8. నమశ్శ్లోక్యాయ చావసాన్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శ్లోక్యాయ చ | = | కర్మకాండలోని వేదమంత్రములచే తెలియదగిన మహిమ కల శివుని కొఱకు, |
| అవసాన్యాయ చ | = | ఉపనిషత్తులచే కొనియాడబడినవాడును అగు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కర్మకాండలోని వేదమంత్రములచే తెలియదగిన మహిమ కలవాడును, ఉపనిషత్తులచే కొనియాడబడినవాడును అగు శివునకు నమస్కారము.

**9. నమో వన్యాయ చ కక్ష్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వన్యాయ చ | = | అడవిలోని చెట్ల రూపములో ఉన్న శివునికొఱకు, |
| కక్ష్యాయ చ | = | లతల రూపములో ఉన్న శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

అడవిలోని చెట్ల రూపములో ఉన్నవాడును, లతల రూపములో ఉన్నవాడును అగు శివునకు నమస్కారము.

**10. నమశ్శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శ్రవాయ చ | = | శబ్ద రూపములో ఉన్న శివునికొఱకు, |
| ప్రతిశ్రవాయ చ | = | ప్రతిధ్వని రూపములో ఉన్న శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

శబ్ద రూపములో ఉన్న, ప్రతిధ్వని రూపములో ఉన్న శివునకు నమస్కారము.

**విశేషములు :**

"**కర్ణ శబ్ద గ్రహౌ శ్రోత్రం శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః** "అని అమరం శ్రవస్ శబ్దాన్ని చెవి పేరుగా చెప్పినప్పటికీ ఇక్కడ శబ్దమనియే భావార్థము.

**11. నమ ఆశుషేణాయ చాశురథాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఆశుషేణాయ చ | = | వేగముగా నడచు సైన్యము కలిగినశివునికొఱకు, |
| ఆశురథాయ చ | = | వేగముగా పోవు రథము కలిగినవాడు అయిన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

**భక్తులను కాపాడుట** కొఱకు వేగముగా నడచు సైన్యము కలిగినవాడు, వేగముగా పోవు రథము కలిగినవాడు అయిన శివునకు నమస్కారము.

**12. నమశ్శూరాయ చావభిందతే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శూరాయ చ | = | శూరుడయిన శివునికొఱకు, |
| అవభిందతే చ | = | ధర్మనాశకుల శిరస్సులను పగలగొట్టు (సంహరించు) శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

శూరుడును, ధర్మ నాశకులను సంహరించు వాడగు శివునకు నమస్కారము



**విశేషాలు :**

యుద్ధమునకు భయపడనివాడు శూరుడు. శూరయతీతి శూరః = విక్రమించువాడు శూరుడు.

**13. నమో వర్మిణే చ వరూథినే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వర్మిణే చ | = | కవచము కలిగిన శివునికొఱకు, |
| వరూథినే చ | = | చక్కటి గృహము కలిగినశివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కవచము కలిగిన వాడును, చక్కటి గృహము కలిగినవాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. వృణోతి శరీరం వర్మ = శరీరమును కప్పు కవచము అని అమరము వర్మ శబ్దానికి అర్థం చెప్పింది.
2. వ్రియతే రథోనేనేతి వరూథః = రథము దేనిచేత రక్షింపబడునో అది వరూథము అని అర్థము. ఇక్కడ వరూథ శబ్దమునకు చక్కటి గృహమని అర్థం దృఢీకరింపబడినది.

**14. నమో బిల్మినే చ కవచినే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| బిల్మినే చ | = | యుద్ధమున తలను కాపాడు కిరీటము కలశివుని కొఱకు, |
| కవచినే చ | = | శరీరాన్ని రక్షించే కవచము కల శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

యుద్ధమున తలను కాపాడు కిరీటము కలవాడు, శరీరాన్ని రక్షించే కవచము కల శివునకు నమస్కారము.



**విశేషము :**

1. ఈ నమక మంత్రకవచము (a certain mystical syllable considered as a preservative like an armour) మన శరీరాన్ని ఆయుధ బాధలనుండి కాపాడుతుంది.
2. **'బిల్మినేచ'**కు– భస్మపాత్ర కలవాని కొఱకు అని ఇంకొక అర్థం.

**15. నమశ్శ్రుతాయ చ శ్రుతసేనాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శ్రుతాయ చ | = | వేదములందు ప్రసిద్ధుడైనశివునికొఱకు; |
| శ్రుతసేనాయ చ | = | ప్రసిద్ధమైన సైన్యము కలశివునికొఱకు; |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

వేదములందు ప్రసిద్ధుడైనవాడు, ప్రసిద్ధమైన సైన్యము కలవాడు అగు శివునకు నమస్కారము.

***(షష్ఠానువాకం సమాప్తము)***





# సప్తమానువాకం

**1. నమో దుందుభ్యాయ చాహన్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| దుందుభ్యాయ చ | = | దుందుభి(భేరి)లో శబ్ద రూపములో ఉన్న శివునికొఱకు, |
| ఆహన్యాయ చ | = | భేరిని మోగించుటకు ఉపకరించు పుల్ల రూపములో ఉన్నశివునికొఱకు, (నాద స్వరూపుడును) అగు శివునకు, |
| నమః | = | నమస్కారము, |

**తాత్పర్యము :**

దుందుభిలో శబ్ద రూపములో ఉన్నవాడును, భేరిని మోగించుటకు ఉపకరించు పుల్ల రూపములో ఉన్నవాడును, (నాద స్వరూపుడును) అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

శివునియొక్క సర్వ వ్యాపకత్వములో భాగంగా భేరిలో ఉన్నాడని ఇందులో చెప్పబడినది.

**2. నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ధృష్ణవే చ | = | యుద్ధమున వెన్ను చూపి పారిపోని శివునికొఱకు, |
| ప్రమృశాయ చ | = | శత్రుసైన్యములో ఉన్న తికమకలు, చిక్కులు బాగా తెలిసినవాడును అగు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

యుద్ధమున వెన్ను చూపి పారిపోని వాడును, శత్రుసైన్యములో ఉన్న తికమకలు, చిక్కులు బాగా తెలిసినవాడును అగు శివునకు నమస్కారము.

**విశేషము :**

శివుడు మహావీరుడని సారాంశము.

**'ధృష్ణవేచ '** కు సమస్త లోకములను కాపాడుశివునికొఱకు అని ఇంకొక అర్థము.

**3. నమో దూతాయ చ ప్రహితాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| దూతాయ చ | = | మన అభిప్రాయములను ఎదుటి వారికి అంద జేయుటలోను, తిరిగివారి అభిప్రాయము తెలుసుకొనుటలోనూ నేర్పరియైనశివునికొఱకు |
| ప్రహితాయ చ | = | శాస్త్రాదిజన్యపరిజ్ఞానముకల వ్యుత్పన్నుడయిన శివునికొఱకు; (పంపబడువాని కొఱకు) |
| నమః | = | నమస్కారము; |

**తాత్పర్యము :**

మన అభిప్రాయములను ఎదుటివారికి అందజేయుటలోను, తిరిగి వారి అభిప్రాయము తెలుసుకొనుటలోనూ నేర్పరియై, శాస్త్రాదులు చదువుట వలన కలిగిన పరిజ్ఞానము కల పండితుడయిన శివునకు నమస్కారము.

**విశేషాలు :** 1. దూతలు ముగ్గురు.

1. నిసృష్టార్థుడు (స్వప్రజ్ఞచే స్వామి కార్యమును సాధించువాడు),
2. మితార్థుడు (మితభాషియై స్వామికార్యమును సాధించువాడు),
3. సందేశహారకుడు (స్వామి సందేశమును మాత్రమే తెలుపువాడు).



**"నిసృష్టార్థో మితార్థశ్చ తథా సందేశహారకః కార్యప్రేష్యస్త్రిధా దూతః"** (సాహిత్యదర్పణము3-47)

2. శివుని అన్ని వృత్తులలోనూ, అంతటా చూచు దృష్టితో ఈ దూతాది శబ్దములు ఆయనకు ప్రయోగింపబడినవని తెలుసుకోవాలి.

**4. నమో నిషఙ్గిణే చేషుధిమతే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నిషఙ్గిణే చ | = | ఖడ్గము కలిగినశివునికొఱకు, |
| ఇషుధిమతే చ | = | అమ్ముల పొది కలిగిన శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఖడ్గము కలిగినవాడును, అమ్ముల పొది కలిగిన వాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. స్వామి దుష్టులను సంహరించి శిష్టులను రక్షిస్తాడనే భావనను పెంపొందిస్తుంది ఈ మంత్రం.
2. ఇషుధి = అమ్ములపొది. వ్యు. ఇషవః ధీయంతే అత్ర – ఇషు + ధా + కిః. (క ృ.ప్ర.) 3. నిషఙ్గిన్ పదానికి విలుకాడు అను అర్థము ప్రసిద్ధమైనప్పటికి, పునరుక్తి దోష పరిహారార్థం ఖడ్గము అను అర్థము స్వీకరింపబడినది.

నిషఙ్గిన్ : having a quiver (or sword?) Monier Willam's Sanskrit-English Dictionary, 2nd Ed. 1899

**5. నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తీక్ష్ణేషవే | = | వాడియైన బాణములు కలశివునికొఱకు, |
| ఆయుధినేచ | = | అనేకరకములైన ఆయుధములు కల వాడును అగు శివునికొఱకు; |



నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

వాడియైన బాణములు కలవాడును, అనేకరకములైన ఆయుధములు కలవాడును అగు శివునకు నమస్కారము

**విశేషాలు :**

1. వాడిగా, చురుకుగా ఉంటే తీక్ష్ణము.
2. ఇషు అంటే బాణము. ఇషువేగక్షయ న్యాయము అని ఒక న్యాయము. అంటే ప్రారంభములో మంచి వేగముతో వెళుతున్న బాణము క్రమక్రమముగా లక్ష్యస్థానము చేరు సమయములో వేగము తగ్గే పద్ధతి. (**శబ్దార్థదీపిక ముసునూరి వేంకటశాస్త్రి1956)**

**6. నమస్స్వాయుధాయ చ సుధన్వనే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| స్వాయుధాయ చ | = | చక్కటి ఆయుధములు కలశివునికొఱకు; |
| సుధన్వనే చ | = | చక్కటి పినాకమనే ధనుస్సు కలవాడును అగు శివునికొఱకు; |

నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

చక్కటి ఆయుధములు కలవాడును, చక్కటి పినాకమనే ధనుస్సు కల వాఁడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. "స్వాయుధ" అంటే well-armed, having good weapons (Monier Willam's Sanskrit-English Dictionary, 2nd Ed. 1899) అని నిఘంటువులలో అర్థం.
2. త్రిపురాలను దహించే సమయంలో శర జ్వాలల చేత స్వర్గాన్ని కప్పినది కాబట్టి శివుని విల్లుకు పినాకము అని పేరు వచ్చింది.
3. త్రిశూలము అని స్వాయుధ పదానికి ఇంకొక అర్థం.



**7. నమః సృత్యాయ చ  చ పథ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సృత్యాయ చ | = | ఒక్క మనిషి మాత్రమే నడువగలిగే త్రోవ కలశివునికొఱకు; |
| పథ్యాయ చ | = | రథము, అశ్వము మొదలైనవి నడువగల్గిన మార్గము కలిగినశివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఒక్క మనిషి మాత్రమే నడువగలిగే త్రోవ కలవాడును, రథము, అశ్వము మొదలైనవి నడువగల్గిన విశాల మార్గము కలిగిన వాడగు శివునకు నమస్కారము.

**విశేషములు :**

1. సరంతి అనేన సృతిః దీనిచేత సంచరింతురు కనుక త్రోవకు సృతి అనిపేరు.
2. అన్ని మార్గాలు శివునికి సంబంధించివని భావము.

**8. నమః కాట్యాయ చ నీప్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కాట్యాయ చ | = | అల్పమైన జలము ప్రవహించు చోటు కటము. (కాలువ) అక్కడ నీటిరూపములో ఉన్నశివునికొఱకు, |
| నీప్యాయ చ | = | కింది వైపుగ(సెలయేరు), అడ్డముగా ప్రవహించే నీట రూపములో ఉన్న శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కాలువ యందు నీటిరూపములో ఉన్న మరియూ సెలయేరులలో నీటి రూపములో ఉన్న  పరమశివునకు నమస్కారము.



**విశేషాలు :**

నీరు ఉన్న అన్ని చోట్ల పరమశివుడున్నాడు. కాని ఇలా కాలువ అని, సెలయేరు అని విడివిడిగా చెప్పుటలో స్వామిని పదే పదే నుతించాలని మనం అర్థం చేసుకోవాలి.

కాటమనగా కటియందు భవము(లింగము). దానియందున్నవాడని ఇంకొక అర్థము.

**9. నమస్సూద్యాయ చ సరస్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సూద్యాయ చ | = | బురద ప్రదేశములో నీటి రూపములో ఉన్న శివునికొఱకు |
| సరస్యాయ చ | = | సరస్సులలో నీటి రూపములో ఉన్న శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

బురద ప్రదేశములో నీటి రూపములో ఉన్న, సరస్సులలో నీటి రూపములో ఉన్న వాడును అగు శివునకు నమస్కారము.

**10. నమో నాద్యాయ చ వైశన్తాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నాద్యాయ చ | = | నదులలో నీటి రూపములో ఉన్న శివునికొఱకు; |
| వైశన్తాయ చ | = | అల్పమైనపల్లపుప్రాంతములలో నీటిరూపములో ఉన్న శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

నదులలో నీటి రూపములో ఉన్న శివునకు అల్పమైన పల్లపు ప్రాంతము లలో నీటి రూపములో ఉన్న శివునకు నమస్కారము.



**విశేషాలు :**

నదతీతి నదీ– మ్రోగుతుంది కాబట్టి నది అని పేరు.

నీళ్లుగల చిన్నపల్లమును **వేశంతము** అంటారు. వేశంత శబ్దమునుండి వైశన్త పదము పుట్టినది. నీళ్లు ఉన్న అన్నిచోట్ల శివుడు ఉన్నాడని ఈ మంత్రం చెబుతోంది.

**11. నమః కూప్యాయ చావట్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కూప్యాయ చ | = | నూతిలో నీటి రూపములో ఉన్న శివుని కొఱకు; |
| అవట్యాయ చ | = | బొక్కలలో(పల్లములలో) నీటి రూపములో ఉన్న శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

నూతిలో నీటి రూపములో ఉన్నవానికి, బొక్కలలో నీటి రూపములో ఉన్న శివునకు, నమస్కారము.

**12. నమో వర్ష్యాయ చావర్ష్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వర్ష్యాయ చ | = | వర్షపు నీటిలో ఉన్నశివునికొఱకు; |
| అవర్ష్యాయ చ | = | వర్షముగా కురవని సముద్ర జలములలో ఉన్నశివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

వర్షపు నీటిలో ఉన్నవానికి, వర్షములేని కరువు పరిస్థితిలో ఉన్నవానికి (అనగా వర్షముగా కురవని సముద్ర జలములలో ఉన్నవానికి) నమస్కారము.

**విశేషాలు :**

వర్షమనే పదానికి తడుపునట్టిది అని అర్థం. (వర్షతీతి – వృషు సేచనే)

**13. నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**



| | | |
|---|---|---|
| మేఘ్యాయ చ | = | మేఘములలో ఉన్న శివునికొఱకు; |
| విద్యుత్యాయ చ | = | మెరుపులలోఉన్న (మెరుపులతోకూడ ఉన్న) శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

మేఘములలో ఉన్న శివునికి, మెరుపులలో ఉన్న శివునికి, నమస్కారము.

**విశేషాలు :**

మేహతీతి మేఘః – తడుపునది కనుక మేఘమని పేరు. విశేషేణ ద్యోతత ఇతి విద్యుత్ – మిక్కిలి ప్రకాశిస్తుంది కనుక విద్యుత్తు అని మెరుపునకు పేరు.

**అభ్యర్థన :**

పరమశివా! ఒక్కొక్కసారి మా కళ్లల్లో నీళ్లు తప్పించి మేఘాలనుంచి మాకు నీటి చుక్క రావటం లేదయ్యా! తపించిపోతున్నాము. స్వామీ! హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను. మేఘాలతో, మెరుపులతో ఈ భూమిని వర్షాభావ స్థితిలో తడపవయ్యా! శతాధిక ప్రణామములు.

**14. నమ ఈధ్రియాయ చాతప్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఈధ్రియాయ చ | = | శరత్కాలములో ఉండే నిర్మలమయిన మేఘములో ఉండు శివునికొఱకు; |
| ఆతప్యాయ చ | = | ఎండకాసేటప్పుడు వర్షించు వర్షములో ఉన్న శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

శరత్కాలములో ఉండే నిర్మలమయిన మేఘములో ఉండువానికి, ఎండ కాసేటప్పుడు వర్షించు వర్షములో ఉన్న శివునికి నమస్కారము.

**విశేషము**

ఈధ్రియాయ చ అనగా అగ్ని మొదలగువాని సంయోగముచే కాచబడిన నీరు అని ఇంకొక అర్థము ప్రసిద్ధము.



**15. నమో వాత్యాయ చ రేష్మియాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వాత్యాయ చ | = | గాలితో గూడిన వానయందున్న శివునికొఱకు, |
| రేష్మియాయ చ | = | ప్రళయ కాలమునందు వర్ష స్వరూపము గల శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

గాలితో గూడిన వానయందున్న , ప్రళయకాలములో వర్షస్వరూపములోను ఉండు శివునకు నమస్కారము.

**విశేషము**

రేష్మమనగా గ్రీష్మర్తువని, గ్రీష్మర్తువులో రేగునట్టి దుమ్ము రేష్మమని కొందరు వివరించారు.

**16. నమో వాస్తవ్యాయ చ వాస్తుపాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వాస్తవ్యాయ చ | = | ఆవులు, గుఱ్ఱములు మొదలైన వాటియందు ఉన్న శివునికొఱకు; |
| వాస్తుపాయ చ | = | గృహ నిర్మాణమునకు సంబంధించిన భూమిని కాపాడు శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఆవులు, గుఱ్ఱములు మొదలైన వాటియందు ఉన్నవానికి, గృహ నిర్మాణమునకు సంబంధించిన భూమిని కాపాడు శివునికొఱకు నమస్కారము.

**విశేషాలు :**

ఏడవ అనువాకమంతా ఒకటే మహామంత్రము. కాకపోతే మనకు అర్థ సౌలభ్యం కోసం ఇలా పదహారు మంత్ర భాగాలుగా పెద్దలు విభజించారు.

***(సప్తమానువాకం సమాప్తము)***



# అష్టమానువాకం

**1. ఓం నమస్సోమాయ చ రుద్రాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సోమాయ చ | = | ఉమతో కూడియున్నశివునికొఱకు, |
| రుద్రాయ చ | = | దుఃఖమును పోగొట్టు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఉమతో కూడియున్నవాడు, దుఃఖమును పోగొట్టువాడును అయిన పరమశివునికి నమస్కారము.

**విశేషాలు :**

1. అష్టమూర్తులలో ఒకనిని రుద్రుడంటారు. ఇది శివునికి నామాంతరము.
2. బ్రహ్మపుత్రులలో ఒకనిని రుద్రుడంటారు. బ్రహ్మముఖము నుంచి ఇతడు పుట్టాడు. తాను పుట్టించిన సనకసనందనాదులు పరమ యోగులై సృష్టికర్తలు కాలేదని బ్రహ్మకు బాగా కోపము కలిగింది. ఆ కోపము రుద్రరూపములో బ్రహ్మయొక్క నుదుటి మధ్యలోనుండి రోదనము చేస్తూ పుట్టింది కాబట్టి ఇతనికి రుద్రుడు అని పేరు వచ్చింది.
3. శత్రువులను దుఃఖపెట్టువాడు కనుక శివునికి రుద్రుడని పేరు.
4. ఈశ్వరునకు ఉన్న రెండు శరీరములలో ఒకటి ఘోర శరీరము, రెండవది శివా శరీరము. ఘోర శరీరము గలవాడు రుద్రుడు.
5. “రుజాం ద్రావణతో రుద్రః” అన్ని రోగాలను హరించువాడు రుద్రుడు.
6. ‘విశ్వాధికో రుద్రో మహర్షి’ విశ్వముకన్న మించినవాడు రుద్రుడు.
7. శివపూజలలో నమకము, చమకము రెండు సూక్తములు తప్పక



చదువుతారు. రుద్రుని ఘోర శరీరము క్రోధముతో కూడినది. ప్రధానమైనది. ప్రసన్నత కొరకు నమః అను శబ్దముతో **'నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః"** అని నమకము ప్రారంభిస్తారు. మొదటి అనువాకముతో రుద్రుని ప్రసన్నునిగా చేస్తారు. ఇవే నమస్కార మంత్రాలు.

8. నమకములో మంత్రాలని జప, హోమ అర్చనాదులలో వాడతారు. రుద్రత్వము పోయిన తరువాత, శివునిగా మార్చిన పిమ్మట చమకము **'వాజశ్చ మే'** అంటూ ప్రారంభమవుతుంది. ఈ చమక మంత్రాలను కోర్కెలు పొందటానికి జపిస్తారు.
9. నమక చమకాలని పూర్తిగా జపాభిషేకములందు జపించుట రుద్రమంటారు. నమకము పూర్తిగా చెప్పి చమకము ఒక్కొక్క అనువాకము చొప్పున పదకొండు సార్లు చెబితే రుద్ర ఏకాదశి అంటారు.

**2. నమస్తామ్రాయ చారుణాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తామ్రాయ చ | = | ఉదయకాలములో తెలుపు ఎరుపు కలిసిన తామ్రవర్ణముతో సూర్య భగవానునిగా దర్శనమిచ్చు శివునికొఱకు, |
| అరుణాయ చ | = | ఉదయకాలము తరువాత నలుపు ఎరుపు కలిసిన అరుణవర్ణముతో సూర్యభగ వానునిగాదర్శన మిచ్చువాడగు శివుని కొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఉదయకాలములో తెలుపు ఎరుపు కలిసిన తామ్ర వర్ణముతో సూర్య భగవానునిగా దర్శనమిచ్చువాడును, ఉదయకాలము తరువాత నలుపు ఎరుపు కలిసిన అరుణ వర్ణముతో సూర్యభగవానునిగా దర్శనమిచ్చువాడగు శివునికి నమస్కారము.



**3. నమశ్శంగాయ చ పశుపతయే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శంగాయ చ | = | భక్తులకు సుఖములు కలిగించుశివుని కొఱకు, |
| పశుపతయే చ | = | పశువులనగా జీవులు. వారిని రబంధమునుండి రక్షించు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

భక్తులకు సుఖములు కలిగించువాడును, జీవులను సంసార బంధమునుండి రక్షించువాడును అగు శివునకు నమస్కారము.

**4. నమ ఉగ్రాయ చ భీమాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఉగ్రాయ చ | = | శత్రువులను నశింపచేయుటకు క్రోధముతో కూడినశివునికొఱకు |
| భీమాయ చ | = | శత్రువులకు భయమును కలిగించు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

శత్రువులను నశింపచేయుటకు క్రోధముతో కూడినవాడును, శత్రువులకు భయమును కలిగించువాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

ఉగ్రుడంటే అందరికంటె గొప్పవాడని ఇంకొక అర్థము కూడా ఉన్నది. “భీషాస్మాత్ వాతః పవతే’ అని శ్రుతి. ఆయనకు భయపడి గాలి వీస్తోంది. అగ్ని మండుతోంది. అంటే శివుడు అందరికంటె గొప్పవాడనే కదా అర్థం.

**5. నమో అగ్రేవధాయ చ దూరేవధాయ చ ।**

**ప్రతిపదార్థము :**



| | | |
|---|---|---|
| అగ్రేవధాయ చ | = | తన ఎదుట ఉన్న శత్రువులను నశింపచేయు శివునికొఱకు, |
| దూరేవధాయ చ | = | తనకు దూరముగా ఉన్న శత్రువులను వధించు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

తన ఎదుట ఉన్న శత్రువులను నశింపచేయువాడు, తనకు దూరముగా ఉన్న శత్రువులను వధించువాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

నమకములోని ఈ మంత్రానికి వివరణ మహాభారతములో కనిపిస్తుంది. మహా భారతములోని ద్రోణపర్వములో అర్జునుడు శివునికి సంబంధించిన ఈ ప్రశ్నను వ్యాసుని అడుగుతాడు.

**అవధరింపు మహాత్మ కయ్యమున నేను**
**శాత్రవుల నేయఁ బూనుచో సరభసముగ**
**నదరి ముందట నొకరుఁడు పుడమి నడుగు**
**లిడక పావకనిభమూర్తిఁ యెసక మెసఁగ.**

(ద్రోణపర్వము పంచమాశ్వాసము 422వ పద్యము)

వ్యాస మునీంద్రా! నేను యుద్ధం చేస్తున్నప్పుడు నా ముందు పాదములు నేలకంటకుండా ఉన్న ఒక ఆకారం అగ్నిదేవునిలా వెలిగి పోతూ కనిపించింది. తన చేతిలో ఉన్న శూలముతో నేను ఎవరిని చంపాలను కొంటున్నానో, ఆ శత్రువులను తాను చంపుతున్నాడు. అతడెవరో చెప్ప వలసినది" అని అర్జునుడు ప్రశ్నిస్తే తన ఎదుట ఉన్న శత్రువులను నశింప చేయువాడు పరమశివుడని వ్యాస భగవానుడు చెబుతాడు. (426 వ పద్యము)

**6. నమో హంత్రే చ హనీయసే చ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| హంత్రే చ | = | హింసించుశివునికొఱకు; (చంపువానికొఱకు) |



| | | |
|---|---|---|
| హనీయసే చ | = | బాగా హింసించుశివునికొఱకు, (అధికముగా చంపువానికొఱకు) |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

దురహంకారము, గర్వము, మదము, పొగరు కలిగినవారిలోని దుర్ల క్షణాలను హింసించువాడును, తనను ద్వేషించువారి ద్వేషగుణమును బాగా హింసించువాడును అగు శివునకు నమస్కారము.

**వివరణ :**

1. కైలాసపర్వతాన్ని తన రెండు చేతులతో లేపటానికి పొగరుతో దశ కంఠుడు ప్రయత్నించిన సందర్భంలో, పరమశివుడు రావణుని చేతిప్రేళ్ళని పర్వతము కింద త్రొక్కి హింసించాడు. ఇది రావణుని పొగరును హింసిం చుట.

2. దక్షుని ద్వేషగుణాన్ని, యజ్ఞ విధ్వంసరూపంలో శివుడు హింసించాడు.

**7. నమో వృక్షేభ్యో హరికేశేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| హరికేశేభ్యః | = | ఆకుపచ్చనిరంగుకల వెంట్రుకలవంటి పత్రములుకల |
| వృక్షేభ్యః | = | చెట్ల స్వరూపములో ఉన్నశివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఆకుపచ్చనిరంగుకల వెంట్రుకలవంటి పత్రములుకల చెట్ల స్వరూప ములో ఉన్నశివునికొఱకు, పరమశివునకు నమస్కారము.

**వివరణ :**

**వృశ్చ్యతే ఛిద్యత ఇతి వృక్షః** – ఛేదింపబడునది కనుక వృక్షమని పేరు వచ్చింది. ఈ మంత్రములోని వృక్షము కల్పవృక్షము మొదలైనవాటికి ప్రతీక. భక్తులకు శివుడు కల్పవృక్ష మే కదా! శివకంచిలో ఒక అద్భుతమైన మామిడి



వృక్షం కాండం కనపడుతూ ఉంటుంది. అది శివస్వరూపం. కనిపించే ప్రతి చెట్టుని శివస్వరూపంగా భావించమని ఈ మంత్రం వివరిస్తోంది.

**8. నమస్తారాయ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తారాయ | = | ఓంకార రూపియైన శివునికొఱకు (ఓంకారముచే ప్రతిపాదింపబడు వానికొరకు), |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఓంకార రూపియైన శివునకు నమస్కారము.

**వివరణ :**

తరింపజేసేది కనుక తారమని – 'ఓం'కారానికి పేరు. సంసారబంధాల నుంచి తరింపచేసేది కనుక తారకమని ఓంకారానికి ఇంకొక పేరు.

**9. నమశ్శంభవే చ మయోభవే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శంభవే చ | = | శం అనగా సుఖము. ఎవరి వలన ఈ |
| నమః | = | నమస్కారము. సుఖము కలుగుతుందో అతను శంభువు – అటువంటి శివునికొఱకు, |
| మయోభవే చ | = | ఉన్నత లోకములలో సుఖమునకు కారణమైన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఈ లోకములోను, ఉన్నత లోకములలోను సుఖమునకు కారణమైన శివునికి నమస్కారము.



**వివరణ :**

ఐహిక, ఆముష్మిక సుఖాలు, శంభువు వలన కలుగుతాయి. సకల ప్రపంచానికి శంభువు శుభ పరంపరను అనుగ్రహిస్తాడు. మంత్రపుష్పం ఆ సర్వేశ్వరుణ్ణి **'విశ్వాక్షం విశ్వశంభువమ్'** అని పొగిడింది.

**10. నమశ్శంకరాయ చ మయస్కరాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శంకరాయ చ | = | తల్లిదండ్రులు మొదలైనవారి రూపములో ఈలోకములో విషయసుఖములు కలుగజేయుశివునికొఱకు, |
| మయస్కరాయ చ | = | ఆచార్యుడు, శాస్త్రము మొదలైన వారి రూపములో ఉన్నత లోకములో మోక్షానందమునకు కారకుడైనవాడయిన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

తల్లిదండ్రులు మొదలైనవారి రూపములో ఈలోకములో విషయసుఖములు కలుగజేయువాడు, ఆచార్యుడు, శాస్త్రము మొదలైనవారి రూపములో ఉన్నత లోకములో మోక్షానందమునకు కారకుడైన వాడయిన శివునకు నమస్కారము.

**వివరణ :**

**మయస్కరుడు :**

మయస్ అంటే మోక్షసుఖము. **"ఆచార్యశాస్త్రాదిరూపేణ మోక్షసుఖం కరోతి ఇతి మయస్కరః"** మయస్కరుడు ఈ మోక్షసుఖమును అనుగ్రహిస్తాడు. సాధారణ మానవులమైన మన మనస్సు పులిని చూచుటతోనే భయానికి లోనవుతుంది. కామాది ఆకర్షణలకు గురయి చాంచల్యానికి గురవుతుంది. మనస్సుకు ఈ భయాలు, చాంచల్యాది గుణములు రాని ఉత్తమ స్థితినే మనము **శాంతి** అంటాము. వేదాంతము దానిని **మయస్** అంటుంది. దీనిని కలుగ జేయువాడు మయస్కరుడు.



**11. నమశ్శివాయ చ శివతరాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శివాయ చ | = | శివమంటే శుభము దానితో కూడి యుండు శివునికొఱకు. శుభములను ప్రసాదించు అట్టి శివునికొఱకు, (దోషరహితుడయిన శివునికొఱకు) |
| శివతరాయ చ | = | బాగా శుభములను ప్రసాదించు శివునికొఱకు,(తన భక్తులను నిర్దోషులుగా చేయువాని కొఱకు) |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

శుభములను ప్రసాదించు శివునికి, బాగా శుభములను ప్రసాదించు శివునికి నమస్కారము.

**వివరణ :**

గ్రేట్, గ్రేటర్, గ్రేటెస్ట్ అని ఆంగ్లములో చెప్పుకొంటాము కదా! ఇదే పద్ధతిలో గ్రేటర్ పదాన్ని సూచించే విశేషణములు, నామవాచకముల ప్రక్క 'తర' అనే ప్రత్యయాన్ని చేరుస్తారు. (ఉదా. ఈ మంత్రములో ఉన్న శివతర అను పదము) గ్రేటెస్ట్ అను సందర్భములో విశేషణములు, నామవాచకముల ప్రక్కన 'తమ' అను ప్రత్యయాన్ని చేరుస్తారు. (ఉదా. శివ తముడు = అందరికన్నా బాగా శుభాలిచ్చేవాడు) తరతమ భావములను చెప్పునట్టి పదమే తారతమ్యాలు. (ఎక్కువ తక్కువలు)

**అరుదుగా నడిగినయతడర్థి గాఁబోఁడు**
**అతచుగా నొసగక దాత గాఁడు**
**దాత కర్థి కింత తారతమ్యము సుమా!**
**విశ్వదాభిరామ వినుర వేమ.**

అని ఒక వేమన పద్యము. చాల తక్కువగా అడుగుతుంటే అతడు అర్థికాడు. తరచుగా ఇవ్వకపోతే అతడు దాతకాడు. అర్థికి, దాతకి మధ్య ఈ తారతమ్యము



ఉందంటాడు వేమన. కనుక మనము ఎప్పుడో ఒకసారి శుభాలను ఇవ్వమని శివుడిని అడగవద్దు. తరుచుగా శివుడిని ప్రార్థిస్తూ శుభాలను అడుగుదాము.

**12. నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తీర్థ్యాయ చ | = | గంగ మొదలైన తీర్థములలో ఉన్న శివునికొఱకు, |
| కూల్యాయ చ | = | నదీతీరములలో లింగరూపములలో ఉన్నవాడు అయిన శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

గంగ మొదలైన తీర్థములలో ఉన్న, నదీతీరములలో లింగరూపములలో ఉన్న శివునకు నమస్కారము.

**వివరణ :**

**తరంత్యనేనేతి తీర్థం** – దేని చేత తరింతురో అది తీర్థము. తీర్థము అను పదమునకు 1. మహర్షులు స్నానముచేసిన పుణ్యోదకము; 2. పుణ్యనది; 3.రేవు; 4. నూతియొద్ది తొట్టి; 5. పుణ్యక్షేత్రము; 6. యజ్ఞము; 7. శాస్త్రము; 8. ఉపాయము; 9. పాత్రము; 10. ఉపాధ్యాయుడు; 11. మంత్రి – అను అర్థములు కూడా ఉన్నాయి. గుడిలో ఇచ్చే పవిత్రమైన జలమును తీర్థము అనుట మనందరికి తెలిసిన విషయము. ఆమడను (= ఎనిమిది మైళ్లు) మించి ప్రవహించే ఏరును నది అంటారు. **నదతీతి నదీ.** మ్రోగేది అని నది శబ్దానికి అర్థము. తీర్థము, నది, అన్నీ శివుడంటూ ఈ మంత్రములో ఆ స్వామికి ద్రష్ట నమస్కరిస్తున్నాడు.

**13. నమ పార్యాయ చావార్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| పార్యాయ చ | = | సంసారసముద్రము దాటించి మోక్షము అనుగ్రహించు శివునికొఱకు, |



అవార్యాయ చ = సంసార సముద్రములో ఉన్నవారికి కోరికలు నెరవేర్చు శివునికొఱకు,

నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

సంసార సముద్రము దాటించి మోక్షము అనుగ్రహించువాడును, సంసార సముద్రములో ఉన్నవారికి కోరికలు నెరవేర్చు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

అపారము అంటే పారముగానిది; ఈవలి దరి. అని అర్థాలు. పారము అంటే ఆవలి దరి. ఆవలిదరిగా మోక్షాన్ని, ఈవలిదరిగా సంసారజీవనాన్ని అర్థాలుగా స్వీకరించటమైనది.

**14. నమః ప్రతరణాయ చోత్తరణాయ చ ।**

**ప్రతిపదార్థము :**

ప్రతరణాయ చ = గొప్పవైన మంత్రములు చదువుటవలన, జపములు చేయుట వలన పాపాలను దాటించు శివునికొఱకు (ఈ సంసారములో ఉత్తమ జన్మము పొందించు వానికి),

ఉత్తరణాయచ = సంసార దుఃఖమును పోగొట్టుటకు సాధనమయిన శివునికొఱకు (సంసార మును దాటించువానికొరకు)

నమః = నమస్కారము.

**తాత్పర్యము :**

గొప్పవైన మంత్రములు చదువుట వలన, జపములు చేయుట వలన పాపాలను పోగొట్టువాడు, సంసార దుఃఖమును పోగొట్టువాడు అయిన శివునకు నమస్కరము.

**విశేషాలు :**

వాడు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడని నిత్య వ్యవహారములో చెప్పుకొంటుంటాం. ఉత్తీర్ణమంటే దాటబడిన, ఉత్తీర్ణుడు అంటే దాటిన వాడు అని అర్థము. ప్రతరణము, ఉత్తరణము, ఉత్తీర్ణము – ఇవన్నీ దాదాపుగా సమానార్థకాలే.





**15. నమ ఆతార్యాయ చాలాద్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఆతార్యాయ చ | = | సంసారమును నశింపచేసే తత్త్వజ్ఞానము వచ్చినప్పటికీ కామ్యకర్మలు (కోరికతో చేసే కర్మలు) చేయుట వలన మళ్లీ సంసార జీవితము పొందిన జీవుని రూపములో ఉన్న శివునికొఱకు, |
| అలాద్యాయ చ | = | జీవులను ఆయాయా కర్మలలో ప్రేరేపించే శివునికొఱకు |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

సంసారమును నశింపచేసే తత్త్వజ్ఞానము వచ్చినప్పటికీ కామ్యకర్మలు (కోరికతో చేసే కర్మలు) చేయుట వలన మళ్లీ సంసార జీవితము పొందిన జీవుని రూపములో ఉన్న శివునికి, జీవులను ఆయా కర్మలలో ప్రేరేపించే శివునికి నమస్కారము.

**విశేషాలు :**

అలాదుడంటే వైదికపరిభాషలో జీవుడు. అతనినుంచి పుట్టినవాడు అలాద్యుడు. **(అలం పూర్ణం యథా భవతి తథా కర్మ ఫలమత్తీతి – అలాదః జీవః తత్ర భవః – అలాద్యః)**

ఆలాదమనగా స్వర్గము. ఆందున్నవాడు ఆలాదుడని ఇంకొక అన్వయము.

**16. నమశ్శష్ప్యాయ చ ఫేన్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శష్ప్యాయ చ | = | గంగానది తీరములో పుట్టిన లేతగడ్డితో పూజింపబడు శివునికొఱకు, |
| ఫేన్యాయ చ | = | నురుగుతో పూజింపబడు శివునికొఱకు, |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

గంగానది తీరములో పుట్టిన లేతగడ్డితో పూజింపబడు శివునికొఱకు, నురుగుతో పూజింపబడుశివునికొఱకు నమస్కారము.

**విశేషాలు :**

**శస్యతే పశుభిః ఇతి శష్పం** – పశువులచే హింసింపబడునది కనుక లేత కసవునకు శష్పమని పేరు వచ్చింది.

**స్ఫాయతేవర్థతఇతి ఫేనః** = ఉప్పొంగునది కనుక సముద్రపు నురుగును ఫేనము అన్నారు.

**17. నమస్సికత్యాయ చ ప్రవాహ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సికత్యాయ చ | = | ఇసుకనేలలలో ఉండుశివునికొఱకు(సైకత స్వరూపుడని భావం) |
| ప్రవాహ్యాయ చ | = | ప్రవాహమునకు తగిన శివునికొఱకు, (ప్రవాహ రూపుడని భావం) |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఇసుకనేలలలో ఉండువాడు, మరియూ ప్రవహించువాడైన శివునకు నమస్కారము.

**విశేషాలు :**

సికతా శబ్దము ఇసుకకు, ఇసుక నేలకు పేరు. **సిచ్యంత ఇతి సికతాః** – తడుపబడునది అని సికతా శబ్దమునకు అర్థము. **ప్రకర్షణవిచ్ఛేదేన వహతీతి ప్రవాహః** – ఎడతెగక నడచునది అని ప్రవాహశబ్దానికి అర్థము. శివభగవానుడు అన్నిచోట్లా ఉన్నాడు. స్వామి విశ్వవ్యాపకత్వాన్ని నిరూపించే మంత్రాలలో ఇది ఒకటిగా పరిగణించాలి.

***(దీనితో ఎనిమిదవ అనువాకము సమాప్తము)***



# నవమానువాకం

**1. నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఇరిణ్యాయ చ | = | చవుటి నేలలో ఉండు శివునికొఱకు; |
| ప్రపథ్యాయ చ | = | పదిమంది నడచు త్రోవలో నడుచుశివునికొఱకు; |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

చవుటి నేలలో ఉండు వాడును, పదిమంది నడచు త్రోవలో నడుచువాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

ఇయర్తి నాశం గచ్ఛతీతి ఇరిణం - నాశనమును పొందునేల కాబట్టి ఊషర క్షేత్రమునకు ఇరిణమని పేరు.

**జలవద్ధాన్యధనవద్దుర్గం కాలసహం మహత్ ।**

**ఔదకం పార్వతం వార్క్షమైరిణం ధన్వినం చ షట్ ॥**

జలమయము, పర్వతమయము, వృక్షమయము, ఇరిణము, ధాన్వనము అని దుర్గము ఐదువిధములు. (శ్రీమదగ్నిమహాపురాణము రెండువందల తొమ్మిదవ అధ్యాయము 29 వశ్లోకము) అయిదు రకాల దుర్గాలలో ఒకటిగా ఇరిణము చెప్పబడినది. శివుడు అన్ని చోట్లా ఉన్నాడని చెప్పుట ఈ మంత్ర అంతరార్థము.

**2. నమః కిగ్ంశిలాయ చ క్షయణాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కింశిలాయ చ | = | చిన్నచిన్న శిలలరూపములో (ఆ ప్రదేశ ములో) ఉండు శివునికొఱకు; |
| క్షయణాయ చ | = | నివాసయోగ్యమైన ప్రదేశములలో ఉండు శివునికొఱకు; |



| | | |
|---|---|---|
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

చిన్నచిన్న శిలలరూపములో ఉండువాడును, నివాసయోగ్యమైన ప్రదేశములలో ఉండువాడును అగు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

శిల అంటే ఒక రాయి. **'శిలాఘనమధ్యస్థప్రదీపసహస్రప్రథనవత్'** అని ఒక సంస్కృత న్యాయము.

రత్నశిలమధ్యలో ఉంచిన ఒక పెద్ద దీపము ఆ రాతిపలకలలో ప్రతిఫలించి కొన్ని వేలదీపములుగ కనబడినట్లు. విజ్ఞానము అలా వెలుగుతుందని దాని అర్థము. అలాగే ఒకటే శివుడు ఇన్ని నమక, చమక మంత్ర దీపాలలో వెలుగుతున్నాడు. సర్వమూ ఆయనే.

**3. నమః కపర్దినే చ పులస్తయే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కపర్దినే చ | = | కపర్దమను జడముడి కలిగినశివునికొఱకు; |
| పులస్తయే చ | = | భక్తుల ఎదుట ఉండేవాడు అయిన శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కపర్దమను జడముడి కలిగినవాడు, భక్తుల ఎదుట ఉండేవాడు అయిన శివునకు  నమస్కారము.

**విశేషాలు :**

కపర్ది లోని 'క' అనే అక్షరము నీటిని, 'పృ' పుష్టి తత్వాన్ని, 'ద' అనే అక్ష రము దాతృత్వాన్ని తెలియచేస్తాయి. **"నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ"** అను మంత్రములో  గొప్పజడలు కట్టిన జుట్టు కలవాడు అను అర్థము వచ్చు కపర్ది అను పదము పక్కనే ''వ్యుప్తకేశాయ చ' అనగా  వెంట్రుకలు లేనివాడు అను అర్థము వచ్చు పదము ఉన్నది.  సర్వము శివమయము.



సంస్కృతములో 'ర' కి, 'ల' కి కొన్ని చోట్లా అభేదముగా వాడుతుంటారు. అందుకే ఈ మంత్రములో పు **'ర'** స్తాత్ కి బదులు పు**'ల'** స్తాత్ వాడబడినది.

**4. నమో గోష్ఠ్యాయ చ గృహ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| గోష్ఠ్యాయ చ | = | గోవులుండు ప్రదేశములో ఉండుశివునికొఱకు; |
| గృహ్యాయ చ | = | గృహములందు ఉండువాడు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

గోవులుండు ప్రదేశములో ఉండువాడు, గృహములందు ఉండు శివునకు నమస్కారము.

**విశేషాలు :**

**గావస్తిష్ఠ్యంత్యత్ర గోష్ఠం**– దీనియందు గోవులుండును కనుక గోష్ఠమని పేరు. గృహమనే పదానికి పురుషునిచే సంపాదింపబడిన ధనమును గ్రహించునది అని అర్థము. అంతటా ఉండేవాడు శివుడు అని చెప్పటానికి గోష్ఠ్యాయ చ గృహ్యాయ పదాలు సూచకాలు.

**5. నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| తల్ప్యాయ చ | = | పానుపునందు ఉన్నశివునికొఱకు; |
| గేహ్యాయ చ | = | పై అంతస్తులో (మేడలో) ఉన్న శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

పానుపునందు ఉన్నవాడును, పై అంతస్తులో ఉన్న శివునకు నమస్కారము.



**విశేషాలు :**

తల్పము సుఖానికి, గేహ్యాము ఉన్నత దశకు ప్రతీక. శివానుగ్రహముఉంటే సుఖాలు, ఉన్నత దశలు సంప్రాప్తిస్తాయి అని ఈ మంత్ర సంకేతము.

**6. నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| కాట్యాయచ | = | ముండ్లతో నిండిన మొక్కలు, లతలు మొదలైనవి ఉన్న ప్రదేశములో ఉండు శివునికొఱకు; |
| గహ్వరేష్ఠాయ చ | = | చొరరానివైన కొండ గుహలలో ఉండు శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ముండ్లతో నిండిన మొక్కలు, లతలు మొదలైనవి ఉన్న ప్రదేశములో , మరియూ చొరరానివైన కొండగుహలలో ఉండు అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

పరమశివుడు భక్తసులభుడు మరియూ అర్థము కానివానివారికి గహన స్వభావము కలవాడని ఈ మంత్ర అంతరార్థము.

**7. నమో హ్రదయ్యాయ చ నివేష్ప్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| హ్రదయ్యాయ చ | = | అగాధ జలాశయములందు ఉండు శివుని కొఱకు; |
| నివేష్ప్యాయ చ | = | మంచు నీటియందు ఉండువాడు అగు శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

అగాధజలాశయములందు ఉండువాడు, మంచు నీటియందు ఉండువాడు అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

**హ్రాదతే కల్లోలైః హ్రదః –**

1. కల్లోలములచే అవ్యక్తముగా మోగునది కనుక హ్రదమని పేరు వచ్చింది.
2. మహాశివుడు మంచుపర్వతంలో ఉంటాడు. ఆయనే మంచు పర్వతము వంటి వాడు. కష్టాలలో ఉన్న తన భక్తుల దగ్గరకు ప్రవాహమై చేరుకొని రక్షిస్తాడు.

   అమర్నాథ్ గుహ లోపల శివలింగం మాదిరిగా కనిపించే ఒక మంచు ఆకారం ఉండుట ప్రసిద్ధము. మంచుతో స్వామికి ఉన్న ఈ సంబంధాన్ని **'నివేష్యాయ చ'** అను పదము తెలియ చేస్తోంది.

**8. నమః పాగ్ంసవ్యాయ చ రజస్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| పాంసవ్యాయ చ | = | కనిపించని పరమాణువులలో ఉన్న శివునికొఱకు; |
| రజస్యాయ చ | = | కనిపించే దుమ్ము ధూళిలో ఉన్నవాడును అగు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కనిపించని పరమాణువులలో ఉన్నవాడును,కనిపించే దుమ్ము ధూళిలో ఉన్నవాడును అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

1. సూక్ష్మములకంటె సూక్ష్మమైన అణువు పరమాణువు.
2. అన్నింటిలోను స్వామికి కల అస్తిత్వాన్ని ఈ మంత్రం మరోమారు నిరూపిస్తోంది.



**9. నమశ్శుష్క్యాయ చ హరిత్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శుష్క్యాయ చ | = | ఎండిపోయిన చెట్లయందు ఉన్న శివునికొఱకు; |
| హరిత్యాయ చ | = | పచ్చని చెట్లయందు ఉన్నవాడును అగు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

ఎండిపోయిన చెట్లయందు ఉన్నవాడును, పచ్చని చెట్లయందు ఉన్నవాడును అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

అన్నింటిలోను స్వామి ఉన్నాడనే అర్థమే కాకుండా భక్తులకు ఒక భరోసాను ఈ మంత్రం ఇస్తోంది. శుష్కమైన జీవితాలను చిగురింపచేయ కలిగినవాడు శివుడు. పచ్చగా ఉన్న జీవితాలను అలాగే ఉంచగలిగినవాడు కూడా శివుడే. శుష్కములనగా ఎండు కట్టెలు, హారితమనగా పచ్చకట్టెలని మరొక అన్వయము.

**10. నమో లోప్యాయ చోలప్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| లోప్యాయ చ | = | గడ్డి మొదలైనవి పెరగని కఠిన ప్రదేశములో ఉన్నశివునికొఱకు; |
| ఉలప్యాయ చ | = | రెల్లుగడ్డి మొదలైనవాటియందు ఉన్న శివుని కొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

గడ్డి మొదలైనవి పెరగని కఠిన ప్రదేశములో ఉన్నవాడు, రెల్లుగడ్డి మొదలైన వాటియందు ఉన్నవాడును అగు పరమశివునకు నమస్కారము.



**విశేషాలు :**

1. లోప్య అను పదానికి being among thickets or inaccessible places ఉలప్య అను దానికి abiding in or belonging to the (उलप) Grass అను అర్థాలు ఇచ్చింది Monier William's Sankrit-English Dictionary, 2 nd Ed. 1899.
2. ఉలపము అంటే మొదవగడ్డి.
3. పశువులచేత హింసింపబడునది కనుక గడ్డిని తృణము అంటారు.

**11. నమ ఊర్వ్యాయ చ సూర్మ్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఉర్వ్యాయ చ | = | భూమియందుండు శివునికొఱకు; |
| సూర్మ్యాయ చ | = | అందమైన తరంగములు కలిగిన నదుల యందు ఉండుశివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

భూమియందుండు వాడు, అందమైన తరంగములు కలిగిన నదులయందు ఉండువాడును అగు పరమశివునకు నమస్కారము

**విశేషాలు :**

1. ఉర్వి అను పదమునకు విశాలమైనది అను అర్థము. ఘనమైనది, పర్వతములచేత కప్పబడునది కనుక భూమిని ఉర్వి అంటారని అమరకోశము.

**12. నమః పర్ణ్యాయ చ పర్ణ్యశద్యాయ చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| పర్ణ్యాయ చ | = | ఆకులలోను; |
| పర్ణ్యశద్యాయ చ | = | ఎండుటాకుల సమూహములోను ఉన్నట్టి శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |



**తాత్పర్యము :**

ఆకులలోను, ఎండుటాకుల సమూహములోను ఉన్నట్టి పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

పిపర్తి వృక్షమితి పర్ణం– వృక్షమున నిండియుండునది కనుక ఆకును పర్ణ మంటారు. పచ్చని ఆకుయందు ఉండువాడూ ఆయనే. ఎండుటాకులందు ఉండువాడూ ఆయనే. సర్వము శివానుగ్రహముగా భావించి జీవనసుఖ దుఃఖములందు ప్రవర్తించాలనే సందేశాన్ని ఈ మంత్రము ఇస్తోంది.

**13. నమోఽ పగురమాణాయ చాభిఘ్నతే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అపగురమాణాయ చ | = | పాపాత్ములను శిక్షించుటకు ఆయుధ ములు కల శివునికొఱకు; |
| అభిఘ్నతే చ | = | ధర్మ శత్రువులను మోదుశివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

పాపాత్ములను శిక్షించుటకు ఆయుధములు కలవాడు, ధర్మ శత్రువులను మోదువాడును అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

శత్రువునకు ఉన్న రకరకాల పేర్లలో **అభిఘాతి** కూడా ఒకటి. హింసించు శీలము కలవాడు అని దాని అర్థము. పరమశివునికి నిజానికి శత్రువులు అంటూ ఎవరూ లేరు. కాని ధర్మానికి శత్రువులు ఆయనకు శత్రువులు. వారిని శిక్షించువాడను అర్థములో ఈ మంత్రము ఏర్పడింది.

**14. నమ ఆక్షిదతే చ ప్రక్షిదతే చ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ఆక్షిదతే చ | = | కొద్దిగా కష్టము(శ్రమ) పెట్టు శివునికొఱకు; |



| | | |
|---|---|---|
| ప్రక్షిదతే చ | = | బాగా కష్టము(శ్రమ) పెట్టువాడును అగు శివునికొఱకు; |
| నమః | = | నమస్కారము. |

**తాత్పర్యము :**

కొద్దిగా కష్టము పెట్టు వాడును, బాగా కష్టము పెట్టువాడును అగు పరమశివునకు నమస్కారము.

**విశేషాలు :**

రుద్రులు అనేకమంది ఉన్నారు. వీరిలో ఏకాదశరుద్రులు ప్రసిద్ధులు.

1.వీరభద్రుడు, 2. శర్వుడు, 3. గిరీశుడు, 4. అజైకపాదుడు, 5. అహిర్బుధ్న్యుడు, 6. పినాకి, 7. స్థాణువు, 8. పశుపతి, 9. భవుడు, 10. ఉగ్రుడు, 11. త్విట్పతి / త్విషాంపతి. (బసవేశ్వర గీతామృతం). రుద్రులలో కొంతమంది ఉగ్రులు బాధపెడతారు. ఉగ్రరథుడు అను పేరు గల రుద్రుడు 60వఏట మానవులను బాధ పెడతాడు. ఈ బాధ తప్పించుకోవటానికే షష్టి పూర్తి అను పేరుగల ఉగ్రరథ శాంతి చేయమని పెద్దలు చెబుతారు.

**15. నమో వః కిరికేభ్యో దేవానాం హృదయేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| దేవానాం | = | దేవతలకు |
| హృదయేభ్యః | = | మనస్సువంటివారలు(ప్రియులైన) |
| కిరికేభ్యః | = | భక్తులకు ధనము వెదజల్లునట్టి రుద్రావతారులయిన |
| వః | = | మీకొఱకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

దేవతలకు ప్రియులైన భక్తులకు ధనము వెదజల్లునట్టి రుద్రావతారులయిన మీకు నమస్కారము.



**విశేషాలు :**

1. ఈ మంత్రము మొదలు అనువాకము చివరివరకు ఒకటే మంత్రము.
2. ఈ మంత్రమునుండి శివుడు సమూహ రూపమున నమస్కరింపబడుచున్నాడు.

**16. నమో విక్షీణకేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| విక్షీణకేభ్యః | = | నాశనములేని శివ స్వరూపాలకొఱకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

నాశనములేని శివ స్వరూపాలకొఱకునమస్కారము

**విశేషము :**

విక్షీణకుడు అంటే పాపాత్ములను శిక్షించు రుద్ర గణానికిసంబంధించిన నాయకుడు. దేవతలకు మాత్రమే (మానవులకు కాదు)ఊహించదగిన రుద్ర గణ నాయకుడు విక్షీణకుడు. అటువంటి రుద్ర గణముల నాయకుల స్వరూపములో ఉన్న శివునకు నమస్కారము.

**17. నమో విచిన్వత్కేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **విచిన్వత్కేభ్యః** | = | కోరుకొన్న దానిని సంపాదించి ఇచ్చుశివ స్వరూపాలకొఱకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

కోరుకొన్న దానిని సంపాదించి ఇచ్చుశివ స్వరూపాల కొఱకు, నమస్కారము.

**విశేషాలు :**

వీరు పుణ్యులు,వీరు పాపులు అని జంతువులలో వెతుకువారు **విచిన్వత్కేతులు.**





**18. నమ ఆనిర్హతేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఆనిర్హతేభ్యః** | = | నిశ్శేషముగా జీవుల పాపములను తొలగించు శివ స్వరూపాలకొఱకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

నిశ్శేషముగా జీవుల పాపములను తొలగించు శివ స్వరూపాలకొఱకు నమస్కారము.

**విశేషాలు :**

**ఆనిర్హతుఁడు** – అను పదమునకు ఆంధ్ర వాచస్పత్యము (కొట్ర శ్యామలకామశాస్త్రి 1953) లో లచ్చిమగఁడు విష్ణువు అను అర్థము కనబడుతోంది. శివకేశవుల అభేదాన్ని నమకము ప్రతిపాదిస్తోందనటానికి ఇది కూడా ఒక సాక్ష్యము.

**19. నమ ఆమీవత్కేభ్యః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఆమీవత్కేభ్యః** | = | పాపాత్ములను శిక్షించుటకు అన్నిచోట్ల స్థూల భావమును పొంది వ్యాపించి ఉన్న శివ స్వరూపాల కొఱకు |
| నమః | = | నమస్కారము |

**తాత్పర్యము :**

పాపాత్ములను శిక్షించుటకు అన్నిచోట్ల స్థూల భావమును పొంది వ్యాపించి ఉన్న శివ స్వరూపాల కొఱకు నమస్కారము

***(ఇంతటితో నవమానువాకము సమాప్తము)***



## దశమానువాకం

**1. ద్రాపే అంధసస్పతే దరిద్ర న్నీలలోహిత ।**

**ఏషాం పురుషాణామేషాం పశూనాం మాభేర్మారో మో ఏషాం కించనామమత్ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| ద్రాపే | = | పాపులకు రోతైన గతిని కలిగించువాడా! |
| అంధసస్పతే | = | అన్నమును ఇచ్చువాడా! |
| దరిద్రత్ | = | తాను తప్ప మరేమియూ లేనివాడా! |
| నీలలోహిత | = | కంఠమున నలుపు, తతిమ్మా శరీరమున ఎరుపురంగు కలవాడా! |
| ఏషాం పురుషాణాం | = | ఇట్టి మాయొక్క పురుషులయొక్క |
| ఏషాం పశూనాం | = | మాకు సంబంధించిన పశువులయొక్క సమూహమును |
| మాభేః | = | భయపెట్టకు |
| ఏషాం | = | వీటిలో |
| కించన | = | కొంచెమైననూ |
| మా అరః | = | నశింపకుండుగాక! |
| మో ఆమత్ | = | రోగము పొందకుండుగాక! |

**తాత్పర్యము :**

రోతైన గతిని కలిగించువాడా! అన్నమును ఇచ్చువాడా! ఏమీ లేనివాడా! కంఠమున నలుపు, తతిమ్మా శరీరమున ఎరుపురంగు కలవాడా! నా పుత్రులను మనుమలను, ఆవు, పశు సంపదలను భయపెట్టకు. వీరిలో ఏ ఒక్కరిని నశింప జేయకు. రోగముల పాలు చేయకు.

**విశేషాలు :**

ప్రజలకు వారి వారి కర్మానుసారముగా రోగములు, దారిద్ర్యము మొదలయిన – అసహ్యకరమయిన బాధలు కల్పించువాడు కనుక శివుని ఇక్కడ "ద్రాపే" అని సంబోధించారు.





ద్రాపి అనగా కవచము కలవాడు అని ఇంకొక అర్థం.

**2. యా తే రుద్ర శివా తనూశ్శివా విశ్వాహభేషజీ.**
**శివా రుద్రస్య భేషజీ తయా నో మృడ జీవసే.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | రుద్రుడా! |
| శివా | = | శాంతమయినది |
| విశ్వాహభేషజీ | = | ఎల్లరోజులలోను ఔషధమువంటిది (అందు వలననే) |
| శివా | = | శుభమయినది |
| రుద్రస్య | = | రుద్ర తాదాత్మ్యము పొందుటకు |
| భేషజీ | = | ఔషధమువంటిది (ఆటువంటి) |
| తే తనూ ః యా | = | నీశరీరము ఏది కలదో |
| తయా | = | ఆరూపముచే |
| న ః | = | మమ్ములను |
| జీవసే | = | జీవింపచేయుటకు |
| మృడ | = | సుఖింపచేయుము |

**తాత్పర్యము :**

ఓ పరమేశ్వరా! శివా! నీ శరీరము (రూపము) రోగ దారిద్ర్యాదులను తొలగించు ఔషధము. శుభకరమైనది. నీ రుద్రరూపము సంసార దుఃఖమును తొలగించి మోక్షాన్ని అనుగ్రహిస్తుంది. శివ మరియూ రుద్ర రూపములచే మమ్ములను సుఖముగా జీవింపచేయుము.

**వివరణ :**

ఈ మంత్రములో శివరూపాన్ని ఒక ఔషధముగా, రుద్ర రూపాన్ని మరొక ఔషధముగా వర్ణించారు.

**3. ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే మతిమ్.**
**యథా నశ్శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామేఅస్మిన్ననాతురమ్.**



**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యథా | = | ఎట్లు |
| న ః | = | మా(యొక్క) |
| ద్విపదే | = | రెండు పాదములుగల మనుష్యుని కొఱకు |
| చతుష్పదే | = | నాలుగు పాదములుగల పశువు కొఱకు |
| శమ్+అసత్ | = | సుఖము కలుగుతుందో |
| అస్మిన్ గ్రామే | = | ఈ గ్రామమునందు |
| విశ్వం పుష్టం | = | సమస్త ప్రపంచములో శక్తి కలదో |
| అనాతురమ్ | = | ఉపద్రవము లేనిదిగా (అగునో ఆట్లు మేము) |
| తవసే | = | బలముకలవాడు |
| కపర్దినే | = | జటాజూటము కలవాడు |
| క్షయద్వీరాయ | = | నశించుచున్న వీరులు కలవాడు అగు |
| రుద్రాయ | = | శివునికొఱకు |
| ఇమాం మతిమ్ | = | ఈ బుద్ధిని |
| ప్రభరామహే | = | బాగా పోషించుచున్నాము. |

**తాత్పర్యము :**

బలవంతుడైనవానికి, కపర్దికి (శివుని జటాజూటము పేరు కపర్ది. సుఖముచే నిండించునది అని ప్రతిపదార్థం), శత్రువులను నశింప చేయువాడును అగు పరమశివునికి మా మానసిక ధ్యానమును సమర్పించుచున్నాము.

ఇలా ధ్యానము చేయుటచే రెండు పాదములు కల జంతువులు, నాలుగు పాదములు కల జంతువులు, గ్రామములో జీవిస్తున్న సకల జంతువులుబలాన్ని, శుభాన్ని, రోగాలు లేని సుఖాన్ని పొందెదరు.

**విశేషాలు :**

1. ఏ కుటుంబములో అయినా నమకధ్యానము చేసిన యెడల ఆగ్రామములోని వారందరూ సుఖించెదరని ప్రసిద్ధ శ్లోకము. అందుకే



ఈ మంత్రములో గ్రామశబ్దము చెప్పబడినది. **(రుద్రాధ్యాయీ వసేద్యత్ర గ్రామే వా నగరేపి వా/వ్యాధిదుర్భిక్ష చోరాది బాధా తత్ర న జాయతే)**

2. జంతు శబ్దము మానవులకు కూడా వర్తిస్తుంది. అందుకే శివుడిని పశుపతి అంటారు. అందుకే ఈ మంత్రములో సకల జంతు సముదాయములో మానవులున్నారని గ్రహించాలి.

**4. మృడానో రుద్రోత నో మయస్కృధి క్షయద్వీరాయ నమసా విధేమ తే. యచ్ఛం చ యోశ్చ మనురాయజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | రుద్రుడా! |
| న ః | = | ముమ్ము |
| మృడ | = | సుఖింపచేయుము |
| ఉత | = | మరియు |
| న ః | = | మాకు |
| మయః | = | పరలోక సుఖము |
| కృధి | = | చేయుము |
| క్షయద్వీరాయ | = | నశించుచున్న పాపములుగల |
| తే నమసా విధేమ | = | నీకు నమస్కారముచేయుదుము |
| రుద్ర | = | రుద్రుడా! |
| పితా మనుః | = | పాలకుడైన ప్రజాపతి (మనువు) |
| శంచ యోశ్చ | = | సుఖము దుఃఖమునుండి వేరగుటను |
| యత్ఆయజే | = | దేనిని కొంచెము కలిగించెనో |
| తత్ తవ ప్రణీతౌ | = | దానిని నీయొక్క ప్రేమయందె |
| అశ్యామ | = | పొందుదుము. |



**తాత్పర్యము :**

భక్తులను సంతోషపెట్టువాడా! (మృడుడా!) రుద్రుడా! ఇహ పరలోకాల సుఖాలను అనుగ్రహించుము.

మా పాపాలు నశింపజేయుము. నీ అనుగ్రహముతో ఆ మనువు సుఖదుఃఖాతీతస్థితిని సాధించాడు. ఓ పరమేశ్వరా! అది అంతా మాకు అనుగ్రహించు.

**5. మా నో మహాన్తముతమానో అర్భకం మాన ఉక్షన్తముత మాన ఉక్షితమ్.**
**మా నో వధీః పితరం మోత మాతరం ప్రియా మానస్తనువో రుద్ర రీరిషః.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | ఓ రుద్రుడా! |
| న ః | = | మాకు సంబంధించిన |
| మహాంతమ్ | = | ముసలివారిని |
| మావధీః | = | హింసింపకు |
| ఉత | = | మరియు |
| న ః | = | మాకు సంబంధించిన |
| అర్భకం | = | మా బాలుడిని |
| మావధీః | = | హింసింపకు |
| న ః | = | మాకు సంబంధించిన |
| ఉక్షంతమ్ | = | యౌవనవంతులను |
| మా | = | హింసింపకు |
| ఉత | = | మరియు |
| న ః | = | మాకు సంబంధించిన |
| ఉక్షితం | = | గర్భమందలి పిండములను |
| మా | = | హింసింపకు |
| న ః | = | మాకు సంబంధించిన |



| | | |
|---|---|---|
| పితరం | = | మా తండ్రిని |
| మా | = | హింసింపకు |
| ఉత | = | మరియు |
| మాతరం | = | మా తల్లిని |
| మా | = | హింసింపకు |
| న ః | = | మాకు సంబంధించిన |
| పి యాః | = | ప్రియములైన |
| తనువః | = | శరీరములను |
| మా రీరిషః | = | హింసింపకుము |

**తాత్పర్యము :**

ఓ రుద్రుడా! మాకు సంబంధించిన ముసలివారిని హింసింపకు. ; మా బాలురను హింసింపకుము. మరియు యౌవనవంతులను హింసింపకు గర్భమందలి పిండములను హింసింపకుము. మా తండ్రిని హింసింపకు ; మా తల్లిని హింసింపకు ; రుద్రా! మా ప్రియమైన శరీరములను హింసింపకుము

**విశేషాలు :**

రుద్రుడను పదానికి దుఃఖాన్ని పోగొట్టు వాడని అర్థము. తల్లిదండ్రులు మొదలైనవారు బాధపడితే కలిగేది దుఃఖము. ఆ దుఃఖాన్ని పోగొట్టు వాడని సార్థకముగా రుద్ర శబ్దము ఈమంత్రములో పేర్కొనబడినది.

**6. మానస్తోకే తనయే మాన ఆయుషి మానో గోషు మా నో అశ్వేషు రీరిషః. వీరాన్మా నో రుద్ర భామితో౽వధీర్హవిష్మన్తో నమసా విధేమ తే.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్ర | = | ఓ రుద్రుడా! |
| న ః | = | మాకు సంబంధించిన |
| తోకే | = | బిడ్డ విషయములోను |
| తనయే | = | వాని బిడ్డ విషయములోను (మనుమడు ఆని భావం) |



| | | |
|---|---|---|
| మా రీరిషః | = | హింసింపకుము |
| న ః | = | మాకు సంబంధించిన |
| ఆయుషి | = | ఆయుర్దాయము విషయములో |
| మా | = | ఇబ్బందిపెట్టకు |
| న ః | = | మాకు సంబంధించిన |
| గోషు | = | ఆవులను |
| మా | = | హింస చేయకు. |
| న ః | = | మాకు సంబంధించిన |
| అశ్వేషు | = | గుఱ్ఱముల విషయములో |
| మా | = | హింస చేయకు. |
| భామితః | = | కోపింపబడినవాడివై |
| న ః | = | మాకు సంబంధించిన |
| వీరా ః | = | మా సేవకులను |
| మావధీః | = | హింసింపకు |
| హవిష్మంతః | = | మేము హవిస్సులతో |
| నమసా | = | నమస్కారములతో |
| తే | = | నిన్ను |
| విధేమ | = | సేవిస్తాము. |

**తాత్పర్యము :**

రుద్రుడా! నీకు చేయవలసిన పనులు చేయని మాయందు కోపము వహించి మా సంతానమును హింసింపకుము. ; మా ఆయుర్దాయము విషయములో ఇబ్బందిపెట్టకు; మా ఆవులు, గుఱ్ఱముల విషయములో బాధపెట్టకు. మా సేవకులను హింసింపకు. మేము హవిస్సులతో (1. అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురబెట్టిన యన్నము; 2. నెయ్యి.) నమస్కారములతో నిన్ను సేవిస్తాము.



**7. ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు. రక్షా చ నో అధి చ దేవ బ్రూహ్యథా చ నశ్శర్మ యచ్ఛ ద్విబర్హాః.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| దేవ | = | ఓ శివుడా! |
| గోఘ్న | = | గోవులను చంపునట్టి పాపులను శిక్షించునట్టి, |
| ఉత | = | మరియూ |
| పూరుషఘ్నే | = | పుత్ర పౌత్రులను సంహరించునట్టి ; |
| క్షయద్వీరాయ | = | నశించిన వీరులు గల్గినట్టి నీ ఉగ్ర రూపము; |
| ఆరాత్ ఆస్తు | = | దూరముగా ఉండుగాక! |
| తేసుమ్నమస్మే అస్తు | = | నీసుఖదాయకమైన రూపము మాకు దగ్గరగా ఉండుగాక!. |
| చ | = | మరియూ |
| న ః రక్షా | = | మమ్మలిని అన్నిరకాలుగా రక్షించుగాక!; |
| అధిబ్రూహి | = | మాకు అనుకూలముగా మాట్లాడు. మేము అధికులమని మాట్లాడు. |
| అథచ | = | మరియూ |
| ద్విబర్హాః | = | లోకములు రెండింటిలో వృద్ధినిచేయు నువ్వు |
| నః. | = | మాకు |
| శర్మ యచ్ఛ | = | మోక్షదాయకమైన సుఖమునొసంగుము |

**తాత్పర్యము :**

గోవులను చంపునట్టి పాపులను శిక్షించునట్టి, అంతే కాదు –పుత్ర పౌత్రులను సంహరించునట్టి నశించిన వీరులు గల్గినట్టి నీ ఉగ్రరూపము దూరముగా ఉండుగాక! నీ సుఖదాయకమైన రూపము మాకు దగ్గరగా



ఉండుగాక! ఇంతే కాదు – మమ్మలిని అన్నిరకాలుగా రక్షించు ఓ దేవా! మాకు అనుకూలముగా మాట్లాడు. లోకములు రెండింటిలోను వృద్ధినిచేయు నువ్వు మాకు మోక్షదాయకమైన సుఖమునొసంగుము.

**వివరణ :**

శివునికి 1. ఉగ్ర, 2 సౌమ్య అను రెండు రూపాలున్నట్లు ఈ మంత్రములో ద్రష్ట వివరిస్తున్నాడు.

ఉగ్ర రూపము మాకు దూరముగా పెట్టి, సౌమ్య రూపముతో మాకు సుఖాలను అనుగ్రహించమని శివునికి నివేదన ఈ మంత్రములో కనబడుతోంది. భగవద్గీతలో కృష్ణుడు విశ్వరూపాన్ని చూపించిన సందర్భములో అర్జునుడు సౌమ్యరూపాన్ని అనుగ్రహించమని ప్రార్థించినట్లు ఈ మంత్రములో కూడా సౌమ్యతను ద్రష్ట అభిలషిస్తున్నాడు.

**8. స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగం న భీమముపహత్నుముగ్రమ్.**
**మృడా జరిత్రే రుద్రస్తవానో అన్యం తే అస్మన్ నివపంతు సేనాః.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శ్రుతం | = | వేదములవలన వినబడిన వానిని |
| గర్తసదం | = | గుహను పోలిన హృదయములో ఉండే వానిని పరమశివుని. |
| యువానం | = | నిత్యయువకుడిని, |
| ఉగ్రం బీమం | = | ఉగ్రమైన |
| బీమం | = | భయంకరమైన |
| మృగం న | = | సింహమువంటివానిని (నకారము ఉపమావాచకము) |
| ఉపహన్తుం | = | శత్రువినాశము చేయు ప్రసిద్ధుడైన శివుని |
| స్తుహి | = | స్తోత్రము చేయుము. |
| రుద్ర | = | రుద్రుడా! |
| స్తవానః | = | మా మాటలచే పొగడబడి |



| | | |
|---|---|---|
| జరిత్రే | = | నశించు మా శరీరములకు |
| మృడ | = | సుఖము ఇవ్వవలసినది |
| తే సేనాః | = | నీ సేనలు |
| అస్మత్ | = | మా కన్నను |
| అన్యం | = | అన్యులైన మా శత్రువులను |
| నివపంతు | = | నశింపజేయు గాక. |

**తాత్పర్యము :**

ఓ నా వాక్కా! అంతరాత్మా!; వేదములవలన వినబడిన వానిని గుహను పోలిన హృదయములో ఉండే పరమశివుని నిత్యయువకుడిని, భయంకరమైన సింహములా శత్రువినాశము చేయు ప్రసిద్ధుడైన శివుని స్తోత్రము చేయుము. ఓ రుద్రా! మా మాటల చే పొగడబడి ప్రతి రోజూ నశించు మా శరీరములకు సుఖము ఇవ్వవలసినది. నీ సేనలు అన్యులైన మా శత్రువులను నశింపజేయు గాక.

**విశేషాలు :**

'అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు ' అని నారాయణ సూక్తము విష్ణువుని హృదయ గుహలో మధ్యలో ఉండేవానిగా చెబితే – ఇక్కడ నమకములో శివుడిని మన హృదయములో ఉండేవానిగా ద్రష్టలు భావించారు. పేర్లు మార్పు. శివుడు, విష్ణువు ఒక్కరే అను విషయము ఇక్కడ బాగా స్పష్ట మవుతోంది.

**9. పరి ణో రుద్రస్య హేతిర్వృణక్తు పరిత్వేషస్య దుర్మతిరఘాయోః.**
**అవస్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్రస్య హేతిః | = | శివుని ఆయుధము |
| నః. | = | మమ్ము |
| పరివృణక్తు | = | అంతటను విడిచి పెట్టుగాక! |
| త్వేషస్య | = | కోపముతో జ్వలించు శివుని |



| | | |
|---|---|---|
| అఘాయోః. | = | పాప పరిహారాన్ని కోరునట్టివాడును |
| రుద్రస్య | = | శివుని యొక్క |
| దుర్మతిః | = | బాధించు బుద్ధి |
| నః. | = | మమ్ము |
| పరివృణక్తు | = | అంతటను విడిచి పెట్టుగాక! |
| స్థిరా | = | స్థిరమైన ఏ ఉగ్రబుద్ధి కలదో దానిని |
| మఘవద్భ్య | = | హవిస్సనెడి అన్నముగలవారివలన (పూజలు చేసే మాయందు) |
| అవతనుష్వ | = | తొలగింపుము |
| మీఢ్వ | = | కోర్కెలను వర్షించే ఓ పరమేశ్వరా! |
| తోకాయ | = | మామనుమలకు |
| తనయాయ | = | మాపిల్లలకు |
| మృడయ | = | సుఖాన్ని ఇవ్వవలసినది |

**తాత్పర్యము :**

శివుని ఆయుధము మమ్మలిని ఎప్పుడూ బాధ పెట్టకుండుగాక! పాప పరిహారాన్ని కోరేది మరియూ అన్ని వైపులనుంచి కోపముతో జ్వలించు శివుని బాధించు బుద్ధి మమ్మలిని విడిచిపెట్టుగాక! అన్నింటిని అనుగ్రహించే ఓ పరమేశ్వరా! స్థిరుడవు కమ్ము. నీకు సాష్టాంగ ప్రణామములు, పూజలు చేసే మాయందు నీ ఆయుధమును ప్రయోగించకు. మామనుమలకు మాపిల్లలకుసుఖాన్ని ఇవ్వవలసినది .

**విశేషాలు :**

ఇక్కడ శివుని బాధించు బుద్ధిని అన్యాయాలు చేసే శత్రువులను బాధించు బుద్ధిగా అన్వయించుకోవాలి. మేము ఎటువంటి అన్యాయములు చేయమని, మమ్మలిని బాధించవద్దని ఈ మంత్రంలో వేడికోలు. .

**10. మీఢుష్టమ శివతమ శివో నస్సుమనా భవ.**

**పరమే వృక్ష అయుధం నిధాయ కృత్తిం వసాన ఆచర పినాకంబిభ్రదా గహి.**



**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| మీఢుష్టమ | = | అధికముగా తడుపువాడా! (కోరిన కోరికలు ఇచ్చువాడా!) |
| శివతమ | = | శాంతుడైనవాడా! |
| నః | = | మా గూర్చి |
| శివః | = | కోపములేనివాడివై |
| సుమనాః భవ | = | మంచి మనస్సు స్నేహము కలిసినవాడి వగుము. |
| అయుధం | = | త్రిశూలము మొదలైనవాటిని |
| పరమే | = | మిక్కిలి ఉన్నతమైన |
| వృక్షేనిధాయ | = | కైలాసములో ఉన్న మఱ్ఱి చెట్టులో ఉంచి, |
| కృత్తిం వసాన | = | పులి చర్మమును మాత్రము ధరించి |
| ఆచర | = | మా ఎదురుగా రమ్ము. |
| పినాకం | = | పినాకమను ధనుస్సును |
| బిభ్రదాగహి. | = | చేతిలో ధరించుచు రమ్ము |

**తాత్పర్యము :**

కోరిన కోరికలు ఇచ్చువాడా! శుభములను అనుగ్రహించువాడా! శుభ నిలయుడా మా గూర్చి ; మంచి మనస్సు స్నేహముకలిసినవాడివగుము.

ఓ శ్రేష్ఠుడా! త్రిశూలము మొదలైనవాటిని కైలాసములో ఉన్న మఱ్ఱి చెట్టులో ఉంచి, పులి చర్మమును మాత్రము ధరించి మా ఎదురుగా రమ్ము. పినాకమను ధనుస్సును చేతిలో ధరించుచు రమ్ము

**విశేషాలు :**

కైలాసములో 100 యోజనాల ఎత్తు, 175 యోజనాల వెడల్పు కలిగిన మఱ్ఱిచెట్టు ఉన్నట్లుగా ప్రసిద్ధి. దానిపై ఆయుధములను ఉంచమని ద్రష్ట ప్రార్థిస్తున్నాడు. (యోజనమంటే ఎనిమిది మైళ్లు.)



**11. వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః.**
**యాస్తే సహస్రగ్ం హేతయోఽ న్యమస్మన్నివపంతు తాః.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| వికిరిద | = | కిరులనగా ధనములు. ధనములను ఇచ్చువాడా! |
| విలోహిత | = | ఎర్రనివాడా! మిక్కిలి తెల్లనివాడా! |
| భగవః. | = | ఓ భగవంతుడా! |
| నమస్తే అస్తు | = | నీకు నమస్కారమగు గాక. |
| తే | = | నీకు |
| సహస్రం హేతయః | = | వేలకొద్దీ ఆయుధములు |
| యాః | = | ఏవి ఉన్నవో |
| తాః | = | అవి |
| అస్మత్ | = | మా కన్నను |
| అన్యం | = | అన్యులైన మా శత్రువులను |
| నివపంతు | = | నశింపజేయు గాక. |

**తాత్పర్యము :**

పాపము, వ్యాధి, పేదరికము మొదలైన వాటిని నాశనము చేయువాడా! ఎర్రనివాడా! మిక్కిలి తెల్లనివాడా! ఓ భగవంతుడా! నీకు నమస్కారమగు గాక. నీకు ఏ ఆయుధములు వేలకొద్దీ ఉన్నాయో అవి మాకు ఇతరుడైన విరోధిని నశింపజేయు గాక.

**విశేషాలు :**

భగవంతుని లక్షణాలను పురాణనామచంద్రికలో ఇలా వివరించారు – సంభర్తృత్వము, భర్తృత్వము, నేతృత్వము, గమయతృత్వము, స్రష్టృత్వము, సర్వశరీరత్వము, సర్వభూతాంతరాత్మత్వము, నిరస్తనిఖిలదోషత్వము, షాడ్గుణ్యపూర్ణత్వము మొదలుగా కల గుణములు కలవాడు భగవంతుడు ఎగవలయును.



సంభర్తృత్వము అనగా ఉపకరణ సంపాదనము. అనగా ప్రకృతి పురుషకాలములకు కార్యములను పుట్టించునట్టి యోగ్యతను కలుగచేయుట. భర్త ృత్వము అనగా స్థితిని కలుగచేయుట. గమయితృత్వము అనగా సంహారముచేయుట. స్రష్టృత్వము అనగా సృజియించుట. సర్వశరీరత్వము అనగా ప్రపంచము శరీరముగా కలిగి ఉండుట. సర్వభూతాంతరాత్మత్వము అనగా ఎల్లభూతములకు లోపల ఆత్మగా ఉండుట. నిరస్త నిఖిలదోషత్వము అనగా ప్రకృతి సంబంధముచేత వచ్చెడి దోషములు ఏవియు లేక ఉండుట. షాడ్గుణ్యపూర్ణత్వము అనగా ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆఱుగుణములను కలిగి ఉండుట. (పురాణనామచంద్రిక యెనమండ్రం వెంకటరామయ్య 1879).

శివుడు ఎరుపురంగులోను, తెలుపురంగులోను వర్ణించబడ్డాడు కనుక ఈ మంత్రములో విలోహిత శబ్దానికి రెండు అర్థాలు చెప్పుకోవాలి.

**12. సహస్రాణి సహస్రధా బాహువోస్తవ హేతయః.**
**తాసామీశానో భగవః పరాచీనా ముఖాకృధి.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భగవః | = | ఓ భగవంతుడా! శివా! |
| తవ | = | నీయొక్క |
| బాహువోః | = | చేతులందు |
| హేతయః | = | ఆయుధములు |
| సహస్రాణి | = | వేలకొలదిగా |
| సహస్రధా | = | అనేక విధాలుగా ఉన్నాయి |
| ఈశానః | = | ఓ శక్తిమంతుడవైన భగవంతుడా! |
| తాసాం | = | ఆ ఆయుధముల యొక్క |
| ముఖా | = | మొనలకు గురికాకుండునట్లు |
| పరాచీనా | = | పెడమోము కలవానిగా |
| కృధి | = | చేయుము |



**తాత్పర్యము :**

ఓ భగవంతుడా! శివా! నీ చేతులందు వేలకొలది ఆయుధాలు అనేక విధాలుగా ఉన్నాయి . ఓ శక్తిమంతుడవైన భగవంతుడా! ఆ ఆయుధములకు గురిగా మేము అయ్యేటట్లు చేయకు.

*(ఇంతటితో దశమానువాకము సమాప్తము.)*





## ఏకాదశానువాకం

అనువాకము అంటే కొన్ని పనసలు గల వేదభాగము. ప్రతి పనసలోనూ ఏభై పదాలు ఉంటాయి. చిన్న పనసలు కొన్నింటిలో స్వల్పంగా ఎక్కువ తక్కువలు ఉండవచ్చు. సుమారుగా ఆశ్వాసము, ప్రకరణము, మొదలగు వానివంటిది అనువాకము. ఈ అనువాకమునకే అవతానమని పేరు ఉంది.

**1. సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్ ।**
**తేషాం సహస్ర యోజనేఽవ ధన్వాని తన్మసి ॥**

ఈ పదకొండవ అనువాకములో రుద్రునియొక్క భాగాలైన రుద్రాంగులు పూజింపబడుతున్నారు.

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అధిభూమ్యామ్ | = | ఈ భూమి యొక్క పై భాగాన; |
| సహస్రాణి సహస్రశః | = | వేలవేలుగ |
| యే రుద్రాః | = | ఏ రుద్రులయితే ఉన్నారో; |
| తేషాం ధన్వాని | = | వారి యొక్క ఎక్కుపెట్టిన ధనుస్సులు; |
| సహస్రయోజనే | = | మా దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో, |
| అవ తన్మసి | = | నారి తొలగినవై ఉండుగాక! |

**తాత్పర్యము :**

ఈ భూమి మీద వేలవేలుగ ఉన్న రుద్రుల ఎక్కుపెట్టిన ధనుస్సులు మా దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో, నారి తొలగినవై ఉండుగాక! (మమ్ములను బాధించవద్దని భావం).

**విశేషాలు :**

**తేషాం సహస్ర యోజనేఽవ ధన్వాని తన్మసి –** అను రెండవ పాదమును ఇకనుంచి తొమ్మిదో మంత్రము వరకు కలిపి చదువుకోవాలి. రుద్రాంగులు మమ్ములను శిక్షించవద్దని ఈ మంత్ర భావము.



ఎవరీ రుద్రాంగులు? క్రోధ స్వరూపుడైన రుద్రుని యొక్క ఆగ్రహాంశములు రుద్రాంగులు లక్షలాదిగా ఈ భూమి మీద తిరుగుతుంటాయి. వాటి ప్రసన్నతకు ఈ అనువాకములోని మంత్రాలు ఉపయోగపడతాయని చెబుతారు.

**2. అస్మిన్మహత్యర్ణవేఽన్తరిక్షే భవా అధి ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అస్మిన్ + మహతి + | | |
| అర్ణవే | = | ఈ మహా సముద్రముతో సమానమైన; |
| అంతరిక్షే అధి | = | ఆకాశములో ఉన్న; |
| (యే) భవాః | = | రుద్రాంగుల ఎక్కుపెట్టిన ధనుస్సులు. |

**తాత్పర్యము :**

ఈ మహాసముద్రముతో సమానమైన ఆకాశములో ఉన్న రుద్రాంగుల ఎక్కుపెట్టిన ధనుస్సులదరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో, నారి తొలగినవై ఉండుగాక!

**విశేషాలు :**

ఆకాశానికి, సముద్రానికి పోలిక లేదని వాల్మీకి చెప్పాడు. కాని సముద్రానికి, ఆకాశంతో పోలికను ఈ మంత్రం ఆవిష్కరించటం విశేషం.

**3. నీలగ్రీవాశ్శితికంఠాః శర్వా అధః క్షమాచరాః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| నీలగ్రీవాః | = | రుద్రాంగులు (రుద్రుని యొక్క మూర్తి విశేషములు) కొన్ని ప్రదేశాలలో కాలకూట విషాన్ని తీసుకొన్న తరువాత ఏర్పడిన నల్లని కంఠము కలవారు; |
| శితి కంఠాః | = | తెల్లని కంఠము కలవారు; |
| శర్వాః | = | ప్రళయకాలములో భూతములను హింసించువారు; |
| అధః క్షమాచరాః | = | భూమి అడుగున తిరుగువారు (పాతాళమున తిరుగువారు). |



**తాత్పర్యము :**

రుద్రాంగులు (రుద్రుని యొక్క మూర్తి విశేషములు) నల్లని కంఠము కలవారు మరియూ తెల్లని కంఠము కలవారు. వారు ప్రళయకాలములో భూతములను హింసించువారు. పాతాళమున తిరుగువారు. అటువంటి రుద్రాంగులు మమ్ములను శిక్షించవద్దని ఈ మంత్ర భావము.

**4. నీలగ్రీవాశ్శితికంఠా దివం రుద్రా ఉపశ్రితాః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| దివం ఉపశ్రితాః | = | స్వర్గమును ఆశ్రయించి ఉన్న; |
| నీలగ్రీవాశ్శితికంఠాః | = | నల్లని, తెల్లని కంఠము కలవారయిన |
| రుద్రాః | | రుద్రులు. |

**తాత్పర్యము :**

స్వర్గమును ఆశ్రయించి ఉన్న నల్లని, తెల్లని కంఠము కలవారయిన రుద్రులు మా దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో ఉండి మమ్ములను శిక్షించవద్దని ఈ మంత్ర భావము.

**విశేషాలు :**

రుద్రునితో సారూప్యము ఉండుటవలన రుద్రాంగులను కూడా ఈ మంత్రములో రుద్రులని చెప్పారు

**5. యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యే వృక్షేషు | = | వృక్షములందు ఏ రుద్రాంగులు ఉన్నారో వారు; |
| సస్పింజరాః | = | లేత గడ్డి వలె ఎరుపును మించిన పసుపు వర్ణము కలవారు; |
| నీలగ్రీవాః | = | నీల వర్ణమైన కంఠము కలవారు; |
| విలోహితాః | = | రక్త వర్ణము కలవారు. |



**తాత్పర్యము :**

వృక్షములందు ఏ రుద్రాంగులు ఉన్నారో వారు లేత గడ్డి వలె ఎరుపును మించిన పసుపు వర్ణము కలవారు. నీల వర్ణమైన కంఠము కలవారు. ఎరుపు వర్ణము కలవారు.

**విశేషాలు :**

తెలుపు వివిధ వర్ణాలలో ఉన్న రుద్రాంగులను ప్రస్తావించి, వారు దరిదాపులో లేకుండా, వేలకొలది యోజనాల దూరములో ఉండి, శిక్షించవద్దని ఈ మంత్రము చెబుతోంది.

ఎరుపును మించిన పసుపు రంగును పింజర వర్ణము అంటారు. వృక్ష శబ్దము ఇక్కడ స్థావర జంగములైన జీవులందరికి ప్రతీక. విలోహిత శబ్దము నానావిధములైన ఎరుపురంగు కలవారను అర్థముతో పాటు కాలుష్యము లేనివారు అను ఇంకొక అర్థమును కూడా సూచించుచున్నదని పెద్దలు చెప్పారు.

**6. యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| భూతానామ్ | = | బలగ్రాహులు మొదలైన భూతములు (భూతానాం); |
| అధిపతయః | = | ప్రభువులు; |
| విశిఖాసః | = | నున్నగా చేయ బడిన శిరస్సులు కలవారు; |
| కపర్దినః | = | జటాజూటములు కలవారు; |
| యే | = | ఈరకంగా ఏ రుద్రులు కానరాని శరీరము కలవారై ఉన్నారో. |

**తాత్పర్యము :**

రుద్రాంగులలో కొందరు బలగ్రాహులు మొదలైన భూతములు. కొంతమంది ప్రభువులు. కొంతమంది నున్నగా చేయ బడిన శిరస్సులు కలవారు. మరికొంతమంది జటాజూటములు కలవారు ఈ రకంగా ఏ రుద్రులు ఉన్నారో, వారు దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో ఉండి శిక్షించవద్దని ఈ మంత్రము చెబుతోంది.



**విశేషాలు :**

జటాజూటము పేరు కపర్ది. సుఖముచే నిండించునది అని ప్రతిపదార్థం.

**7. యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యే | = | ఏ రుద్రులు (రుద్రాంశ గలవి); |
| అన్నేషు | = | భుజింపదగిన వస్తువులలో గూఢముగా ఉండి; |
| వివిధ్యంతి | = | జనాలను విశేషముగా బాధిస్తున్నాయో; |
| పాత్రేషు | = | పాలు ఉన్న పాత్రలలో ఉన్నవై; |
| పిబతో జనాన్ | = | ఆ పాలు త్రాగే జనులను బాధిస్తున్నాయో. |

**తాత్పర్యము :**

ఏ రుద్రులు (రుద్రాంశ గలవి) భుజింపదగిన వస్తువులలో గూఢముగా ఉండి జనాలను విశేషముగా బాధిస్తున్నాయో, పాలు ఉన్న పాత్రలలో ఉన్నవై, ఆ పాలు త్రాగే జనులను బాధిస్తున్నాయో ఆ రుద్రాంశలు దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో ఉండి శిక్షించవద్దని ఈ మంత్రము చెబుతోంది.

**8. యే పథాం పథి రక్షయ ఐలబృదా యవ్యుధః ।**

**పతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యే ఐలబృదాః | = | ఏ రుద్రులు అన్నదానముచే జీవులను పోషిస్తున్నారో; |
| యవ్యుధః పథాం పథి రక్షయ | = | ఏది కొట్టదగినదో దానినే కొట్టు వారలయిన (యత్ విధ్యన్తి) రుద్రులు లౌకిక వైదిక మార్గములను రక్షించువారో. |

**తాత్పర్యము :**

అన్నదానముచే జీవులను పోషిస్తూ, ఆయువును అపహరిస్తూ, లౌకిక వైదిక మార్గములను రక్షిస్తుంటారో, ఆ రుద్రుల బాణములు దరిదాపులో



లేకుండా వేలకొలది యోజనాల దూరములో ఉండి మమ్ములను శిక్షించవద్దని ఈ మంత్రము చెబుతోంది.

**విశేషాలు :**

ఐలమును భరించువారు ఐల భృత్తులు. ఐలము అనగా ఇలకు సంబంధించినది. అన్నరాశి. భకారానికి బకారము, తకారానికి దకారము వైదికములో వాడుట పరిపాటి. కనుక ఐలభృత, ఐలబృద అయింది. అన్నపురాశిని భక్త సమూహాలకు ఇచ్చుటకై ధరించినవారు ఐలబృదులని తాత్పర్యము. యువ శబ్దము ఇక్కడ ఆయువు అను విశేషార్థము ఇచ్చుచున్నది. రుద్రులకు కొట్టదగినది ఆయువు.

**9. యే తీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యే | = | ఏ రుద్రులు; |
| తీర్థాని ప్రచరంతి | = | గంగ మొదలైన తీర్థప్రదేశములను, కాశీ ప్రయాగాది క్షేత్రములను రక్షించుటకు తిరుగుచున్నారో; |
| సృకావంతః | = | వారు ఈటెలు కలవారును, (బాకులు కలవారు); |
| నిషంగిణః | = | అమ్ములపొదులు కలవారయి ఉన్నారు. (ఖడ్గములు కలవారు); |

**తాత్పర్యము :**

ఏ రుద్రులు గంగ మొదలైన తీర్థ ప్రదేశములను, కాశీ ప్రయాగాది క్షేత్రములను రక్షించుటకు తిరుగుచున్నారో, వారు ఈటెలు కలవారును, (బాకులు కలవారు) అమ్ములపొదులు కలవారయి ఉన్నారు. (ఖడ్గములు కలవారు) అటువంటి రుద్రుల బాణములు దరిదాపులో లేకుండా వేలకొలది యోజనాల దూరములో ఉండి మమ్ములను శిక్షించవద్దని ఈ మంత్రము చెబుతోంది.



**విశేషాలు :**

కొందరికి తీర్థ ఫలితాన్ని ఇచ్చుటకు, కొందరికి తీర్థ ఫలితాన్ని ఇవ్వకుండా ఉండటానికి రుద్రులు అలా తిరుగుతుంటారట.

**10. య ఏతావంతశ్చ భూయాంసశ్చ దిశో రుద్రా వితస్థిరే ।**
**తేషాం సహస్రయోజనేవ ధన్వాని తన్మసి ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| య ఏతావంతశ్చ | = | ఇప్పుడు చెప్పబడిన ఏ రుద్రులు వేలకొలది ఉన్నారో; |
| భూయాంసశ్చ | = | అంతకంటె అధికులై; |
| దిశో రుద్రా వితస్థిరే | = | అన్ని దిక్కులలో కలరో; |
| తేషాం సహస్రయోజనేవ ధన్వాని తన్మసి | = | వారి ధనుస్సులు మాకు వేయి యోజనాల దూరములో వింటి త్రాడు తొలగి ఉండు గాక. |

**తాత్పర్యము :**

ఇప్పుడు చెప్పబడిన ఏ రుద్రులు వేలకొలది ఉన్నారో, అంతకంటె అధికులై అన్ని దిక్కులలో కలరో, వారి ధనుస్సులు మాకు వేయి యోజనాల దూరములో వింటి త్రాడు తొలగి ఉండు గాక!

**విశేషాలు :**

రుద్రులు అనేకమంది ఉన్నారని భావము.

**11. నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేంతరిక్షే ।**
**యే దివి యేషామన్నం వాతో వర్షమిషవ ।**
**స్తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణాదశ ప్రతీచీ**
**ర్దశోదీచీ ర్దశోర్ధ్వాస్తేభ్యో నమస్తేనో మృడయంతు తే యం**
**ద్విష్మోయశ్చనోద్వేష్టి తం వో జంభే దధామి ।**

ఈ పెద్ద మంత్రాన్ని మూడు రకాలుగా విడగొట్టుకొని అర్థం చెప్పుకోవాలి.



**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| రుద్రేభ్యో యే పృథివ్యామ్ | = | ఏ రుద్రులు భూమిపై ఉన్నారో; |
| యేషామన్నం ఇషవః | = | ఏరుద్రులకు ఆహారమే బాణములో; |
| తేభ్యః రుద్రేభ్యః నమః (అస్తు) | = | అటువంటి రుద్రులకు నమస్కారము; |
| ప్రాచీః దశ | = | అటువంటి రుద్రులకు తూర్పు ముఖముగా ఉన్న పది వేళ్ల చివరలు గల అంజలులతో నమస్కరిస్తున్నాను; |
| దక్షిణాదశ | = | అటువంటి రుద్రులకు దక్షిణ ముఖముగా ఉన్న పది వేళ్ల చివరలు గల అంజలులతో నమస్కరిస్తున్నా |
| ప్రతీచీర్దశః | = | అటువంటి రుద్రులకు పడమర ముఖముగా ఉన్న పది వేళ్ల చివరలు గల అంజలులతో నమస్కరిస్తున్నాను; |
| దశోదీచీః | = | అటువంటి రుద్రులకు ఉత్తర ముఖముగా ఉన్న పది వేళ్ల చివరలు గల అంజలులతో నమస్కరిస్తున్నా |
| దశోర్ధ్వాః తేభ్యో నమః | = | అటువంటి రుద్రులకు ఊర్ధ్వ ముఖముగా ఉన్న పది వేళ్ళ చివరలు గల అంజలులతో నమస్కరిస్తున్నా |
| తే నః మృడయంతు | = | అటువంటి రుద్రులు మమ్ములను సుఖముగా ఉంచుగాక!; |
| తే | = | ఎవరిని; |
| అయమ్ | = | మేము; |
| ద్విష్మః | = | ద్వేషిస్తామో; |
| యశ్చ | = | ఎవ్వడు; |



| | | |
|---|---|---|
| నః | = | మమ్ములను; |
| ద్వేష్టి | = | ద్వేషించుచున్నాడో; |
| తమ్ | = | అట్టి శత్రువును; |
| వః | = | మీయొక్క రుద్రులయొక్క; |
| జంభే | = | తెరవబడిన నోటిలో; |
| దధామి | = | ఉంచుచున్నాను. |

**తాత్పర్యము :**

ఎవరిని ద్వేషిస్తామో, ఏ శత్రువు మమ్ములను ద్వేషిస్తాడో, ఆ శత్రువులను రుద్రులారా! మీయొక్క తెరచి యున్న నోటిలో ఉంచుచున్నాను.

**విశేషాలు :**

ఈ మంత్రము చదివే వానికి సుఖము, చదివే వారి శత్రువుకు నాశనమును కోరుచున్నది. నమో రుద్రేభ్యః అను చోట వాచిక నమస్కారము, దశ ప్రాచీ మొదలయిన చోట్ల కాయిక నమస్కారము, తేభ్యో నమః అను చోట మానసిక నమస్కారము చెప్పబడినది.

**12. ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ।**
**ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| సుగంధిమ్ | = | చక్కటి వాసనలు కలవాడు (ఆనంద స్వరూపుడు); |
| పుష్టి వర్ధనమ్ | = | శక్తిని పెంచువాడు అయిన; |
| త్ర్యంబకమ్ | = | మూడు కన్నులు కలిగిన శివుని; |
| యజామహే | = | సేవించెదము; |
| బంధనాత్ | = | బంధమునుండి; |
| ఉర్వారుకమివ | = | దోసపండు వలె (తనంతట తానే విడివడి, కింద పడిపోయినట్లు); |



| | | |
|---|---|---|
| మృత్యోః | = | సంసార బంధనము నుండి; |
| ముక్షీయ | = | మనంతతట మనం విడివడాలి; |
| అమృతాత్ | = | మోక్షమునుండి; |
| మా (ముక్షీయ) | = | మనము విడిపోకుండెదము గాక! |

**తాత్పర్యము :**

చక్కటి వాసనలు కలవాడు, శక్తిని పెంచువాడుఅయిన, మూడు కన్నులు కలిగిన శివుని సేవించెదము. బంధమునుండి తనంతట తానే విడివడి, కింద పడిపోవు దోసపండు వలె సంసార బంధనమునుండి మనంతట మనం విడివడాలి. (అలా మమ్మలిని చేయమని ఇక్కడ ప్రార్థన.) మోక్షమునుండి మనము విడిపోకుండెదము గాక!

**విశేషాలు :**

సుగంధి - శివునికి విశేషణంగా ప్రయోగించిన సుగంధి పదము మానవులమైన మనకు ఒక చక్కటి హితోపదేశము చేస్తోంది. లోకములో కనిపించు విషయ వాసనలు నిజమైన సుగంధ భరితాలు కావు. ఒక చక్కటి వాసనను ఆస్వాదించిన వెంటనే మనకు ఎటువంటి హాయి కలుగుతుందో, అలాగే శివుని పేరు తలుచుకొన్నంతనే అటువంటి హాయి మనకు కలగాలి.

సుగంధిం: సు = మంచిదైన, గంధ = సువాసన ద్రవ్యం. మంచి సువాసనలతో కూడుకున్న గంధం నాలుగు దిక్కులలోనూ వాసనలను చల్లినట్లుగా మనపై తన భక్తజన వాత్సల్యమనే సుగంధాన్ని ఆ స్వామి చల్లుతున్నాడు. అందుకే ఆయన సుగంధి. ఈ మంత్ర పఠనము వలన నిత్యజీవితంలో కలిగే అతి కష్టమైన సమస్యలు తమంతటా తామే విడిపోతాయి.

**అనాయాసేన మరణమ్, వినా దైన్యేన జీవనమ్ –** అని పెద్దల మాట. తప్పనిదైన మరణము చాల సులభంగా రావాలి. తీసుకొని, తీసుకొని చావకూడదు. ఆసుపత్రి మంచం మీద సేవలు చేస్తూ వీడు ఎప్పుడు పోతాడ్రా! అని ఇంట్లో వాళ్లు , బంధువులు విసుక్కొనేటట్లు చావకూడదు. అతి తేలిగ్గా మరణము రావాలి. అది చేసేది పరమశివుని యొక్క ఈ మంత్రము. అందుకే దీనిని నిత్యము శ్రద్ధతో చదవాలంటారు.



**మృత్యుర్యస్వాప సేచనం** అని శ్రుతి. అంటే మృత్యువు శివునికి ఊరగాయ లాంటిదని అర్థం. తనను ప్రార్థించే వారి అపమృత్యువును నివారించేవాడు కాబట్టి శివునకు మృత్యుంజయుడు అని పేరు. దీనిని మహామృత్యుంజయ మంత్రంగా చెబుతారు. ఇది మనకు ఆయురారోగ్యాలను, సౌభాగ్యాన్ని, దీర్ఘాయువును, శాంతిని, తృప్తిని ఇస్తుంది. ఈ మహామంత్రాన్ని జపిస్తే, దైవ ప్రకంపనలు మొదలయి, యాక్సిడెంటులు మొదలైనవి కలిగించే మన చుట్టూ ఉన్న దుష్టశక్తులను తరిమికొడతాయి. అందువలన మంత్రాన్ని చదివే వారికి ఓ శక్తివంతమైన రక్షణ కవచం ఏర్పడుతుంది. ఈ మంత్రానికి అన్ని రోగాలను తగ్గించే శక్తి ఉంది.

**13. యో రుద్రో అగ్నౌ యో అప్సుయ ఓషధీషు**
**యో రుద్రో విశ్వా భువనా వివేశ తస్మై రుద్రాయ నమో అస్తు ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| యో రుద్రో | = | ఏ రుద్రుడు; |
| అగ్నౌ | = | అగ్నిలో; |
| యో అప్సు | = | ఏ రుద్రుడు నీటిలో; |
| య ఓషధీషు | = | ఏ రుద్రుడు ఓషధులయందు; |
| యో రుద్రో | | ఏ రుద్రుడు విశ్వమున భువనములో; |
| విశ్వా భువనా | = | |
| వివేశ | = | లీనమై ఉన్నాడో; |
| తస్మై రుద్రాయ | = | అట్టి రుద్రునకు; |
| నమో అస్తు | = | నమస్కారము అగును గాక. |

**తాత్పర్యము :**

ఏ రుద్రుడు అగ్నిలో, నీటిలో, ఓషధులయందు, విశ్వమున భువనములలో లీనమై ఉన్నాడో అటువంటి రుద్రునకు నమస్కారము. (అన్ని చోట్లా రుద్రుడున్నాడని తాత్పర్యము)

**14. తముష్టుహి యస్స్విషుసు ధన్వాయో విశ్వస్య క్షయతి భేషజస్య ।**
**యక్ష్వా మహే సౌ మనసాయ రుద్రం నమోభిర్దేవమసురం దువస్య**



**తాత్పర్యము :**

చక్కటి అస్త్ర శస్త్రాలు కలిగినవాడు, వైద్యుడై మన రోగాలను పోగొట్టే వాడు, రాక్షసులను సంహరించేవాడయిన రుద్రునికి మన మనస్సులను శాంతంగా పవిత్రం చేస్తున్నందుకు నమస్కరిద్దాం.

**విశేషాలు :**

ఈ మంత్రంలోని స్తుహి, యక్ష్వ , దువస్య అను మూడు క్రియా పదాలు వరుసగా వాక్కు, మనస్సు, శరీరాలతో చేసే త్రికరణ పూజను సూచిస్తున్నాయి.

**15. అయంమే హస్తో భగవానయంమే భగవత్తరః ।**
**అయంమే విశ్వభేషజోయం శివాభిమర్శనః ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| మే అయం హస్తః | = | నాయొక్క ఈ చేయి; |
| శివాభిమర్శనః | = | శివునియొక్క పవిత్రమైన ప్రతిమను, లింగాకారమును తాకింది (అలంకరణము మరియూ అభిషేకము చేసే సంద ర్భాలలో); |
| అయమ్ | = | అటువంటి ఈ చేయి; |
| భగవాన్ | = | అదృష్టము కలది; |
| మే అయమ్ | = | నాయొక్క శివుని తాకిన ఆ చేయి; |
| భగవత్తరః | = | చాలా అదృష్టకరమైనది; |
| మే అయమ్ | = | నాయొక్క శివుని తాకిన ఆ చేయి; |
| విశ్వ భేషజః | = | సమస్తమైన రోగములకు చక్కటి ఔషధము. |

**తాత్పర్యము :**

నా చేయి అలంకరణము, మరియూ అభిషేకము చేసే సందర్భాలలో శివునియొక్క పవిత్రమైన ప్రతిమను, లింగాకారమును తాకింది. అటువంటి ఈ చేయి అదృష్టము కలది. అదృష్టకరమైనది. పరమశివుని పూజించిన



ఈ చేయి సమస్తమైన రోగములకు చక్కటి ఔషధము.

**16. మృత్యవే స్వాహా మృత్యవే స్వాహా ।**

**ప్రతిపదార్థము :**

మృత్యవే స్వాహా = మృత్యురూపుడైన పరమేశ్వరునికి ప్రీతి కలుగుటకు ఈ అగ్నిహోత్రము ద్వారా ఈ నమకమంత్రములతో కూడిన హోమము చేస్తున్నాము. మమ్మలిని అతడు రక్షించు గాక!

**విశేషాలు :**

దేవతలకు హవిస్సును (= అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురంబెట్టిన అన్నము;) ఆహుతి చేసేటప్పుడు చెప్పేమాట స్వాహా.

యజ్ఞకాండలో స్వాహా శబ్దం లేకుండా హవిస్సులు వేల్చడం ఉండదు. ఏ దేవతలను ఉద్దేశించి యజ్ఞాదులు చేస్తున్నారో వారికి హవిస్సులు అందడానికి 'స్వాహా' తప్పనిసరి. ఆహుతులు స్వాహాకార, వషట్కార పూర్వకంగా వేల్చినప్పుడే దేవతలకు అందుతాయి. ఐతే, సంధ్యావందనంలో కేశవ నామాలు చెప్పేటప్పుడు "త్రిరాచమ్య" అంటూ ముమ్మారు స్వాహాకారంతో ఆచమనం చేయడం పద్ధతి.ఇక్కడ హోమాగ్ని ప్రసక్తి లేదు. ఐనప్పటికీ అవి దేవతలకు సమర్పించేవే కనుక స్వాహా శబ్దాన్ని వాడవలసి వస్తున్నది. స్వాహా శబ్దం హోమ సంబంధమైన సాంకేతిక పదం మాత్రమే కాదు. అది సార్థకమైన వాఙ్నామం కూడా. చక్కగా హుతమగుగాక అనే అర్థాన్ని కొందరు భాష్యకారులు ఉదహరించారు. ఇది మహామహిమాన్వితమైన మంత్రమని కొందరు విద్వాంసుల భావన. వేదమంత్రాలు లేకుండానే స్వాహా మంత్రోచ్చారణ చేసే సందర్భాలు ఉన్నాయి. నిత్యనైమిత్తిక కర్మలలోనూ యజ్ఞ యాగాదులలోనూ ఆచమన క్రియతో "స్వాహా" సాక్షాత్కరించడం ప్రారంభమవుతుంది. దేవతలకు ఆహుతులను అందించే శబ్దంగా "స్వాహా" ప్రసిద్ధమైంది.

**17. ఓం నమో భగవతే రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి ।**

**ప్రతిపదార్థము :**

విష్ణవే = అంతటా వ్యాపించిన దేవునకు;



| | | |
|---|---|---|
| భగవతే | = | ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన గుణములు కలిగిన భగవంతునికి; |
| రుద్రాయ నమః | = | రుద్రునికి నమస్కారము; |
| మృత్యుర్మే పాహి | = | సంసారబంధములనుండి నన్ను రక్షించు. |

అంతటా వ్యాపించిన దేవునకు, ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన గుణములు కలిగిన భగవంతునికి, రుద్రునికి నమస్కారము. సంసార బంధములనుండి నన్ను రక్షించు. ఓ శివా! నీకు నమస్కారము.

***(ఇంతటితో నమకము సమాప్తము ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః)***

"నమ' తో పూర్తయ్యే శ్లోకాలు నమకము , 'చమే' తో పూర్తయ్యే శ్లోకాలు చమకంగా చెబుతారు. శివపూజలలో నమకము, చమకములు కలిపి వాడతారు. క్రోధ ప్రధానమైనది రుద్రుని ఘోర శరీరము. అందుకే ఆ స్వామి ప్రసన్నత కోసం నమ శబ్దముతో 'నమస్తే రుద్ర" అని నమకము ప్రారంభిస్తారు.

జప, హోమ అర్చనాదులలో నమక మంత్రాలు చదివిన తరువాత, రుద్రుని రుద్రత్వము తొలగిపోతుంది. ఆయన శివునిగా మారతాడు. అప్పుడు భక్తుడు తనకు ఏమి కావాలో ఆ శివుడిని చమక రూపంలో అడుగుతాడు. నమకంలో లాగానే దీనిలో కూడా పదకొండు అనువాకములు ఉన్నాయి. కృష్ణయజుర్వేదములోని, నాలుగవ కాండ, ఏడవ ప్రపాఠకములో ఉన్న చమక అర్థ తాత్పర్య విశేషాలు ఆ శివయ్య దయతో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.





# చమకము మొదటి అనువాకము

**అగ్నావిష్ణూ సజోషసేమా వర్ధన్తు వాం గిరః ద్యుమ్నైర్వాజేభిరాగతమ్ ।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| అగ్నావిష్ణూ | = | ఓ అగ్నా విష్ణువులారా! (అగ్నియును విష్ణువును కలిపి అగ్నా విష్ణువులు); |
| సజోషసే | = | మీరు సమానమైన ఇష్టము కలిగిన వారుగా ఉండండి; |
| వామ్ | = | మీ యొక్క; |
| ఇమాః గిరః | = | ఈ మాటలు (నేను పలుకబోవు ఈ స్తుతులు); |
| వర్ధన్తు | = | అభివృద్ధి పొందుగాక; |
| ద్యుమ్నైః | = | మీరు ధనములతో (బంగారము, వెండి మొదలగునవి); |
| వాజేభిః | = | అన్నములతో కూడిన వారయి; |
| ఆగతమ్ | = | రండు. |

**తాత్పర్యము :**

ఓ అగ్నా విష్ణువులారా! మీరు సమానమైన ఇష్టము కలిగిన వారుగా ఉండండి. మీ గురించి నేను పలుకబోవు ఈ స్తుతులు అభివృద్ధి పొందుగాక. మీరు ధనములతో అన్నములతో కలిసి రండు.

**విశేషాలు :**

శివుడు అగ్ని మరియూ విష్ణు రూపములో ఉన్నవాడని భావం. అన్నధనాదులను మాకు ప్రసాదించమని వినయపూర్వక ప్రార్థన.

**వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే ప్రసితిశ్చ మే ధీతిశ్చ మే క్రతుశ్చ మే స్వరశ్చ మే శ్లోకశ్చ మే శ్రావశ్చ మే శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ మే సువశ్చ మే ప్రాణశ్చ మేఽపానశ్చ మే వ్యానశ్చ మేఽసుశ్చ మే చిత్తం చ మ**



**ఆధీతం చ మే వాక్చ మే మనశ్చ మే చక్షుశ్చ మే శ్రోత్రం చ మే దక్షశ్చ మే బలం చ మ ఓజశ్చ మే సహశ్చ మ ఆయుశ్చ మే జరా చ మ ఆత్మా చ మే తనూశ్చ మే శర్మ చ మే వర్మ చ మేఽఙ్గాని చ మేఽస్థాని చ మే పరూగ్ంషి చ మే శరీరాణి చ మే ॥**

**ప్రతిపదార్థము :**

"కల్పతామ్" అనగా కలుగు గాక అని అర్థం. ఇది చమకములోని దశమానువాకము లో వస్తుంది. ఈ క్రియా పదాన్ని ప్రతి అనువాకములోని **చమే** పక్కన కలుపుకోవాలి. చమే లో చ సముచ్చయార్థకము. (పరస్పరము నిరపేక్షాలయిన అవయవార్థాలకు ఒక దానితో సంబంధము కలిగించేది సముచ్చయం.) మే అనగా నాకు, నాయొక్క అని అర్థం.

వాజశ్చ మే =వాజః చ మే = వాజః = అన్నము నాకు కలుగుగాక!;

| | | |
|---|---|---|
| ప్రసవశ్చ మే | = | అన్నముయొక్క ఆజ్ఞ నాకు కలుగు గాక! (ఇవ్వబడుగాక!); |
| ప్రయతిశ్చ మే | = | శుద్ధి నాకు కలుగు గాక! (ఇంద్రియముల వలన మరలుట శుచి. ఇంద్రియ నిగ్రహము కలిగిన అటువంటిశుద్ధి కావలెనని ప్రార్థన.); |
| ప్రసితిశ్చ మే | = | ఆసక్తి నాకు కలుగు గాక! (ప్రసితి అంటే బంధము. బంధములందు ఆసక్తి అని భావం); |
| ధీతిశ్చ మే | = | అన్నము ధరించుట నాకు కలుగు గాక!; |
| క్రతుశ్చ మే | = | అన్నమునకు కారణమయిన యజ్ఞము నాకు కలుగు గాక! (చేయబడునది క్రతువు); |
| స్వరశ్చ మే | = | ఉదాత్తము మొదలైన స్వరము నాకు కలుగు గాక!; |
| శ్లోకశ్చ మే | = | స్తోత్రము నాకు కలుగు గాక! (శ్లోకమనగా కీర్తి అని ఇంకొక అర్థము.); |



| | | |
|---|---|---|
| శ్రావశ్చ మే | = | వినిపించు శక్తి నాకు కలుగు గాక!; |
| శ్రుతిశ్చ మే | = | వినే సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| జ్యోతిశ్చ మే | = | ప్రకాశము నాకు కలుగు గాక!; |
| సువశ్చ మే | = | స్వర్గము నాకు కలుగు గాక!; |
| ప్రాణశ్చ మే | = | ప్రాణవాయువు యొక్క వ్యాపారము నాకు కలుగు గాక! (ప్రకర్షముగా శ్వాసాదులను బయటకు వెడలించునది ప్రాణము. ఇది హృదయములో ఉండి గర్భాదులలో అన్నాదులను ప్రవేశింపచేస్తుంది); |
| అపానశ్చ మే | = | అపాన వాయువు యొక్క వ్యాపారము నాకు కలుగు గాక! (విణ్మూత్రాదులను అధో భాగమునొందించేది అపానము. ఇది గుద స్థానములో ఉంటుంది); |
| వ్యానశ్చ మే | = | వ్యాన వాయువుయొక్క వ్యాపారము నాకు కలుగు గాక! (శరీరమంతటా ఉండేది వ్యానము); |
| అసుశ్చమే | = | ప్రాణ, అపాన, వ్యాన వ్యాపారములు గల వాయువు నాకు కలుగు గాక! (శరీరమందు ఉంచబడినది అసువు); |
| చిత్తం చమ | = | మనస్సు వలన కలుగు జ్ఞానము నాకు కలుగు గాక! (తెలియ చేయునది చిత్తము); |
| ఆధీతం చమే | = | ఆ జ్ఞానానికి విషయమయిన ద్రవ్యము నాకు కలుగు గాక!; |
| వాక్చమే | = | వాక్కు అనే ఇంద్రియము నాకు కలుగు గాక!; |
| మనశ్చ మే | = | మనస్సు అనే ఇంద్రియము నాకు కలుగు గాక! (ఎరుగబడునది మనస్సు); |



| | | |
|---|---|---|
| చక్షుశ్చ మే | = | కన్ను అనే ఇంద్రియము నాకు కలుగు గాక! (వస్తు స్వరూపమును చెప్పునది కనుక కన్నుకు చక్షువని పేరు); |
| శ్రోత్రం చ మే | = | చెవి అనే ఇంద్రియము నాకు కలుగు గాక! (దీనిచేత విందురు కనుక చెవికి శ్రోత్రము అని పేరు); |
| దక్షశ్చ మే | = | జ్ఞానేంద్రియములలో సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| బలం చ మ | = | కర్మేంద్రియములలో సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| ఓజశ్చ మే | = | బలమునకు కారణమయిన ఎనిమిదవ ధాతువు సామర్థ్యము నాకు కలుగు గాక! (స్పష్టముగా ఉండునది కనుక బలమునకు ఓజస్సు అనిపేరు); |
| సహశ్చ మ | = | శత్రువులను ఎదిరించు సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| ఆయుశ్చ మే | = | ఆయుష్యము నాకు కలుగు గాక!; |
| జరా చ మ | = | ముసలితనము వచ్చు వరకు బ్రతికి యుండు సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| ఆత్మా చ మే | = | పరమాత్మ నాకు కలుగు గాక!; |
| తనూశ్చ మే | = | మంచి శరీరము నాకు కలుగు గాక! (ఆహారము చేత విస్తరింపచేయబడునది కనుక శరీరానికి తనువు అనిపేరు); |
| శర్మ చ మే | = | సుఖము నాకు కలుగు గాక! (అశుభాన్ని చెరచునది కనుక సంతోషానికి శర్మ అని పేరు); |
| వర్మ చ మే | = | కవచము నాకు కలుగు గాక!; |





| | | |
|---|---|---|
| అఙ్గాని చ మే | = | సంపూర్ణమైన అవయములు నాకు కలుగు గాక!; |
| అస్థాని చ మే | = | ఆయా అవయవములలో బలమైన ఎముకలు నాకు కలుగు గాక!; |
| పరూగ్ంషి చ మే | = | వేళ్ళు మొదలైనవాని కణుపులు (సంధులు) నాకు కలుగు గాక!; |
| శరీరాణి చ మే | = | ఇదివరకు చెప్పని శరీరము యొక్క అవయవములు నాకు కలుగు గాక! |

**తాత్పర్యము :**

సుగమము





## చమకము రెండవ అనువాకము

**జ్యైష్ఠ్యం చ మ ఆధిపత్యం చ మే మన్యుశ్చ మే భామశ్చ మేஉమశ్చ మేஉమ్భశ్చ మే జేమా చ మే మహిమా చ మే వరిమా చ మే ప్రథిమా చ మే వర్ష్మా చ మే ద్రాఘుయా చ మే వృద్ధం చ మే వృద్ధిశ్చ మే సత్యం చ మే శ్రద్ధా చ మే జగచ్చ మే ధనం చ మే వశశ్చ మే త్విషి శ్చ మే క్రీడా చ మే మోదశ్చ మే జాతం చ మే జనిష్యమాణం చ మే సూక్తం చ మే సుకృతం చ మే విత్తం చ మే వేద్యం చ మే భూతం చ మే భవిష్యచ్చ మే సుగం చ మే సుపథం చ మ ఋద్ధం చ మ ఋద్ధిశ్చ మే క్లిప్తం చ మే క్లిప్తిశ్చ మే మతిశ్చ మే సుమతిశ్చ మే ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| జ్యైష్ఠ్యం చ మ | = | అందరిలోకి మంచి పేరు, అన్నింటిలో ఉత్తమత్వము నాకు కలుగుగాక! (బాగా పొగడదగినది జ్యేష్ఠము); |
| ఆధిపత్యం చ మే | = | ప్రభుత్వము నాకు కలుగు గాక!; |
| మన్యుశ్చ మే | = | మనస్సులో కోపము నాకు కలుగు గాక! (మన్యు శబ్దము దైన్యానికి, యజ్ఞానికి, కోపానికి పేరు); |
| భామశ్చ మే | = | బాహ్య కోపము నాకు కలుగు గాక! (అవసరమయిన సందర్భాలలో ఉత్తుత్తి కోపము మంచి ఫలితాలను ఇస్తుంది. ఇది అనుభవగ్రాహ్యము); |
| అమశ్చ మే | = | అప్రమేయత్వము నాకు కలుగు గాక!; |
| అమ్భశ్చ మే | = | చల్లని తియ్యని నీరు నాకు కలుగు గాక!; |
| జేమా చ మే | = | జయించే సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| మహిమా చ మే | = | గొప్పతనము నాకు కలుగు గాక!; |
| వరిమా చ మే | = | పూజ్యత్వము నాకు కలుగు గాక!; |



| | | |
|---|---|---|
| ప్రథిమా చ మే | = | గృహము, పొలము ఇటువంటివాని అతిశయము నాకు కలుగుగాక!; |
| వర్ష్మా చ మే | = | శరీరము నాకు కలుగుగాక! (తడుపబడునది కనుక శరీరానికి వర్ష్మము అని పేరు); |
| ద్రాఘుయా చ మే | = | సంతానము అవిచ్ఛిన్నముగా ఉండి వంశాభివృద్ధి నాకు కలుగు గాక! (మిక్కిలి దీర్ఘానికి ద్రాఘిష్ఠమని పేరు); |
| వృద్ధం చ మే | = | ఎక్కువయిన అన్నమును, ధనమును నాకు కలుగు గాక!; |
| వృద్ధిశ్చ మే | = | విద్య మొదలయిన గుణములచే ఉత్కర్ష నాకు కలుగు గాక!; |
| సత్యం చ మే | = | సత్యము నాకు కలుగు గాక! (సత్పురుషులయందు పుట్టునది సత్యము); |
| శ్రద్ధా చ మే | = | పరలోకము కలదనే నమ్మకము నాకు కలుగు గాక! (దేనిచేత విశ్వసింతురో అది శ్రద్ధ); |
| జగచ్చ మే | = | గోవులు మొదలయిన కదిలే ధనము నాకు కలుగు గాక!(జగత్ శబ్దము కదిలేదానికి, లోకానికి పేరు); |
| ధనం చ మే | = | బంగారము మొదలయిన ధనము నాకు కలుగు గాక!; |
| వశశ్చ మే | = | అందరూ స్వాధీనులై ఉండుట నాకు కలుగు గాక!; |
| త్విషి శ్చ మే | = | దేహ కాంతి నాకు కలుగు గాక! (కాంతితో కూడినది త్విట్. ); |



| | | |
|---|---|---|
| క్రీడా చ మే | = | జూదమాడే క్రీడ నాకు కలుగు గాక!; |
| మోదశ్చ మే | = | జూదమాడుట వలన కలిగే ఆనందము నాకు కలుగు గాక!; |
| జాతం చ మే | = | ఇదివరలో పుట్టిన సంతానము నాకు కలుగు గాక!; |
| జనిష్యమాణంచమే | = | పుట్టబోవు సంతానము నాకు కలుగు గాక!; |
| సూక్తం చ మే | = | ఋక్కుల సమూహము నాకు కలుగుగాక!; |
| సుకృతం చ మే | = | పుణ్యము నాకు కలుగు గాక!; |
| విత్తం చ మే | = | ఇదివరకు పొందబడిన ద్రవ్యము నాకు కలుగు గాక!; |
| వేద్యం చ మే | = | ఇకముందు పొందదగిన ద్రవ్యము నాకు కలుగు గాక!; |
| భూతం చ మే | = | ఇదివరకు సిద్ధమయిన పొలము నాకు కలుగు గాక!; |
| భవిష్యచ్చ మే | = | ఇక ముందు సిద్ధించేది నాకు కలుగు గాక!; |
| సుగం చ మే | = | చక్కగా పొందబడిన బంధుగ్రామము నాకు కలుగు గాక! (నేను బంధువులుండే ఊళ్లను సందర్శించాలని, అలా కలిగే భాగ్యమిమ్మని శివ ప్రార్థన. ); |
| సుపథం చ మ | = | మంచి మార్గము నాకు కలుగు గాక!; |
| ఋద్ధం చ మ | = | అనుష్ఠించిన కర్మ ఫలము నాకు కలుగు గాక!; |
| ఋద్ధిశ్చ మే | = | అనుష్ఠించ బోయే సత్రయాగాదుల ఫలము నాకు కలుగు గాక!; |
| క్లప్తం చ మే | = | కర్మలయందు సమర్థమయిన ద్రవ్యము నాకు కలుగు గాక!; |





| | | |
|---|---|---|
| క్లప్తిశ్చ మే | = | కర్మలు చేయు సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| మతిశ్చ మే | = | సాధారణమైన పదార్థముల నిశ్చయ జ్ఞానము నాకు కలుగు గాక!; |
| సుమతిశ్చ మే | = | కష్టమయిన అధికార కార్యములు నిర్వహించు జ్ఞానము నాకు కలుగు గాక! |

**తాత్పర్యము :** సుగమము.





## చమకము మూడవ అనువాకము

**శం చ మే మయశ్చ మే ప్రియం చ మేఽనుకామశ్చ మే కామశ్చ మే సౌమ**

**నసశ్చ మే భద్రం చ మే శ్రేయశ్చ మే వస్యశ్చ మే యశశ్చ మే భగశ్చ మే ద్రవిణం చ మే యన్తా చ మే ధర్తా చ మే క్షేమశ్చ మే ధృతిశ్చ మే విశ్వం చ మే మహశ్చ మే సంవిచ్చ మే జ్ఞాత్రం చ మే సూశ్చ మే ప్రసూశ్చ మే సీరం చ మే లయశ్చ మ ఋతం చ మేఽమృతం చ మేఽయక్ష్మం చ మేఽనామయచ్చ మే జీవాతుశ్చ మే దీర్ఘాయుత్వం చ మేఽనమిత్రం చ మేఽభయం చ మే సుగం చ మే శయనం చ మే సూషా చ మే సుదినం చ మే।**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| శం చ మే | = | ఈ లోకంలోని సుఖము నాకు కలుగు గాక!; |
| మయశ్చ మే | = | పరలోక సుఖము నాకు కలుగు గాక!; |
| ప్రియం చ మే | = | సంతోషానికి కారణమయిన వస్తువు నాకు కలుగు గాక!; |
| అనుకామశ్చ మే | = | కోరబడు వస్తువు నాకు కలుగు గాక!; |
| కామశ్చ మే | = | స్వర్గ సుఖము నాకు కలుగు గాక!; |
| సౌమనసశ్చ మే | = | నా మనస్సుకు హాయి కలిగించు బంధు సమూహము నాకు కలుగు గాక!; |
| భద్రం చ మే | = | ఈ లోకంలో అందమైన వస్తువు నాకు కలుగు గాక!; |
| శ్రేయశ్చ మే | = | పరలోక క్షేమము నాకు కలుగు గాక!; |
| వస్యశ్చ మే | = | నివాసానికి సాధనమయిన ఇల్లు మొదలైనవి నాకు కలుగు గాక!; |
| యశశ్చ మే | = | కీర్తి నాకు కలుగు గాక!; |
| భగశ్చ మే | = | సౌభాగ్యము నాకు కలుగు గాక!; |
| ద్రవిణం చ మే | = | ధనము నాకు కలుగు గాక!; |





| | | |
|---|---|---|
| యన్తా చ మే | = | నియమించే గురువులు నాకు కలుగు గాక!; |
| ధర్తా చ మే | = | పోషించే తండ్రి మొదలయిన వారు నాకు కలుగు గాక!; |
| క్షేమశ్చ మే | = | ఉన్నధనాన్ని కాపాడుకొనే శక్తి నాకు కలుగు గాక!; |
| ధృతిశ్చ మే | = | ఆపదలలో చలించని ధైర్యము నాకు కలుగు గాక!; |
| విశ్వం చ మే | = | ప్రపంచములోని సమస్త మానవులు అనుకూలురుగా నాకు కలుగు గాక!; |
| మహశ్చ మే | = | పూజ నాకు కలుగు గాక!; |
| సంవిచ్చ మే | = | వేద శాస్త్రాదులు చదివే జ్ఞానము నాకు కలుగు గాక!; |
| జ్ఞాత్రం చ మే | = | తెలిపే సమర్థత నాకు కలుగు గాక!; |
| సూశ్చ మే | = | సంతానాన్ని ప్రేరేపించే సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| ప్రసూశ్చ మే | = | సేవకులు మొదలైన వారిని ప్రేరేపించే సామర్థ్యము నాకు కలుగు గాక!; |
| సీరం చ మే | = | నాగలి మొదలైన వ్యవసాయ సాధనాల సంపత్తి నాకు కలుగు గాక!; |
| లయశ్చ మే | = | నాగలి మొదలైన వ్యవసాయ సాధనాల సంపత్తికి ప్రతిబంధకాల నాశనము నాకు కలుగు గాక!; |
| ఋతం చ మే | = | యజ్ఞము మొదలైన కర్మ నాకు కలుగు గాక!; |
| అమృతం చ మే | = | ఆ యాగాదుల ఫలము నాకు కలుగు గాక!; |



| | | |
|---|---|---|
| అయక్ష్మం చ మే | = | రాజయక్ష్మము మొదలైన వ్యాధులు రాకుండుట నాకు కలుగు గాక!; |
| అనామయచ్చ మే | = | జ్వరము మొదలైన స్వల్ప వ్యాధులు రాకుండుట నాకు కలుగు గాక!; |
| జీవాతుశ్చ మే | = | బతకటానికి కారణమయిన ఔషధము నాకు కలుగు గాక!; |
| దీర్ఘాయుత్వంచమే | = | చాలా కాలము బతుకుట నాకు కలుగు గాక!; |
| అనమిత్రం చ మే | = | శత్రువులు లేకుండుట రాకుండుట నాకు కలుగు గాక!; |
| అభయం చ మే | = | భయము లేకుండుట రాకుండుట నాకు కలుగు గాక!; |
| సుగం చ మే | = | అందరికి ఇష్టమయిన ఆచారము రాకుండుట నాకు కలుగు గాక!; |
| శయనం చ మే | = | చక్కని శయ్య, తలగడ మొదలైనవి నాకు కలుగు గాక!; |
| సూషా చ మే | = | సంధ్యావందనము మొదలైనవి చేయు చక్కటి ప్రాతః కాలము నాకు కలుగు గాక!; |
| సుదినం చ మే | = | యజ్ఞము, చదువు మొదలైనవి కొనసాగు మంచి రోజులు నాకు కలుగు గాక! |

**తాత్పర్యము :** సుగమము



## చమకము నాలుగవ అనువాకము

**ఊర్క్చ మే సూనృతా చ మే పయశ్చ మే రసశ్చ మే ఘృతం చ మే మధు చ మే సగ్ధిశ్చ మే సపీతిశ్చ మే కృషిశ్చ మే వృష్టిశ్చ మే జైత్రం చ మ ఔద్భిద్యం చ మే రయిశ్చ మే రాయశ్చ మే పుష్టం చ మే పుష్టిశ్చ మే విభు చ మే ప్రభు చ మే బహు చ మే భూయశ్చ మే పూర్ణం చ మే పూర్ణతరం చ మేఽక్షితిశ్చ మే కూయవాశ్చ మేఽన్నం చ మేఽక్షుచ్చ మే వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ మే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే గోధూమాశ్చ మే మసురాశ్చ మే ప్రియంగవశ్చ మేఽణవశ్చ మే శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే ।**

**ప్రతిపదార్థము :**

ఊర్క్చ మే = బలవర్ధకమైన అన్నము నాకు కలుగుగాక! (ఊర్క్ కు బలిమి అను అర్థమును ఆంధ్ర వాచస్పత్యము ఇచ్చింది);

సూనృతా చ మే = ప్రియమైన వచనము నాకు కలుగుగాక! (సుష్ఠు నృత్యంతి అనేన ఇతి సూనృతం. నృతీ గాత్ర విక్షేపే. ఇష్టము, సత్యము అయిన మాటకు సూనృతమని పేరు);

పయశ్చ మే = పాలు నాకు కలుగుగాక! (పీయత ఇతి పయః. పాపానే.

పానము చేయబడునది కనుక పాలకు పయస్సని పేరు);

రసశ్చ మే = పాలలోని రసము నాకు కలుగుగాక! (రస్యత ఇతి రసః. రస ఆస్వాదనే. ఆస్వాదింపబడుదానిని రసమంటారు);

ఘృతం చ మే = నెయ్యి నాకు కలుగుగాక! (జిఘర్తీతి ఘృతం. ఘృక్షరణ దీప్త్యోః. జానది కనుక నేతికి ఘృతమని పేరు);



| | | |
|---|---|---|
| మధు చ మే | = | తేనె నాకు కలుగుగాక! (మన్యతే అభిలష్యత ఇతి మధు. మన జ్ఞానే. అభిలాషచే తలచబడునది కనుకతేనెకు మధువని పేరు) |
| సగ్ధిశ్చ మే | = | బంధువులతో కలిసి భుజించుట నాకుకలుగుగాక! (సమానా జగ్ధిః సగ్ధిః. అద భక్షణే. సమానమైన భోజనము. బంతికుడుపు, పంక్తి భోజనమును సగ్ధి అందురు); |
| సపీతిశ్చ మే | = | బంధువులతో కలిసి పానము చేయుట నాకు కలుగుగాక! (సమానా పీతిః పానం సపీతిః. పాపానే. సమానమైన పానము లేదా కూడి పానము చేయుటకుసపీతి అని పేరు); |
| కృషిశ్చ మే | = | వ్యవసాయము నాకు కలుగుగాక! (కర్షణం కృషిః. కృష విలేఖనే. దున్నుట కలది కనుక వ్యవసాయమునకు కృషి అని పేరు); |
| వృష్టిశ్చ మే | = | వర్షము నాకు కలుగుగాక! (వర్షతీతి వృష్టిః.వృషసేచనే. తడుపునట్టిది కనుక వర్షానికి వృష్టి అని పేరు); |
| జైత్రం చ మే | = | జయించు స్వభావము కలిగిన సుక్షేత్రము నాకు కలుగుగాక! (జయతీతి జైత్రః. జి జయే. ); |
| ఔద్భిద్యం చ మే | = | వృక్ష గుల్మాదుల పుట్టుక నాకు కలుగుగాక! (ఉద్భివన్తి భువమిత్యుద్భిదః. భిదిర్ విదారనే. పుట్టునప్పుడు భూమిని |



| | | |
|---|---|---|
| | | చీల్చునది కనుక చెట్టుకు ఉద్భిదము అని పేరు. ఉద్భిదము నుంచి ఔద్భిదము అను పదము ఏర్పడింది); |
| రయిశ్చ మే | = | ధనము నాకు కలుగుగాక! (రాన్యేనమితి రాః. రా ఆదానే. దీనిని పుచ్చుకొంటారు కనుక ధనమునకు రయి అని పేరు); |
| రాయశ్చ మే | = | రత్నములు నాకు కలుగుగాక!; |
| పుష్టం చ మే | = | సమృద్ధమయిన బంగారము నాకు కలుగుగాక! (పుష్యతే స్మ పుష్టం. పుష పుష్టౌ. పోషింప బడినది. పోషింపబడిన పక్షి మృగాదులకు కూడా పుష్టమని పేరు); |
| పుష్టిశ్చ మే | = | దేహ పోషణము నాకు కలుగుగాక! (మాటలపుష్టి, ధాతుపుష్టి. వారు పుష్టిగానున్నారు / పుష్టులుగానున్నారు); |
| విభు చ మే | = | ఎక్కువయిన ధాన్యము నాకు కలుగుగాక!; |
| ప్రభు చ మే | = | అధికాధికమైన ధాన్యము నాకు కలుగుగాక!; |
| బహు చ మే | = | బహు ధాన్యము నాకు కలుగుగాక!; |
| భూయశ్చ మే | = | బాగా అధికమయిన ధాన్యము నాకు కలుగుగాక!; |
| పూర్ణం చ మే | = | గాదెలలో నిండిన ధాన్యము నాకు కలుగుగాక!; |
| పూర్ణతరం చ మే | = | బాగా గాదెలలో నిండిన ధాన్యము నాకు కలుగుగాక!; |
| అక్షితిశ్చ మే | = | నశింపని ధాన్యములు నాకు కలుగుగాక!; |
| కూయవాశ్చ మే | = | కుత్సితములయిన (నీచములయిన) యవలు (బార్లీయనెడు ధాన్యములు). నాకు కలుగుగాక!; |



| | | |
|---|---|---|
| అన్నం చ మే | = | అన్నము నాకు కలుగుగాక! (అనంతి అనేన ఇత్యన్నం. అన ప్రాణనే. దీని చేత బ్రతుకుదురు); |
| అక్షుచ్చ మే | = | ఆకలి లేకుండుట నాకు కలుగుగాక!; |
| వ్రీహయశ్చ మే | = | ఎఱ్ఱని వడ్లు నాకు కలుగుగాక! (వృణాతి దేహమితి వ్రీహిః. వృ వరణే. దేహమును వరించునది కనుక ఎఱ్ఱని వడ్లకు వ్రీహి అని పేరు); |
| యవాశ్చ మే | = | యవలు నాకు కలుగుగాక! (యౌతి తుషేణేతి యవః. యు మిశ్రణే. పొట్టుతో కూడుకొని యుండునది); |
| మాషాశ్చ మే | = | మినుములు నాకు కలుగుగాక!; |
| తిలాశ్చ మే | = | నువ్వులు నాకు కలుగుగాక! (తిలలు అను పదము సంస్కృతమున నిత్య బహు వచనాంతము కాదు.); |
| ముద్గాశ్చ మే | = | పెసలు నాకు కలుగుగాక!; |
| ఖల్వాశ్చ మే | = | సెనగలు నాకు కలుగుగాక!; |
| గోధూమాశ్చ మే | = | గోధుమలు నాకు కలుగుగాక! (గుధ్యతే పరివేష్ట్యత గోధూమః. గుధ పరివేష్టనే. విసరబడునది కనుక గోధూమము); |
| మసురాశ్చ మే | = | చిఱు సెనగలు నాకు కలుగుగాక! (మస్యతి పరిణమతి మసూరః. మస పరిణామే. పరిపక్వమగునది); |
| ప్రియంగవశ్చ మే | = | కొఱ్ఱలు నాకు కలుగుగాక! (ప్రియాణి అంగాని యస ప్రియంగుః. ప్రియమైన అంగములు కలిగినది); |



| | | |
|---|---|---|
| అణవశ్చ మే | = | సన్నవరి నాకు కలుగుగాక! (అణువులు = చిరు వడ్లు); |
| శ్యామాకాశ్చ మే | = | గ్రామములో కలుగు తృణధాన్య విశేషము - చామలు - నాకు కలుగుగాక! (శ్యామ వర్ణమకతి ప్రాప్నోతీతి శ్యామాకః. అక కుటిలాయమ్ గతౌ. శ్యామ వర్ణమును పొందునది); |
| నీవారాశ్చ మే | = | అరణ్యములో కలుగు తృణధాన్య విశేషము నాకు కలుగుగాక! (నితరాం వ్రియంతే నీవారః. వృ వరనే. మిక్కిలి వరింపబడునవి. ఒకడు విత్తకయే పడి మొలచి పండెడు గునుకు వరి, దూసర్లు మొదలైన తృణధాన్యము). |

**తాత్పర్యము :**

ఓ శివా! నిన్ను పూజించుటవలన బలవర్ధకమైన అన్నము, ప్రియమైన వచనము, పాలు, పాలలోని రసము, నెయ్యి, తేనె, బంధువులతో కలిసి భుజించుట, బంధువులతో కలిసి పానము చేయుట, వ్యవసాయము, వర్షము, జయించు స్వభావము కలిగిన సుక్షేత్రము వృక్ష గుల్మాదుల పుట్టుక, ధనము, రత్నములు, సమృద్ధమయిన బంగారము, దేహ పోషణము, ఎక్కువయిన ధాన్యము, అధికాధికమైన ధాన్యము, బహు ధాన్యము, బాగా అధికమయిన ధాన్యము, గాదెలలో నిండిన ధాన్యము బాగా గాదెలలో నిండిన ధాన్యము నశింపని ధాన్యములు, యవలు, అన్నము, ఆకలిలేకుండుట, ఎఱ్రని వడ్లు, యవలు, మినుములు, నువ్వులు, పెసలు, సెనగలు, గోధుమలు, చిఱు సెనగలు  కొఱ్రలు,సన్నవరి చామలు - ఒకడు విత్తకయే పడి మొలచి పండెడు  గునుకు వరి, దూసర్లు మొదలైన తృణధాన్యము నాకు కలుగుగాక!

**విశేషాలు :**

**1. అన్నము :**

రెండు రకాల అన్నము



1. హవ్యము (దేవయోగ్యము), 2. కవ్యము (పితృయోగ్యము). "హవ్యకవ్యే దైవపిత్ర్యే అన్నే" - అమరకోశము 2-7

నాలుగురకాల అన్నము :

1. భక్ష్యము, 2. భోజ్యము, 3. లేహ్యము, 4. చోష్యము.

ఆరు రకాల అన్నము :

1. భక్ష్యము, 2. భోజ్యము, 3. పేయము, 4. లేహ్యము, 5. చోష్యము, 6. పిచ్ఛిలము.

2. **మాషరాశిప్రవిష్టమషీన్యాయము** (మినుములరాశిలోగలిసిన మసిమాదిరి)

మసికిని మినుములకును గల రంగు ఒకేమాదిరి ఉంటుంది. రాశిగాబోసిన మినుముల నలుపురంగు మంత దట్టమవుతుంది. అపుడు దానిలో గలిసిన మసి ఉన్నట్లే కనబడక మినుములలో కలిసిపోతుంది. అప్పుడు దానిని విడదీయుట కష్టసాధ్యము.





## చమకము అయిదవ అనువాకము

**అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే**
**సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మే**
**ఉయశ్చ మే సీసం చ మే త్రపుశ్చ మే శ్యామం చ మే**
**లోహం చ మేఽగ్నిశ్చ మ ఆపశ్చ మే వీరుధశ్చ మ**
**ఓషధయశ్చ మే కృష్టపచ్యం చ మేఽకృష్టపచ్యం చ మే**
**గ్రామ్యాశ్చ మే పశవ ఆరణ్యాశ్చ యజ్ఞేన కల్పన్తాం**
**విత్తం చ మే విత్తిశ్చ మే భూతం చ మే భూతిశ్చ మే**
**వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మే**
**ఉర్థశ్చ మ ఏమశ్చ మ ఇతిశ్చ మే గతిశ్చ మే**

**ప్రతి పదార్థము**

| | | |
|---|---|---|
| అశ్మా చ మే | = | రాయి నాకు కలుగుగాక !(భూమిని వ్యాపించునది కనుక రాతికి అశ్మమని పేరు.అశూవ్యాప్తౌ. అశ్నుతే వ్యాప్నోతిభువమశ్మా) |
| మృత్తికా చ మే | = | మట్టి నాకు కలుగుగాక !(మెదపబడునది కనుక మన్నుకి మృత్తిక అని పేరు. మృద్యత ఇతి మృత్. మృద క్షోదే.) |
| గిరయశ్చ మే | = | కులపర్వతములు నాకు కలుగుగాక ! కాలము చేత చెరుప బడునది కనుక కొండకి గిరి అనిపేరు. కాలేన గీర్యత ఇతి గిరిః). |
| పర్వతాశ్చ మే | = | ఇతర పర్వతములు నాకు కలుగుగాక! (సంధులు కలిగినది కనుక కొండకు పర్వతము అని పేరు.పర్వాణి సంధయః అస్య పర్వతః) |



| | | |
|---|---|---|
| సికతాశ్చ మే | = | ఇసుక నాకు కలుగుగాక !(తడుపబడునది కనుక ఇసుక. సిచ్యంత ఇతి సికతాః. షిచిర్ క్షరణే.) |
| వనస్పతయశ్చ మే | = | వృక్షములు నాకు కలుగుగాక !(వనస్య పతిః వనస్పతిః. పుష్పములు లేక ఫలములతో కూడిన పనస, మేడి మొదలైనది వనస్పతి.) |
| హిరణ్యం చ మే | = | బంగారము నాకు కలుగుగాక !(హయ్యతి గచ్ఛతీతి హిరణ్యం. పోవునది కనుక బంగారమునకు హిరణ్యమని పేరు) |
| అయశ్చ మే | = | ఇనుము నాకు కలుగుగాక !( కార్యార్థులు దీనిని పొందుదురు కనుక ఇనుముకు అయస్సని పేరు. ఇయంత్యేతదితి అయః. ఇణ్ గతౌ) |
| సీసం చ మే | = | సీసము నాకు కలుగుగాక !(పాదరసమును బంధించునది కనుక సీసకము సినోతి బధ్నాతి పారదమితి సీసకం) |
| త్రపుశ్చ మే | = | తగరము నాకు కలుగుగాక !(అగ్ని సమీపములో సిగ్గు పడునది కనుక తగరానికి త్రపువని పేరు.త్రపతే అగ్ని సన్నిధౌ ద్రవతీతి త్రపుః. త్రపూష్ లజ్జాయాం) |
| శ్యామం చ మే | = | నల్లనైన ఇనుము నాకు కలుగుగాక ! |
| లోహం చ మే | = | రాగి మొదలగు లోహము నాకు కలుగుగాక ! |
| అగ్నిశ్చ మ | = | నిప్పు నాకు కలుగుగాక !(అగతి కుటిలం ఊర్ధ్వం వా గచ్ఛతి ఇత్యగ్నిః . అగ |



| | | |
|---|---|---|
| | | కుటిలాయాం గతౌ. ఊర్ధ్వముగా లేదా వంకరగా అయినా జ్వలించునది) |
| ఆపశ్చ మే | = | నీరు నాకు కలుగుగాక !(ఆప్నువంతి ఇత్యాపః. వ్యాపించునవి ) |
| వీరుధశ్చ మ | = | చిగురు కొమ్మలు (లతలు) నాకు కలుగుగాక !(రుణద్ధీతి వీరుత్. రుధిర్ ఆవరణే. విశేషముగా చుట్టుకొని ఉండునది) |
| ఓషధయశ్చ మే | = | ఫలించినతోడనే నశించెడి చెట్లు నాకు కలుగుగాక! (ఓషః పాకః ధీయతే అత్ర- ఫలపాకము కలది ఓషధి.) |
| కృష్టపచ్యం చ మే | = | దున్నిన మడిలో ఫలించునట్టి ధాన్యము మొదలైనవి నాకు కలుగుగాక ! |
| అకృష్టపచ్యం చ మే | = | దున్నని చోట ఫలించని ధాన్యము మొదలైనవి నాకు కలుగుగాక ! |
| గ్రామ్యాశ్చ మే | = | గ్రామమునందు పుట్టినవి |
| పశవ ఆరణ్యాశ్చ | = | అరణ్యములోని పశువులు |
| యజ్ఞేన కల్పన్తాం | = | యజ్ఞము చేత సమర్థములగుగాక! (యజతే యజ్ఞః. యజ దేవపూజాసంగతి కరణ దానేషు. పూజించుట కలిగినది కనుక యజ్ఞము .) |
| విత్తం చ మే | = | ముందు పొందబోయే ధనము నాకు కలుగుగాక!(విద్యతే లభ్యత ఇతి విత్తం. పొందబడునది కనుక ధనమునకు విత్తమని పేరు) |
| విత్తిశ్చ మే | = | రాబోవు లాభము నాకు కలుగుగాక ! |



| | | |
|---|---|---|
| భూతం చ మే | = | ఐశ్వర్యముతో కూడిన పుత్రులు మొదలైనవారు నాకు కలుగుగాక ! |
| భూతిశ్చ మే | = | స్వకీయమైన ఐశ్వర్యము నాకు కలుగుగాక! |
| వసు చ మే | = | నివాసమునకు సాధనమయిన ఆవులు మొదలయినవి నాకు కలుగుగాక ! |
| వసతిశ్చ మే | = | నివాసమునకు ఆధారమయిన ఆవులు మొదలయినవి నాకు కలుగుగాక! (వసంతస్యామితి వసతిః. దేనియందు ఉండుదురో అది వసతి) |
| కర్మ చ మే | = | అగ్నిహోత్రము మొదలగు కర్మ నాకు కలుగుగాక !(చేయుట కనుక కర్మ) |
| శక్తిశ్చ మే | = | అగ్నిహోత్రము చేయు శక్తి నాకు కలుగుగాక! (శక్యతే శక్తిః. దేని చేత శక్తి కలుగునో అది శక్తి) |
| అర్థశ్చ మ | = | ప్రయోజనము నాకు కలుగుగాక ! |
| ఏమశ్చ మ | = | పొందవలసిన సుఖలాభము నాకు కలుగుగాక ! |
| ఇతిశ్చ మే | = | ఇష్టమయిన దానిని పొందు కారణము నాకు కలుగుగాక |
| గతిశ్చ మే | = | ఇష్ట ప్రాప్తి నాకు కలుగుగాక ! |

**తాత్పర్యము**

ఓ శివా ! నీ అనుగ్రహము వలన రాయి నాకు కలుగుగాక ! మట్టి నాకు కలుగుగాక !కులపర్వతములు నాకు కలుగుగాక !ఇతర పర్వతములు నాకు కలుగుగాక !ఇసుక నాకు కలుగుగాక !వృక్షములు నాకు కలుగుగాక! బంగారము నాకు కలుగుగాక  ఇనుము నాకు కలుగుగాక !సీసము నాకు కలుగుగాక !తగరము నాకు కలుగుగాక !కానుము నాకు కలుగుగాక! రాగి మొదలగు లోహము నాకు కలుగుగాక !నిప్పు నాకు కలుగుగాక !



నీరు నాకు కలుగుగాక ! లతలు నాకు కలుగుగాక !ఫలించినతోడనే నశించెడి చెట్లు నాకు కలుగుగాక !

దున్నిన కయ్యయందు ఫలించునట్టి ధాన్యాదికము నాకు కలుగుగాక దున్నని చోట ఫలించని ధాన్యాదికము నాకు కలుగుగాక! గ్రామమునందు పుట్టినవి , అరణ్యములోని పశువులు యజ్ఞము చేత సమర్థములగుగాక! ముందు పొందబోయే ధనము నాకు కలుగుగాక! రాబోవు లాభము నాకు కలుగుగాక! ఐశ్వర్యముతో కూడిన పుత్రులు మొదలైనవారు నాకు కలుగుగాక స్వకీయమైన ఐశ్వర్యము నాకు కలుగుగాక! నివాసమునకు సాధనమయిన గోవులు మొదలయినవి నాకు కలుగుగాక! నివాసమునకు ఆధారమయిన గోవులు మొదలయినవి నాకు కలుగుగాక!

అగ్నిహోత్రము మొదలగు కర్మ నాకు కలుగుగాక! అగ్నిహోత్రము చేయు శక్తి నాకు కలుగుగాక! ప్రయోజనము నాకు కలుగుగాక పొందవలసిన సుఖలాభము నాకు కలుగుగాక! ఇష్టమయిన దానిని పొందు కారణము నాకు కలుగుగాక! ఇష్ట ప్రాప్తి నాకు కలుగుగాక !

**విశేషాలు**

**కులపర్వతాలు**

ఆరుకులపర్వతములు –

1.హిమవంతము, 2. హేమకూటము, 3. నిషధము, 4. నీలము, 5. శ్వేతము, 6. శృంగి.

ఏడు కులపర్వతములు

1.హిమవంతము, 2. గంధమాదనము, 3. నిషధము, 4. వింధ్యము, 5. మాల్యవంతము, 6. పారియాత్రకము, 7. హేమకూటము.

ఎనిమిదికులపర్వతములు –

1.నీలము, 2. నిషధము, 3. వింధ్యము, 4. మాల్యవంతము, 5. మలయము, 6. గంధమాదనము, 7. హేమకూటము, 8. హిమాలయము.

**లోహములు**

మూడు లోహములు :



1. బంగారు, 2. వెండి, 3. రాగి.

అయిదు లోహములు :

1. బంగారము, 2. వెండి, 3. ఇత్తడి, 4. కంచు, 5. ఇనుము. 1. వజ్రలోహము, 2. కాంతలోహము, 3. పిండీలోహము, 4. క్రౌంచలోహము, 5. ముండీలోహము.

ఎనిమిది లోహములు :

(అ.) 1. బంగారము, 2. వెండి, 3. ఇత్తడి, 4. కంచు, 5. ఇనుము, 6. సత్తు, 7. తగరము, 8. ధీవరము.(ఆ.) 1. బంగారము, 2. వెండి, 3. రాగి, 4. సీసము, 5. కాంతలోహము, 6. వంగలోహము, 7. లౌహము, 8. తీక్ష్ణలోహము

**అగ్నులు**

త్రేతాగ్నులు:

ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము. ఇవి క్రమముగా వేదికి పూర్వ దక్షిణ పశ్చిమదిక్కులలో ఉంటాయి

పంచాగ్నులు:

పైమూటితో పాటు  సభ్యము, అపసథ్యము. సభ్యాపసథ్యములు ఈశాన్యదిక్కులో ఉంటాయి.

**యజ్ఞము**

అయిదు -యజ్ఞములు :

(అ.) (నిత్య యజ్ఞములు)

1. స్నానము, 2. దానము, 3. తపస్సు, 4. హెూమము, 5. పితృ యజ్ఞము.

(ఆ.) 1. జపము, 2. హెూమము, 3. బలి, 4. బ్రాహ్మణ శ్రేష్ఠుని పూజించుట, 5.పితృతర్పణము.

(ఇ.) 1. అగ్నిహెూత్రము, 2. దర్శపూర్ణ మానము, 3. చాతుర్మాస్యము, 4. పశుయాగము, 5. సోమయాగము.



**ఏడు–యజ్ఞములు :**

(అ.) 1. అగ్నిష్టోమము, 2. అశ్వమేధము, 3. బహుసువర్ణకము, 4. రాజసూయము, 5. గోమేధము, 6. వైష్ణవము, 7. మాహేశ్వరము.

(ఆ.) 1. బ్రహ్మయజ్ఞము, 2. ద్రవ్యయజ్ఞము, 3. శరీరయజ్ఞము, 4. వాగ్యజ్ఞము, 5. ప్రాణయజ్ఞము, 6. బుద్ధియజ్ఞము, 7. కర్మయజ్ఞము.

**పదునాలుగు –యజ్ఞములు :**

1.బ్రహ్మ యజ్ఞము, 2. ద్రవ్య యజ్ఞము, 3. దేవ యజ్ఞము, 4. జ్ఞానేంద్రియ యజ్ఞము, 5. విషయ యజ్ఞము, 6. స్వాధ్యాయజ్ఞాన యజ్ఞము, 7. ప్రాణ యజ్ఞము, 8. అపాన యజ్ఞము, 9. ప్రాణాపాన యజ్ఞము, 10. అంతరపాన యజ్ఞము, 11. యోగ యజ్ఞము, 12. తపో యజ్ఞము, 13. జప యజ్ఞము, 14. ఇంద్రియ ప్రాణకర్మయజ్ఞము.

**కర్మలు**

**రెండు రకాలయిన–కర్మలు**

1. అర్థకర్మ (దర్శపూర్ణ మాసాదికము), 2. గుణకర్మ (ఇడా భక్షణాదికము).

**మూడు రకాలయిన కర్మలు :**

1. యజ్ఞము, 2. వేదాధ్యయనము, 3. దానము.

**మూడు రకాలయిన అర్థకర్మలు**

1. నిత్యము (అగ్నిహెూత్రము మొ.), 2. నైమిత్తికము (దర్శపూర్ణ మాసము మొ), 3. కామ్యము (ఉద్భిద్యాగము మొ). మూడు రకాలయిన కామ్యకర్మలు 1. కేవలైహిక ఫలకము (కారీరీష్టి మొ), 2. కేవలాముష్మిక ఫలము (దర్శపూర్ణ మాసాదికము), 3. ఐహికాముష్మిక ఫలము. 1. సంచితము, 2. క్రియమాణము, 3. ప్రారబ్ధము. 1. విహితము, 2. నిషిద్ధము, 3. ఉదాసీనము. 1. మానసికము (ఇష్టదేవతాధ్యానము మొ), 2. వాచకము (మంత్రజపము మొ), 3. కాయికము (దేవతార్చన మొ).

**నాలుగు రకాలయిన కర్మలు :**

(అ.) (యతికర్మలు) 1. ధ్యానము, 2. శౌచము, 3. భిక్ష, 4. ఏకాంతమున నుండుట.



పంచ కర్మలు (అ.) 1. ఉత్క్షేపణము, 2. అవక్షేపణము, 3. ఆకుంచనము, 4. ప్రసారణము, 5. గమనము.

**ఆరు రకాలయిన కర్మలు :**

(అ.) 1. ధౌతి, 2. బస్తి, 3. నేతి, 4. త్రాటకము, 5. నౌలికము, 6. కపాలభాతి ఇవి యోగమునకు సంబంధించినవి.

(ఆ.) 1. అధ్యాపనము, 2. అధ్యయనము, 3. యజనము, 4. యాజనము, 5. దానము, 6. ప్రతిగ్రహము ఇవి (బ్రాహ్మణులు చేయవలసిన కర్మలు)

(ఇ.) 1. సంధ్యాస్నానము, 2. జపము, 3. హోమము, 4. దేవతాపూజ, 5. ఆతిథ్యము, 6. వైశ్వదేవము (ఇవి నిత్యకర్మలు).

**తొమ్మిది రకాలయిన కర్మలు :**

(అ.) 1. శమము, 2. దమము, 3. తపస్సు, 4. శౌచము, 5. క్షాంతి, 6. ఆర్జవము, 7. జ్ఞానము, 8. విజ్ఞానము, 9. ఆస్తిక్యము. (భగవద్గీత 18–42)

(ఆ.) (స్నానము) 1. సంధ్య, 2. జపము, 3. హోమము, 4. స్వాధ్యాయము, 5. దేవతార్చనము, 6. వైశ్వదేవము, 7. ఆతిథ్యము, 8. పితృతర్పణము ఇవి బ్రాహ్మణుల స్వాభావికకర్మలు

**పదహారు రకాలయిన కర్మలు :**

1.గర్భాధానము, 2. పుంసవనము, 3. సీమంతము, 4. జాతకర్మము, 5. నామకరణము, 6. అన్నప్రాశనము, 7. చౌలము, 8. ఉపనయనము, 9. ప్రాజాపత్యము, 10. సౌమ్యము, 11. ఆగ్నేయము, 12. వైశ్వదేవము, 13. గోదానము, 14. సమావర్తనము, 15. వివాహము, 16. అంత్యేష్టి.

**గతి**

గతి అనుపదానికి పోక, త్రోవ, ఉపాయము,శరణము, విధము, దశ, ఆధానము, చలనము, నడక, ప్రవేశము,స్వర్గప్రాప్తి, బ్రతుకుదెరువు, ఫలితము అను అర్థాలను సంస్కృత–తెలుగు నిఘంటువు (వావిళ్ల) ఇచ్చింది.



## చమకము ఆరవ అనువాకము

అగ్నిశ్చ మ ఇన్ద్రశ్చ మే సోమశ్చ మ ఇన్ద్రశ్చ మే
సవితా చ మ ఇన్ద్రశ్చ మే సరస్వతీ చ మ ఇన్ద్రశ్చ మే
పూషా చ మ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చ మ ఇన్ద్రశ్చ మే
మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే
త్వష్టా చ మ ఇన్ద్రశ్చ మే ధాతా చ మ ఇన్ద్రశ్చ మే
విష్ణుశ్చ మ ఇన్ద్రశ్చ మేఽశ్వినౌ చ మ ఇన్ద్రశ్చ మే
మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే విశ్వే చ మే దేవా ఇన్ద్రశ్చ మే
పృథివీ చ మ ఇన్ద్రశ్చ మేఽన్తరిక్షం చ మ ఇన్ద్రశ్చ మే
ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చ మే
మూర్ధా చ మ ఇన్ద్రశ్చ మే ప్రజాపతిశ్చ మ ఇన్ద్రశ్చ మే

ప్రతి పదార్థము

| | | |
|---|---|---|
| అగ్నిశ్చ మ | = | శివానుగ్రహముతో అగ్నిదేవుడు నాకు కలుగుగాక! (ఊర్ధ్వముగా, కుటిలముగా జ్వలించువాడు అగ్ని) |
| ఇన్ద్రశ్చ మే | = | అగ్నిదేవునితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక! (ఇంద్రతీతి ఇంద్రః. పరమైశ్వర్య యుక్తుడు ఇంద్రుడు) |
| సోమశ్చ మ | = | చంద్రుడు నాకు కలుగుగాక! (చందయతీతి చంద్రః. సంతోషింపచేయువాడు చంద్రుడు) |
| ఇన్ద్రశ్చ మే | = | చంద్రునితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| సవితా చ మ | = | సూర్యుడు నాకు కలుగుగాక ! (సుప్తుని ప్రేరేపించువాడు సవిత) |



| | | |
|---|---|---|
| ఇన్ద్రశ్చ మే | = | సూర్యునితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| సరస్వతీ చ మ | = | సరస్వతీ దేవి నాకు కలుగుగాక! (సరః ప్రసరణం సర్వత్ర అస్తీతి సరస్వతీ .అంతట వ్యాప్తి కలుగునది సరస్వతి.) |
| ఇన్ద్రశ్చ మే | = | సరస్వతీ దేవితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| పూషా చ మ | = | పూష అను దేవత నాకు కలుగుగాక! (పోషించువాడు పూషా. పుష్ణాతీతి పూషా) |
| ఇన్ద్రశ్చ మే | = | పూష అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| బృహస్పతిశ్చ మ | = | బృహస్పతి అను దేవత నాకు కలుగుగాక! (దేవతలకు, మంత్రములకు బృహత్తులు అని పేరు. వారలకు, వానికి ప్రభువు బృహస్పతి) |
| ఇన్ద్రశ్చ మే | = | బృహస్పతి అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| మిత్రశ్చ మ | = | మిత్రుడు అను దేవత నాకు కలుగుగాక! (అన్ని భూతములందు స్నేహ యుక్తుడు మిత్రుడు) |
| ఇన్ద్రశ్చ మే | = | మిత్రుడు అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| వరుణశ్చమ | = | వరుణుడు నాకు కలుగుగాక! (1.పాశములచేత శత్రువులను కట్టువాడుబీజనము 2.ఇతనిని వరము లడుగుచున్నది కనుక వరుణుడు) |
| ఇన్ద్రశ్చ మే | = | వరుణుడు అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |



| | | |
|---|---|---|
| త్వష్టా చమ | = | విశ్వకర్మ నాకు కలుగుగాక !(చెక్కబడినది త్వష్టము. ద్వాదశాదిత్యులలో ఒకడు.) |
| ఇన్ద్రశ్చ మే | = | విశ్వకర్మ అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| ధాతా చ మ | = | ధాత అను దేవత నాకు కలుగుగాక ! (అన్నింటిని ధరించువాడు ధాత) |
| ఇన్ద్రశ్చ మే | = | ధాత అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| విష్ణుశ్చమ | = | విష్ణువు నాకు కలుగుగాక ! (విశ్వమును వ్యాపించి ఉండువాడు విష్ణువు) |
| ఇన్ద్రశ్చ మే | = | విష్ణువు అను దేవతతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| అశ్వినౌ చమ | = | అశ్వి దేవతలు నాకు కలుగుగాక! (గుర్రములు కలవాడు అశ్వి. అశ్వినీపుత్రులగు దేవ వైద్యులు అశ్వులు) |
| ఇన్ద్రశ్చ మే | = | అశ్వి దేవతలతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక ! |
| మరుతశ్చమ | = | వాయువులు నాకు కలుగు గాక! (కుపితుడైన ఎవరిచేత లోకము మృతి పొందింపబడునో అతడు మరుత్. వాయువు) |
| ఇన్ద్రశ్చ మే | = | వాయువులతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| విశ్వే చ మే దేవాః | = | విశ్వదేవులు నాకు కలుగుగాక! (శ్రాద్ధకాలమునందు అర్చింప బడుదేవతలు విశ్వేదేవతలు. శ్రాద్ధాగ్రమునందు ప్రవేశించువారు) |



| | | |
|---|---|---|
| ఇన్ద్రశ్చ మే | = | విశ్వదేవులతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| ప ృథివీ చ మ | = | భూమి నాకు కలుగుగాక! (ప్రసిద్ధమగునది మరియూ పృథుచక్రవర్తి చేత లెస్సగా చేయబడునది భూమి) |
| ఇన్ద్రశ్చ మే | = | భూమితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక ! |
| అన్తరిక్షంచమ | = | ఆకాశము నాకు కలుగుగాక !(దీనిలోపల జగత్తు చూడబడును కనుక ఆకాశమునకు అంతరిక్షము అని పేరు) |
| ఇన్ద్రశ్చ మే | = | ఆకాశముతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| ద్యౌశ్చ మ | = | స్వర్గము నాకు కలుగుగాక !(స్వర్గమునందు క్రీడిస్తారు కనుక దానికి ద్యౌః అని పేరు) |
| ఇన్ద్రశ్చ మే | = | స్వర్గముతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక! |
| దిశశ్చ మ | = | నాలుగు దిక్కులు నాకు కలుగుగాక! (అవకాశము ఇస్తుంది కనుక దిశ అన్నారు) |
| ఇన్ద్రశ్చ మే | = | నాలుగు దిక్కులతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక ! |
| మూర్ధా చ మ | = | ఊర్ధ్వదిక్కు నాకు కలుగుగాక ! |
| ఇన్ద్రశ్చ మే | = | ఊర్ధ్వదిక్కుతో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |
| ప్రజాపతిశ్చ మ | = | ప్రజాపతి అను దేవత నాకు కలుగుగాక! (ప్రజలకు పతి ప్రజాపతి) |
| ఇన్ద్రశ్చ మే | = | ప్రజాపతితో కలిసిన ఇంద్రదేవుడు నాకు కలుగుగాక |



**తాత్పర్యము**

శివానుగ్రహముతో అగ్నిదేవుడు , చంద్రుడు , సూర్యుడు ,సరస్వతీ దేవి, పూష అను దేవత ,బృహస్పతి అను దేవత ,మిత్రుడు అను దేవత, వరుణుడు ,విశ్వకర్మ ,ధాత అను దేవత ,విష్ణువు అనుదేవత, అశ్వి దేవతలు, వాయువులు ,విశ్వదేవులు , భూమి ,ఆకాశము స్వర్గము ,నాలుగు దిక్కులు, ఊర్ధ్వదిక్కు ,ప్రజాపతి అనుదేవత ఇంద్రదేవునితో కలిసి నాకు కలుగుదురు గాక! నన్ను ఆశీర్వదించెదరుగాక

**విశేషాలు**

**ద్వాదశాదిత్యులు**

ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.

**విశ్వేదేవులు**

పది రకాలయినవిశ్వేదేవులు

1. క్రతువు, 2. దక్షుడు, 3. వసువు, 4. సత్యుడు, 5. కాలుడు, 6. కామ్యుడు, 7. శుచి, 8. రుచి, 9.పురూరవుడు, 10. ఆద్రవుడు.వసుబంధులు, క్రతుదక్షులు, కాలకాములు, ధురివిరోచనులు, పురూరవాద్రవులు

ఇరవై ఏడుగురయిన విశ్వేదేవులు

1.బల, 2. ధృతి, 3. విపాప్ముడు, 4. పుణ్యకృత్తు, 5. పావనుడు, 6. పార్ష్ణి క్షేముడు, 7. సమూహుడు, 8. దివ్యసానువు, 9. వివస్వంతుడు, 10. వీర్యవంతుడు, 11. హేమంతుడు, 12. కీర్తిమంతుడు, 13. కృతుడు, 14.చితాత్ముడు, 15. జితాత్ముడు, 16. మునివీర్యుడు, 17. దీప్తరోముడు, 18. అనుకర్ముడు, 19. ప్రతీపుడు, 20. ప్రదాత, 21. అంశుమంతుడు, 22. శైలాభుడు, 23. పరమక్రోధి, 24. ధీరోష్ణి, 25. భూపతి, 26. స్రజుడు, 27. వజ్రి.

**దిక్కులు**

ఎనిమిది దిక్కులు –

1. తూర్పు, 2. ఆగ్నేయము, 3. దక్షిణము, 4. నైరృతి, 5. పడమర, 6. వాయవ్యము, 7. ఉత్తరము, 8. ఐశాని.



**పది–దిక్కులు :**

తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైర్రుతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ ఇంద్రుడు, (వరుణుడు, కుబేరుడు, యముడు, శివుడు, నిరృతి, వాయువు, అగ్ని, బ్రహ్మ, శేషుడు–వీరు క్రమముగా దశదిశలకు అధిపతులు).

**ప్రజాపతి :**

బ్రహ్మకు ఇంకొక పేరు ప్రజాపతి . బ్రహ్మపుత్రుడైన మనువు కొడుకు ప్రజాపతి  అతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, రస, శ్వస, మనస్విని, శాండిలి, ప్రభాస అని ఏడుగురు భార్యలున్నారనివారికి అష్టవసువులు పుట్టారని భారతములో ఉంది.





## చమకము ఏడవ అనువాకము

**అ శుశ్చమే రశ్మిశ్చమే ఉదాభ్యాశ్చమే ఉధిపతిశ్చమే**
**ఉపాంశుశ్చమేంతర్యామశ్చమ ఐంద్ర వాయవశ్చమే మైత్రావరుణశ్చమ.**
**అశ్వినశ్చమే ప్రతిప్రస్థానశ్చమే శుక్రశ్చమే మంథీచమ.**
**ఆగ్రయణశ్చమే వైశ్వదేవశ్చమే ధ్రువశ్చమే. వైశ్వానరశ్చమ.**
**ఋతు గ్రహాశ్చమేఉతి గ్రాహ్యాశ్చమే ఐంద్రాగ్నశ్చమే వైశ్వ దేవశ్చమే.**
**మరుత్వతీయాశ్చమే మాహేంద్రశ్చమ ఆదిత్యశ్చమే సావిత్రశ్చమే.**
**సారస్వతశ్చమే పౌష్ణశ్చమే పాత్నీవతశ్చమే హారియోజనశ్చమే.**

**1. అ శుశ్చమే రశ్మిశ్చమే ఉదాభ్యాశ్చమే ఉధిపతిశ్చమే.**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| అశుశ్చ మే | = | సోమ గ్రహమును నాకు అనుగ్రహించుము. |
| రశ్మిశ్చ మే | = | రశ్మి గ్రహమును నాకు అను గ్రహించుము (అశ్నుత ఇతి రశ్మిః అశూ వ్యాప్తౌం. వ్యాపించునది కనుక కిరణమునకు రశ్మి అని పేరు) |
| అదాభ్యశ్చ మే | = | అదాభ్య గ్రహమును నాకు అనుగ్రహిం చుము |
| అధిపతిశ్చ మ | = | అధిపతి గ్రహమును నాకు అనుగ్రహిం చుము (అధిపాతీతి అధిపః- పా రక్షణే. ఆధిక్యమున రక్షించువాడు అధిపతి) |

**తాత్పర్యము**

ఓ శివా ! సోమ గ్రహము, రశ్మి గ్రహము, అదాభ్య గ్రహము, అధిపతి గ్రహము నాకు అనుగ్రహించుము.

**2. ఉపాంశుశ్చమేంతర్యామశ్చమ ఐంద్ర వాయవశ్చమే మైత్రావరుణశ్చమ.**



**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| ఉపాంశుశ్చమే | = | ఉపాంశువు నాకు అగు గాక. (ఉపాంశ వాక్యం జాతమస్మిన్నితి. మెల్లని మాటలు దీనియందు పుట్టును కనుక ఉపాంశవు) |
| అంతర్యామశ్చమ | = | అంతర్యామము నాకు అగు గాక. |
| ఐంద్ర వాయవశ్చమే | = | ఇంద్ర వాయువులకు చెందిన ఇంద్ర వాయవమును నాకు అగు గాక (ఇంద్ర వాయువులు దేవతలుగా గలది ఐంద్ర వాయవము. ఇంద్రవాయూ దేవతే అస్య) |
| మైత్రావరుణశ్చమ | = | మైత్రావరుణులకు చెందినవియును నాకు అగు గాక. (యజ్ఞకార్యక్రమము నిర్వర్తించు వాడు మైత్రావరుణి) |

**తాత్పర్యము**

శివుని దయతో ఉపాంశువును , అంతర్యామమును, ఇంద్ర వాయువులకు చెందిన ఇంద్ర వాయవమును, మైత్రావరుణులకు చెందినవియును నాకు అగు గాక.

3) **అశ్వినశ్చమే ప్రతిప్రస్థానశ్చమే శుక్రశ్చమే మంథీచమ.**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| అశ్వినశ్చమే | = | అశ్వినులు నాకు అగుగాక !(అశ్వమువంటి రూపము గలది అశ్విని) |
| ప్రతిప్రస్థానశ్చమే | = | ప్రతి ప్రస్థానమును నాకు అగు గాక. |
| శుక్రశ్చమే | = | శుక్రము నాకు అగుగాక !. (శుక్రమనగా తేజస్సు. అది గలవాడు కనుక అగ్ని శుక్రుడు) |
| మంథీచమ | = | మంథీ నాకు అగుగాక! (మంథి సూర్య పర్యాయ పదము) |



**తాత్పర్యము**

శివుని దయతో అశ్వినులును , ప్రతి ప్రస్థానమును , శుక్రము ,మంథీ యనునవి నాకు అగుగాక !

4) **ఆగ్రయణశ్చమే వైశ్వదేవశ్చమే ధ్రువశ్చమే. వైశ్వానరశ్చమ.**

| | | |
|---|---|---|
| ఆగ్రయణశ్చమే | = | ఆగ్రయణమును నాకు అనుగ్రహించుము. (సస్యములు పండి క్రొత్తగా వచ్చిన ధాన్యముతో చేయు ఒక యజ్ఞము ఆగ్రయణము. తొలిసారి వచ్చిన ఫలమును దేవతార్పణము చేయుట ఆగ్రయణము. అగ్రయణేష్టి చేసి కొత్త అన్నమును తినవలెనని ధర్మము) |
| వైశ్వదేవశ్చమే | = | వైశ్వ దేవమును నాకు అనుగ్రహించుము. (విశ్వదేవతలనుగూర్చి చేసెడు హెూమాదికము వైశ్వదేవము. భోజనార్థము , జీవహింసాప్రయుక్త పాపనివృత్తి కొరకు , బ్రాహ్మణులు నిత్యము చేయవలసిన కర్మ వైశ్వదేవము.) |
| ధ్రువశ్చమే | = | ధ్రువగ్రహమును నాకు అనుగ్రహించుము. |
| వైశ్వానరశ్చమ | = | వైశ్వానరమును నాకు అనుగ్రహించుము. (వైశ్వానరము= అగ్ని) |

**తాత్పర్యము**

ఓ శివా !ఆగ్రయణము, వైశ్వ దేవము, ధ్రువగ్రహము, వైశ్వానరమును నాకు అనుగ్రహించుము.

5) **ఋతు గ్రహాశ్చమేఽ తి గ్రాహ్యాశ్చమే ఐంద్రాగ్నశ్చమే వైశ్వ దేవశ్చమే.**

**ప్రతిపదార్థము**



ఋతు గ్రహాశ్చమే = ఆరు ఋతువులు, నవ గ్రహములు నాకు అనుగ్రహించుము. (ఇయర్తీతి ఋతుః. గతించునది ఋతువు. ఇవి ఆరు 1. వసంతము, 2. గ్రీష్మము, 3. వర్షము, 4. శరత్తు, 5. హేమంతము, 6. శిశిరము. పట్టును గనుకను, పట్టుటగనుకను, పట్టబడును కనుకను గ్రహము. నవ-గ్రహములు 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. అంగారకుడు, 4. బుధుడు, 5. బృహస్పతి, 6. శుక్రుడు, 7. శనైశ్చరుడు, 8. రాహువు, 9. కేతువు. )

అతి గ్రాహ్యాశ్చమే = మిక్కిలి గ్రహింప దగిన ఇతర గ్రహము నాకు అనుగ్రహించుము.

ఐంద్రాగ్నశ్చమే = ఇంద్రాగ్నుల కలయిక నాకు అనుగ్రహించుము (పరమైశ్వర్య యుక్తుడు ఇంద్రుడు. ఊర్ధ్వముగా నైనను, కుటి లముగానైనను జ్వలించువాడు అగ్ని.)

వైశ్వ దేవశ్చమే = వైశ్వ దేవము నాకు అనుగ్రహించుము.

**తాత్పర్యము**

ఓ శివా ! ఆరు ఋతువులు, నవ గ్రహములు మిక్కిలి గ్రహింప దగిన ఇతర గ్రహము, ఇంద్రాగ్నుల కలయిక వైశ్వ దేవము నాకు అనుగ్రహించుము.

6) **మరుత్వతీయాశ్చమే మాహేంద్రశ్చమ ఆదిత్యశ్చమే సావిత్రశ్చమే.**

మరుత్వతీయాశ్చమే = మరుత్వతీయములును నాకు అనుగ్రహించుము (మరుత్వత్= ఇంద్రుడు)

మాహేంద్రశ్చమ = మహేంద్రము నాకు అనుగ్రహించుము (మహేంద్రునికి సంబంధించినది మాహేంద్రము)



| | | |
|---|---|---|
| ఆదిత్యశ్చమే | = | ఆదిత్యము నాకు అనుగ్రహించుము (అదితి కొడుకు కనుక సూర్యునికి ఆదిత్యుడు అనిపేరు) |
| సావిత్రశ్చమే | = | సావిత్రము నాకు అనుగ్రహించుము (సూర్య సంబంధమైనది సావిత్రము) |

**తాత్పర్యము**

ఓ శివా ! మరుత్వతీయములు, మహేంద్రము , ఆదిత్యము , సావిత్రము నాకు అనుగ్రహించుము

7) **సారస్వతశ్చమే పౌష్ణశ్చమే పాత్నీవతశ్చమే హారియోజనశ్చమే.**

| | | |
|---|---|---|
| సారస్వతశ్చమే | = | సారస్వతము నాకు అనుగ్రహించుము (సరస్వతీ సంబంధమైనది సారస్వతము) |
| పౌష్ణశ్చమే | = | పౌష్ణమును నాకు అనుగ్రహించుము (పౌష్ణము=1.రేవతి – కడపటి నక్షత్రము. 2. మీనరాశి – చివరి రాశి) |
| పాత్నీవతశ్చమే | = | పాత్నీవతము అను గ్రహమును నాకు అనుగ్రహించుము. |
| హారియోజనశ్చమే | = | హారియోజనమను గ్రహమును నాకు అనుగ్రహించుము. |

**తాత్పర్యము**

సారస్వతము ,పౌష్ణములను నాకు అనుగ్రహించుము.,పాత్నీవతము , హారియోజనమను గ్రహములను నాకు అనుగ్రహించుము.

**విశేషాలు**

అంశు, అధాభ్య అని ఇందులో ఉపయోగించిన పదాలు సోమ యాగములో ఉపయోగించే పాత్రలు. (యజమాని “అదాభ్య’ పాత్రను గ్రహించి సోమము కొరకు హెూమము చేయవలెను– కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత) వీటిని గ్రహాలు అనుపేరుతో ఈ చమక మంత్రాలలో



పిలిచారు. రశ్మి అనునది అదాభ్య గ్రహ సూచకమయిననూ విడిగా చెప్పబడినది. అధిపతి పదము దధి గ్రహాన్ని సూచిస్తుంది. సారస్వత, పౌష్ణ పదాలు వికృతి యాగములో ఉపయుక్తాలు.

ఈ అనువాకములో రెండు వైశ్వదేవ పదాలున్నాయి. మొదటిది ప్రాతస్సవనమును, రెండవది తృతీయసవనమును సూచిస్తుంది. ఈ అన్ని గ్రహాలు నన్ను అనుగ్రహించేటట్లు చూడాలని శివయ్యకు ప్రార్థన.





## చమకము ఎనిమిదవ అనువాకము

**ఇధ్మశ్చ మే బర్హిశ్చ మే వేదిశ్చ మే ధిష్ణియాశ్చ మే**
**స్రుచశ్చ మే చమసాశ్చ మే గ్రావాణశ్చ మే స్వరవశ్చ మ**
**ఉపరవాశ్చ మే అధిషవణే చ మే ద్రోణకలశశ్చ మే**
**వాయవ్యాని చ మే పూతభృచ్చ మే ఆధవనీయశ్చ మ**
**ఆగ్నీధ్రం చ మే హవిర్ధానం చ మే గృహాశ్చ మే సదశ్చ మే**
**పురోడాశాశ్చ మే పచతాశ్చ మేఽవభృథశ్చ మే**
**స్వగాకారశ్చ మే 8**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| ఇధ్మశ్చ మే | = | సమిధను నాకు అనుగ్రహించుము. (ఇంధే అగ్ని రనేన ఇంధనం. ఇధ్మశ్చ. దేనిచేత అగ్ని ప్రకాశించునో అది ఇధ్మము.సమిధ) |
| బర్హిశ్చ మే | = | అగ్నిని అనుగ్రహించుము(ఆజ్యాదులచేత వద్ధి పొందువాడు బర్హి.) |
| వేదిశ్చ మే | = | యాగముకొరకు చతురస్రముగా అలంకరింపబడిన భూమి అనుగ్రహించుము (పూజాదికం విన్దతీతి వేదిః.) |
| ధిష్ణియాశ్చ మే | = | అగ్నిస్థానీయమైన ధిష్ణియమును నాకు ఒసగుము. |
| స్రుచశ్చ మే | = | స్రుచము అను యజ్ఞపాత్రను అనుగ్రహించుము..(దేనివలన ఆజ్యము స్రవించునో అది స్రుచము) |
| చమసాశ్చ మే | = | చమసము అను యజ్ఞపాత్రను అనుగ్రహించుము |
| గ్రావాణశ్చ మే | = | గ్రావాణములను నాకు ఒసంగుడు |
| స్వరవశ్చ మ | = | ఒక విధమగు యజ్ఞాంగములను నాకు ఒసంగుడు. |



| | | |
|---|---|---|
| ఉపరవాశ్చ మే | = | ఉపరవములును నాకు అగు గాక. (యజ్ఞములో తూర్పున పారంభించి దక్షిణ శకటము క్రింద నాలుగు దిశలందు నాలుగు 'ఉపరవము'లను గుంతలు త్రవ్వుదురు) |
| అధిషవణే చ మే | = | అధిషవణములును నాకు అగు గాక. (అధిషవణము=సోమరసము తీసెడు చర్మమయపాత్ర) |
| ద్రోణకలశశ్చ మే | = | ద్రోణ కలశము అను పాత్ర నాకు అగు గాక. (సర్వద్రష్ట, పాపహారి సోమము అందరిని భరిస్తూ దశా పవిత్రమునకు చేరుతుంది.. అందులోనుంచి అరుస్తూ ద్రోణ కలశములో చేరుతుంది. ద్రోణకలశమా! నువ్వు పృథివీ రూపానివి. నిన్ను అగ్నితో కూరుస్తున్నాను. సామవేదము–ఆరవ అనువాకము) |
| వాయవ్యాని చ మే | = | వాయవ్యములు నాకు అగు గాక. (వాయవ్యము =ఉత్తర పశ్చిమ దిక్కుల నడిమి మూల వాయు సంబంధమైనది. |
| పూతభృచ్చ మే | = | పూత భృత్తు నాకు అనుగ్రహించుము. (పూతభృత్ పాత్రమా! నీవు స్వర్గరూపానివి. నిన్ను సూర్యునితో కూర్చుచున్నాను. సామవేదము–ఆరవ అనువాకము) |
| ఆధవనీయశ్చ మ | = | అధవనీయమును నాకు అనుగ్రహించుము. (ఆధవనీయపాత్రమా! నీవు వాయురూపానివి. నిన్ను అంతరిక్షముతో కూరుస్తున్నాను. సామవేదము–ఆరవ అనువాకము) |



| | | |
|---|---|---|
| ఆగ్నీధ్రం చ మే | = | అగ్నీధ్రమును నాకు అనుగ్రహించుము (అగ్నీధ్రము=హోమము. అగ్ని కృత్యము. ఇష్టకే త్వం తద్రూపా అసి. అగ్నీధ్రము నందలి సోమము అగ్ని అగుచున్నాడు. ఇష్టకే త్వంతద్రూపాసి. అగ్నీధ్రము నుంచి హవిర్ధానానికి చేరిన సోమము బృహస్పతి అగుచున్నాడు. కృష్ణ యజుర్వేదము తొమ్మిదవ అనువాకము) |
| హవిర్ధానం చ మే | = | హవిర్ధానాన్ని నాకు అనుగ్రహించుము (హవిస్సులు ఉంచు శకటము హవిర్ధానము. కృష్ణ యజుర్వేదము పదమూడవ అనువాకము) |
| గృహాశ్చ మే | = | పత్నీశాలౌదులను నాకు అనుగ్రహిం చుము |
| సదశ్చ మే | = | సదస్సులను నాకు అనుగ్రహించుము |
| పురోడాశాశ్చ మే | = | పురోడాశములను నాకుఅనుగ్రహించుము |
| పురోడాశము | = | యజ్ఞార్థమైన అపూపము. (సోమలత రసము) |
| పచతాశ్చ మే | = | శామిత్రము అను యజ్ఞపాత్రము నాకు అనుగ్రహించుము |
| అవభృథశ్చ మే | = | అవభృథమును నాకు – అనుగ్రహిం చుము. (అవభృథము=యజ్ఞాంత స్నానము) |
| స్వగాకారశ్చ మే | = | యజ్ఞ ఫలమును స్వంతము చేయు శంయువాకమును నాకు అనుగ్రహిం చుము (అధ్వర్యుడు యజ్ఞ ఫలమును దేవతలకు స్వగాకరోతి అనగా స్వంతము |



చేయుచున్నాడు. కృష్ణ యజుర్వేదము పదవ అనువాకము 02వ మంత్రము)

**తాత్పర్యము**

సమిధ, అగ్ని, యాగముకొరకు చతురస్రముగా అలంకరింపబడిన భూమి, అగ్నిస్థానీయమైన ధిష్ణియము, స్రుచము అను యజ్ఞపాత్ర, చమసము అను యజ్ఞపాత్రను నాకు అనుగ్రహించుము. గ్రావాణములు, యజ్ఞాంగములు, ఉపరవములు సోమరసము తీసెడు చర్మమయపాత్ర, ద్రోణ కలశము అను పాత్ర వాయవ్యములు, పూత భృత్తు నాకు అనుగ్రహించుము. అధవనీయము, అగ్నీధ్రము, హవిస్సులు ఉంచు శకటము, పత్నీశాలౌదులను నాకు అనుగ్రహించుము.

సదస్సులను, పురోడాశములను, శామిత్రము అను యజ్ఞపాత్రము నాకు అనుగ్రహించుము. యజ్ఞాంత స్నానము, యజ్ఞఫలమును స్వంతము చేయు శంయువాకమును నాకు అనుగ్రహించుము





# చమకము తొమ్మిదవ అనువాకము

**అగ్నిశ్చ మే ధర్మశ్చ మేఽర్కశ్చ మే సూర్యశ్చ మే**
**ప్రాణశ్చ మేఽశ్వమేధశ్చ మే పృథివీ చ మేఽదితిశ్చ మే**
**దితిశ్చ మే ద్యౌశ్చ మే  శక్వరీరంగులయో దిశశ్చ మే**
**యజ్ఞేన కల్పన్తామృక్చ మే సామ చ మే స్తోమశ్చ మే**
**యజుశ్చ మే దీక్షా చ మే తపశ్చ మ ఋతుశ్చ మే వ్రతం చ మే**
**ఽహోరాత్రయోర్వృష్ట్యా బృహద్రథన్తరే చ మే యజ్ఞేన కల్పేతాం**

**ప్రతి పదార్థము**

| | | |
|---|---|---|
| అగ్నిశ్చ మే | = | చయమానమైన అగ్నియును నాకు అగును గాక. (యజ్ఞ కుండానికి ఇటుకలు పేర్చడాన్ని చయనం అంటారు ఒక్కొక యజ్ఞానికి ఒక్కొక విధమైన యజ్ఞ కుండం అవసరమవుతుంది. అలాగే ఒక్కొక వేద శాఖవారికి ఒక్కొక పద్ధతి ఉంటుంది.) |
| ధర్మశ్చ మే | = | ప్రవర్గ్యమును నాకు అగును గాక. (ప్రవర్గ్యము = అగ్నిష్టోమాదియాగములకు అంగభూతమైన యాగవిశేషము.) |
| అర్కశ్చ మే | = | అర్కయాగము నాకు అగును గాక. |
| సూర్యశ్చ మే | = | “సౌర్యం చ రుమ్” అని విహితమయిన సూర్యయాగమును నాకు అగును గాక. |
| ప్రాణశ్చ మే | = | ప్రాణాయ స్వాహా అను విహితమయిన హోమమును నాకు ఇమ్ము. |
| అశ్వమేధశ్చ మే | = | అశ్వము పశువుగా గల అశ్వమేధ యాగమును నాకు ఇమ్ము. |



| | | |
|---|---|---|
| పృథివీ చ మే | = | భూమినాకు ఇమ్ము |
| అ దితిశ్చ మే | = | అదితి అను దేవతా విశేషమును నాకు ఇమ్ము. |
| దితిశ్చ మే | = | దితి అను దేవతా విశేషమును నాకు ఇమ్ము |
| ద్యౌశ్చ మే | = | ద్యౌః అను దేవతా విశేషమును నాకు ఇమ్ము |
| శక్వరీ | = | శక్వరీ అను చందో విశేషములను నాకు ఇమ్ము |

(కృష్ణ యజుర్వేదములో రెండవ అనువాకము 08వ మంత్రములో ఇలా ఉన్నది. సత్య కామ పుత్రుడు కేశి. అతడు దర్భపుత్రుడగు కేశితో అన్నాడు: దర్భకుమారా! రేపు నీవు యజ్ఞము చేయనున్నావు.

అందు నీవు సప్తపద శక్వరీ ఛందస్సును ఉపయోగింతువు. శక్వరి వలన యజమాని పుట్టిఉన్న తన శత్రువును తిరస్కరించును. అది పుట్టనున్న శత్రువును కూడ నిరోధించును. శక్వరి శక్తి వలన యజమాని ఉభయలోకము లందు జ్యోతిని పొందును. శక్వరి శక్తి వలన ఎద్దుయొక్క ముందు భాగమును – బరువులు మోయుట, నాగలిలాగుటలు – కలుగును. అట్లే ఆవు యొక్క అధోభాగము – పాలు మున్నగునవి – కలుగును. ఇది తెలిసిన వానికి రెండును కలుగును.)

అంగులయోదిశశ్చమే= అంగుళి వలె నుండు విరాట్పురుషుని వేళ్ల వంటివైన దిక్కులు, (1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము,) విదిక్కులు(రెండు దిక్కుల నడుమ మూలలను విదిక్కులంటారు. 1. ఐశాని, 2. నైరృతి, 3. వాయవ్యము, 4. ఆగ్నేయము,) అవన్నియును నా యొక్క యజ్ఞమునందు సమర్థములు అగు గాక.

| | | |
|---|---|---|
| ఋక్చ మే | = | పద్య రూప స్తోత్రములతో నిండిన ఋగ్వేదమును నాకు ఇమ్ము |
| సామ చ మే | = | గానముతో కలిసిన మంత్రములు గల సామ వేదమును నాకు ఇమ్ము |



| | | |
|---|---|---|
| స్తోమశ్చ మే | = | సామావృత్తి రూప స్తోత్రమును నాకు ఇమ్ము |
| యజుశ్చ మే | = | వచన రూప మంత్రమును గల యజుర్వేదమును నాకు ఇమ్ము |
| దీక్షా చ మే | = | యజమానుని సంస్కార రూపమయిన దీక్ష నాకు అగు గాక. |
| తపశ్చ మ | = | పాపము నశింపచేయు తపస్సును నాకు అగు గాక. |
| ఋతుశ్చ మే | = | యాగాంగ భూతమయిన కాలము నాకు అగు గాక. |
| వ్రతం చ మే | = | వ్రతము నాకు అగుగాక ! |
| | | అహోరాత్రయో |
| వృష్ట్యా | = | పగలు రాత్రి కురియునట్టి వర్షముచే నాపైరు సస్యశ్యామలమగుగాక! |
| బృహద్రథన్తరే చ మే | = | బృహత్తు రథంతరము అను సామములును నాకు అగుగాక. (దేవతలు రథంతర సామమున ఓషధులను బృహత్సామమున వ్యచను పితికినారు. అధర్వవేదము మూడవ సూక్తము ఏడవ మంత్రము) |
| యజ్ఞేన కల్పేతాం | = | నా యజ్ఞముచే తమతమ వ్యవహారము లందు సమర్థములుఅగు గాక. |

**తాత్పర్యము**

చయమానమైన అగ్నియును నాకు అగును గాక. ప్రవర్గ్యమును నాకు అగును గాక. అర్కయాగము నాకు అగును గాక.

“సౌర్యం చ రుమ్” అని విహితమయిన సూర్య యాగమును నాకు అగును గాక. ప్రాణాయ స్వాహా అను విహితమయిన హోమమును నాకు ఇమ్ము. అశ్వము పశువుగా గల అశ్వమేధ యాగమును నాకు ఇమ్ము.



భూమినాకు ఇమ్ము.అదితి అను దేవతా విశేషమును నాకు ఇమ్ము. దితి అను దేవతా విశేషమును నాకు ఇమ్ము.ద్యౌః అను దేవతా విశేషమును నాకు ఇమ్ము.శక్వరీ అను ఛందో విశేషములను నాకు ఇమ్ము అంగుళి వలె నుండు విరాట్పురుషుని వేళ్ల వంటివైన దిక్కులు, నా యొక్క యజ్ఞము నందు

సమర్థములు అగు గాక. పద్య రూప స్తోత్రములతో నిండిన ఋగ్వేదమును నాకు ఇమ్ము.

గానముతో కలిసిన మంత్రములు గల సామ వేదమును నాకు ఇమ్ము.సామా వృత్తి రూప స్తోత్రమును నాకు ఇమ్ము.వచన రూప మంత్రమును గల యజుర్వేదమును నాకు ఇమ్ము.

యజమానుని సంస్కార రూపమయిన దీక్ష నాకు అగు గాక. పాపము నశింపచేయు తపస్సును నాకు అగు గాక.యాగాంగ భూతమయిన కాలము నాకు అగు గాక. వ్రతము నాకు అగుగాక !పగలు రాత్రి కురియునట్టి వర్షముచే నాపైరు సస్య శ్యామలమగుగాక !

బృహత్తు రథంతరము అను సామములును నాకు అగు గాక. నా యజ్ఞముచే తమతమ వ్యవహారములందు సమర్థములు అగు గాక.





# చమకము పదవ అనువాకము

**గర్భాశ్చ మే వత్సాశ్చ మే త్రవిశ్చ మే త్రవీ చ మే**
**దిత్యవాట్ చ మే దిత్యౌహీ చ మే పంచావిశ్చ మే**
**పంచావీ చ మే త్రివత్సశ్చ మే త్రివత్సా చ మే**
**తుర్యవాట్ చ మే తుర్యౌహీ చ మే పష్ఠవాట్ చ మే పష్ఠౌహీ చ మ**
**ఉక్షా చ మే వశా చ మ ఋషభశ్చ మే వేహశ్చ మే**
**ఉ నడ్వాంచ మే ధేనుశ్చ మ ఆయుర్యజ్ఞేన కల్పతాం**
**ప్రాణో యజ్ఞేన కల్పతామపానో యజ్ఞేన కల్పతాం**
**వ్యానో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన కల్పతాం**
**శ్రోత్రం యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన కల్పతాం**
**వాగ్యజ్ఞేన కల్పతామాత్మా యజ్ఞేన కల్పతాం**
**యజ్ఞో యజ్ఞేన కల్పతాం**

**ప్రతిపదార్థము**

| | | |
|---|---|---|
| గర్భాశ్చ మే | = | తల్లి కడుపులో నున్న ప్రాణులను నాకు ఇమ్ము. |
| వత్సాశ్చ మే | = | పుట్టిన దూడలను నాకు ఇమ్ము. |
| త్రవిశ్చ మే | = | ఒకటిన్నర సంవత్సరముల వయసు గల మగదూడలను నాకు ఇమ్ము. |
| త్రవీ చ మే | = | అదే వయసు గల ఆడ దూడలను నాకు ఇమ్ము. |
| దిత్యవాట్ చ మే | = | రెండు సంవత్సరముల వయసు గల కోడె దూడను నాకు ఇమ్ము. |
| దిత్యౌహీ చ మే | = | రెండు సంవత్సరముల వయసు గల పెయ్యను నాకు ఇమ్ము |
| పంచావిశ్చ మే | = | రెండున్నర సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము |



| | | |
|---|---|---|
| త్రివత్సశ్చ మే | = | మూడు సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము |
| త్రివత్సా చ మే | = | మూడు సంవత్సరముల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము |
| తుర్యవాట్ చ మే | = | మూడున్నర సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము |
| తుర్యౌహీ చ మే | = | మూడు న్నరసంవత్సరముల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము |
| పష్ఠవాట్ చ మే | = | నాలుగేండ్ల వయసు కల కోడెను నాకు ఇమ్ము |
| పష్ఠౌహీ చ మ | = | నాలుగేండ్ల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము |
| ఉక్షా చ మే | = | వీర్య దాయిని అయిన ఎద్దును నాకు ఇమ్ము |
| వశా చ మ | = | గొడ్డుటావును (ఎప్పటికీ చూలు వుండని ఆవు)నాకు ఇమ్ము |
| ఋషభశ్చ మే | = | ఉక్షము కంటె వయస్సు ఎక్కువగా కలిగిన ఎద్దును నాకు ఇమ్ము |
| వేహశ్చ మే | = | గర్భభ్రంశము పొందిన ఆవును నాకు ఇమ్ము. |
| అనడ్వాంచ మే | = | బండి లాగు ఎద్దును నాకు ఇమ్ము. |
| ధేనుశ్చ మ | = | కొత్తగా ఈనిన ఆవును నాకు ఇమ్ము. |
| ఆయుర్యజ్ఞేన కల్పతాం | = | ఆయుస్సు యజ్ఞము చేత సమర్థమగుగాక (వచ్చుగాక !) |
| ప్రాణో యజ్ఞేన కల్పతామ్ | = | ప్రాణము యజ్ఞము చేత సమర్థమగుగాక |



| | | |
|---|---|---|
| అపానో యజ్ఞేన కల్పతాం | = | అపానము యజ్ఞము చేత సమర్థమగుగాక |
| వ్యానో యజ్ఞేన కల్పతాం | = | వ్యానము యజ్ఞము చేత సమర్థమగుగాక! |
| చక్షుర్యజ్ఞేన కల్పతామ్ | = | కన్ను యజ్ఞము చేత సమర్థమగుగాక ! |
| శ్రోత్రం యజ్ఞేన కల్పతాం | = | చెవి యజ్ఞము చేత సమర్థమగుగాక ! |
| మనో యజ్ఞేన కల్పతాం | = | మనస్సు యజ్ఞము చేత సమర్థమగుగాక! |
| వాగ్యజ్ఞేన కల్పతామ్ | = | వాక్కు యజ్ఞము చేత సమర్థమగుగాక ! |
| ఆత్మా యజ్ఞేన కల్పతాం | = | శరీరము యజ్ఞము చేత సమర్థమగుగాక! |
| యజ్ఞో యజ్ఞేన కల్పతాం | = | చేయబోయే అశ్వ మేధ యాగము ఇప్పుడు చేసే యాగము చేత సమర్థమగుగాక ! |

**తాత్పర్యము**

తల్లి కడుపులో నున్న ప్రాణులను నాకు ఇమ్ము. పుట్టిన దూడలను నాకు ఇమ్ము. ఒకటిన్నర సంవత్సరముల వయసు గల మగ దూడలను నాకు ఇమ్ము. అదే వయసు గల ఆడ దూడలను నాకు ఇమ్ము. రెండు సంవత్సరముల వయసు గల కోడె దూడను నాకు ఇమ్ము. రెండు సంవత్సరముల వయసు గల పెయ్యను నాకు ఇమ్ము. రెండున్నర సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము

మూడు సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము. మూడు సంవత్సరముల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము. మూడున్నర సంవత్సరముల వయసు కల కోడెను నాకు ఇమ్ము. మూడు న్నరసంవత్సరముల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము. నాలుగేండ్ల వయసు కల కోడెను నాకు ఇమ్ము. నాలుగేండ్ల వయసు కల పెయ్యను నాకు ఇమ్ము. వీర్యదాయిని అయిన ఎద్దును నాకు ఇమ్ము. గొడ్డుటావును (ఎప్పటికీ చూలు వుండని ఆవు)నాకు ఇమ్ము.



ఉక్షము కంటె వయస్సు ఎక్కువగా కలిగిన ఎద్దును నాకు ఇమ్ము.

గర్భభ్రంశము పొందిన ఆవును నాకు ఇమ్ము.బండి లాగు ఎద్దును నాకు ఇమ్ము.కొత్తగా ఈనిన ఆవును నాకు ఇమ్ము.

నా ఆయుస్సు యజ్ఞము చేత సమర్ధమగుగాక !( వచ్చుగాక !)ప్రాణము యజ్ఞము చేత సమర్ధమగుగాక !అపానము యజ్ఞము చేత సమర్ధమగుగాక! వ్యానము యజ్ఞము చేత సమర్ధమగుగాక !కన్ను యజ్ఞము చేత సమర్ధమగుగాక !చెవి యజ్ఞము చేత సమర్ధమగుగాక ! మనస్సు యజ్ఞము చేత సమర్ధమగుగాక !వాక్కు యజ్ఞము చేత సమర్ధమగుగాక !శరీరము యజ్ఞము చేత సమర్ధమగుగాక !చేయబోయే అశ్వ మేధ యాగము ఇప్పుడు చేసే యాగము చేత సమర్ధమగుగాక !







## చమకము పద కొండవ అనువాకము

**ఏకా చ మే తిస్రశ్చ మే పంచ చ మే సప్త చ మే**
**నవ చ మ ఏకదశ చ మే త్రయోదశ చ మే పంచదశ చ మే**
**సప్తదశ చ మే నవదశ చ మ ఏక విశతిశ్చ మే**
**త్రయోవిశతిశ్చ మే పంచవిశతిశ్చ మే**
**సప్తవిశతిశ్చ మే నవవిశతిశ్చ మ**
**ఏకత్రిశచ్చ మే త్రయస్త్రిశచ్చ మే**
**చతస్రశ్చ మే உ ష్టౌ చ మే ద్వాదశ చ మే షోడశ చ మే**
**విశతిశ్చ మే చతుర్విశతిశ్చ మేஉ ష్టావిశతిశ్చ మే**
**ద్వాత్రిశచ్చ మే షట్త్రిశచ్చ మే చత్వారిశచ్చ మే**
**చతుశ్చత్వారిశచ్చ మేஉ ష్టాచత్వారిశచ్చ మే**
**వాజశ్చ ప్రసవశ్చాపిజశ్చ క్రతుశ్చ సువశ్చ మూర్ధా చ**
**వ్యశ్నియశ్చాన్త్యాయనశ్చాన్త్యశ్చ భౌవనశ్చ భువనశ్చాధిపతిశ్చ**

**ప్రతి పదార్థము**

| | | |
|---|---|---|
| ఏకా చ మే | = | ఒకటి సంఖ్యకు ప్రతీకయగు ప్రకృతి నా పట్ల ప్రసన్నమగు గాక. |
| తిస్రశ్చ మే | = | మూడుకు ప్రతీకయైన ఇచ్ఛాక్రియా జ్ఞానశక్తులు (సరస్వతి, లక్ష్మి, పార్వతి) నాయందు ప్రసన్నమగు గాక. |
| పంచ చ మే | = | ఐదుకు ప్రతీకలైన పంచ భూతములు (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము) నాయందు ప్రసన్నమగు గాక. |
| సప్త చ మే | = | జ్ఞానేంద్రియములు, (1. శ్రోత్రము, 2. చర్మము, 3. చక్షుస్సు, 4. జిహ్వా, 5. నాసిక). మనస్సు బుద్ధి యను ఏడు నాయందు ప్రసన్నమగును గాక. |



| | | |
|---|---|---|
| నవ చమ | = | నవ దుర్గలు (1. శైలపుత్రి, 2. బ్రహ్మచారిణి, 3. చంద్రఘంట, 4. కూష్మాండి, 5.స్కందమాత, 6. కాత్యాయని, 7. కాళరాత్రి, 8.మహాగౌరి, 9. సిద్ధిరాత్రి ఇవి దేవి అవతారములు) నాయందు ప్రసన్నమగు గాక. |
| ఏకాదశ చ మే | = | నవద్వారములు (కన్నులు (2), చెవులు(2), నాసారంధ్రములు (2), 7. నోరు, 8. మూత్రద్వారము, 9. మల ద్వారము) కపాల బిలము మరియు నాభి బిలము అను పదకొండును నాయందు ప్రసన్నమగు గాక. |
| త్రయోదశ చ మే | = | పది దిక్కులును త్రిమూర్తులును నాయందు ప్రసన్నమగు గాక. |
| పంచదశ చ మే | = | శ్రోత్రాది పదునాలుగు నాడులు, సుషుమ్నానాడి నాయందు ప్రసన్నమగు గాక. |
| సప్తదశ చ మే | = | దశేంద్రియములును (వాక్కు, పాణి, పాదం, పాయువు (మల ద్వారం), ఉపస్థం అనేవి కర్మేంద్రియాలు. త్వక్కు (చర్మం), చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణం అనేవి జ్ఞానేంద్రియాలు) వాటికి తోడుగా ఉన్న సప్త ధాతువులును (1. రసము, 2. రక్తము, 3. మాంసము, 4. మేదస్సు, 5. అస్థి, 6. మజ్జ, 7. శక్రము) నాయందు ప్రసన్నమగు గాక. |



| | | |
|---|---|---|
| నవదశ చ మ | = | నవదశ ఓషధులును (1.బ్రహ్మసువర్చల 2. ఆదిత్యపర్ణి, 3. అశ్వబల, మొ.) నాయందు ప్రసన్నమగు గాక. |
| ఏకవిశతిశ్చ మే | = | మనో జ్ఞాన కర్మేంద్రియములు (11) పంచ తన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. 5) పంచ భూతములు (5) అను 21 జీవ తత్త్వములకు చెందినవి నాకు అనుకూలముగానుండు గాక. |
| త్రయోవిశతిశ్చ మే | = | జ్వరము మొదలుగా గల 23 రోగములు (1. స్వాభావికములు, 2. ఆగంతుకములు, 3. కాయికములు, 4. అంతరములు.మొ.) నాయందు ప్రసన్నమగుగాక. |
| పంచవిశతిశ్చ మే | = | అప్సరాదులు 25 మంది(1. రంభ, 2. ఘృతాచి, 3. మేనక, 4.తిలోత్తమ, 5. మంజుఘోష, 6. ఊర్వశి, 7. సుకేశిమొ.) నా యందు ప్రసన్నమగుదురు గాక. |
| సప్తవిశతిశ్చ మే | = | చిత్రసేనాది 27 మంది గంధర్వులు (1. విరాధుడు, 2. తుంబురుడు, 3. దనువు, 4. చిత్రరథుడు, 5. ధృతరాష్ట్రుడు, 6. కిశోరుడు, 7. హూహూ, 8. హాహా, 9. విద్యాధరుడు, 10. ఉగ్రసేనుడు, 11. విశ్వావసువు, 12. పరావసుపు, 13. చిత్రసేనుడు, 14. గోపాలుడు, 15. బలుడుమొ.) నాయందు ప్రసన్నమగుదురు గాక. |
| నవవిశతిశ్చ మ | = | కృత్యాది విద్యుద్దేవతలు 29 మంది నాయందు ప్రసన్నమగుదురు గాక. |



| | | |
|---|---|---|
| ఏకత్రిశచ్చ మే | = | ఊర్ధ్వ లోకములు (భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహ ర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. 7)అధో లోకములు 1. అతలము, 2. వితలము, 3. సుతలము, 4. తలాతలము, 5. రసాతలము, 6. మహాతలము, 7. పాతాళము. 7)వైకుంఠ, రాధా లోక, గోలోక, మణిద్వీప, మహాకాలపుర,శివపుర, గణేశ లోకము లను ఉపస్వర్గములు 7 అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీ అవంతిక, ద్వారావతి యను 7 భూస్వర్గములును, కైలాస, మానస, మేరు వను 3 ఈ మొత్తము 31 నాయందు ప్రసన్నమగును గాక. |
| త్రయస్త్రిశచ్చ మే | = | వసువులు 8మంది,రుద్రులు11 మంది, ఆదిత్యులు 12 మంది, అశ్వినీ దేవతలు2, (ప్రజాపతి) యను 33 మంది దేవతలు నాయందుప్రసన్నమగుదురు గాక. |
| చతస్రశ్చ | = | ధర్మార్థకామమోక్షములుఅను 4 విద్యలు నాయందు ప్రసన్నమగును గాక. |
| మేఽష్టౌ చ మే | = | అష్టవిధ ప్రకృతులు నాయందు ప్రసన్నమగును గాక. |
| ద్వాదశ చ మే | = | శిక్షాది వేదాంగములు 6 ను, ధర్మ శాస్త్రాదులు 6ను, ఈ మొత్తము 12 నాయందు ప్రసన్నమగును గాక. |
| షోడశ చ మే | = | దూర శ్రవణ దూర దర్శన విద్య 1. జ్ఞానేంద్రియములకు చెందిన సిద్ధి |



విద్యలు 5. కర్మేంద్రియములకు చెందిన సిద్ధివిద్యలు5. స్థాపత్య వేద సిద్ధి1 పర్జన్య సిద్ధి1. జ్యోతిర్విద్య1. ఆయుర్విద్య1. పరోక్ష బ్రహ్మ విద్య1. ఈ 16 నాయందు ప్రసన్నమగును గాక.

విశతిశ్చ మే = పంచ భూతములు సూక్ష్మ రూపముచే5 స్థూలరూపముచే5. శబ్దస్పర్శాది విషయములు స్థూలము5 సూక్ష్మము5 ఈ20 నాయందు ప్రసన్నమగును గాక.

చతుర్విశతిశ్చ మే = పంచ భూతములు, శబ్దస్పర్శాదులు5 జ్ఞాన కర్మేంద్రియములు 10 మనోబుద్ధి చిత్త అహం కారములు4. ఈ 24 నాయందు ప్రసన్నమగును గాక.

అష్టావిశతిశ్చ మే = ఆవు, మేక మున్నగు భేదములతో 28 విధములగు సృష్టి నాయందు ప్రసన్నమగునుగాక.

ద్వాత్రిశచ్చ మే = దేవసృష్టివిధములు 8 స్థావర సృష్టి విధములు 6 కౌమార మానస సృష్టి విధములు 2 జ్ఞాన కర్మేంద్రియ సృష్టి విధములు 10 అహంకార సృష్టి విధములు 3. సత్వ రజస్తమోగుణసృష్టి విధములు 3 ఈ 32 నాయందు ప్రసన్నమగును గాక.

షట్త్రిశచ్చ మే = 36 అక్షరములు గల బృహతీ ఛందస్సు నాయందు ప్రసన్నమగును గాక.

చత్వరిశచ్చ మే = 40 అక్షరములు గల పంక్తి ఛందము నాయందు ప్రసన్నమగును గాక.



| | | |
|---|---|---|
| చతుశ్చత్వారిశచ్చ మే | = | 44అక్షరములు గల త్రిష్టుప్ ఛందము నాయందు ప్రసన్నమగును గాక. |
| అష్టాచత్వారిశచ్చ మే | = | 48 అక్షరములు గల జగతీ ఛందము నాయందు ప్రసన్నమగును గాక. |
| వాజశ్చ | = | అన్నమును, |
| ప్రసవశ్చ | = | ఉత్పత్తియును, |
| అపిజశ్చ | = | మరల మరల ఉత్పత్తియును, |
| క్రతుశ్చ | = | భోగాది విషయమయిన సంకల్పము లేదా యాగము నాకు కలుగుగాక ! |
| సువశ్చ | = | అన్నముయొక్క ఉత్పత్తికి కారణమయిన సూర్యుడు నాకు కలుగుగాక ! |
| మూర్ధా చ | = | ఆకాశము నాకు కలుగుగాక ! |
| వ్యశ్నియశ్చ | = | ఆకాశమునందు పుట్టిన వాయువు నాకు కలుగుగాక |
| అన్త్యాయనశ్చ | = | అంతమునందు పుట్టినది నాకు కలుగుగాక! |
| అన్త్యశ్చ | = | అంతమున ఉండేది నాకు కలుగుగాక ! |
| భౌవనశ్చ | = | ప్రపంచములో పుట్టిన చరము, అచరము నాకు కలుగుగాక |
| భువనశ్చ | = | ప్రపంచము ఆత్మగా కలిగిన భగవానుడు నాకు కలుగుగాక ! |
| అధిపతిశ్చ | = | అధిష్ఠించి పాలించువాడు నాకు కలుగుగాక! |

**తాత్పర్యము**

ఒకటి సంఖ్యకు ప్రతీకయగు ప్రకృతి నా పట్ల ప్రసన్న మగును గాక. మూడుకు ప్రతీకయైన ఇచ్ఛాక్రియా జ్ఞాన శక్తులు (సరస్వతి. లక్ష్మి,పార్వతి)



నాయందు ప్రసన్నమగును గాక.ఐదుకు ప్రతీకలైన పంచ భూతమును నాయందు ప్రసన్నమగును గాక.

జ్ఞానేంద్రియములు, మనస్సు బుద్ధి యను ఏడును నాయందు ప్రసన్నమగును గాక.

నవ దుర్గలు నాయందు ప్రసన్నమగును గాక.

నవద్వారములు కపాల బిలము మరియు నాభి బిలము అను పదకొండును నాయందు ప్రసన్నమగును గాక.

పది దిక్కులును త్రిమూర్తులును నాయందు ప్రసన్నమగును గాక.

శ్రోత్రాది పదునాలుగు నాడులు, సుషుమ్నానాడి నాయందు ప్రసన్నమగును గాక.

దశేంద్రియములును వాటికి తోడుగా ఉన్న సప్త ధాతువులును నాయందు ప్రసన్నమగును గాక.

నవదశ ఓషధులును నాయందు ప్రసన్నమగును గాక.

2) మనో జ్ఞాన కర్మేంద్రియమును (11) పంచ తన్మాత్రలు(5) పంచ భూతములు (5) అను 21 జీవ తత్వములకు చెందిన మర్మములువైద్య శాస్త్ర ప్రసిద్ధమైనవి నాకు అనుకూలముగానుండును గాక.

జ్వరము మొదలుగా గల 23 రోగములు నాయందు ప్రసన్నమగును గాక.

అప్సరాదులు 25 మందియు నా యందు ప్రసన్నమగుదురు గాక.

చిత్రసేనాది 27 మంది గంధర్వులు నాయందు ప్రసన్నమగుదురు గాక.

కృత్యాది విద్యుద్దేవతలు 29 మంది నాయందు ప్రసన్నమగుదురు గాక.

ఊర్ధ్వ లోకములు 7 అధో లోకములు 7వైకుంఠ, రాధా లోక, గోలోక, మణిద్వీప, మహాకాలపుర,శివపుర, గణేశ లోకములను ఉపస్వర్గములు అను 7 అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీ అవంతిక, ద్వారావతి యను 7 భూస్వర్గములును, కైలాస, మానస, మేరు వను 3 ఈ మొత్తము 31 నాయందు ప్రసన్నమగును గాక.

వసువులు 8మంది,రుద్రులు11 మంది, ఆదిత్యులు 12 మంది, అశ్వినీ



దేవతలు2, (ప్రజాపతి) యను 33 మంది దేవతలు నాయందు ప్రసన్నమగుదురుగాక.

ధర్మార్థకామమోక్షాలు అను 4 పురుషార్థాలు నాయందు ప్రసన్నమగును గాక.

అష్టవిధ ప్రకృతులు నాయందు ప్రసన్నమగును గాక.

శిక్షాది వేదాంగములు 6 ను, ధర్మ శాస్త్రాదులు 6ను, ఈ మొత్తము 12

నాయందు ప్రసన్నమగును గాక.

దూర శ్రవణ దూర దర్శన విద్య1. జ్ఞానేంద్రియములకు చెందిన

సిద్ధి విద్యలు5.కర్మేంద్రియములకు చెందిన సిద్ధివిద్యలు5. స్థాపత్య వేద సిద్ధి1, పర్జన్య సిద్ధి1. జ్యోతిర్విద్య1. ఆయుర్విద్య1. పరోక్ష బ్రహ్మ విద్య1. ఈ 16 నాయందు ప్రసన్నమగును గాక.

పంచ భూతములు సూక్ష్మ రూపముచే5 స్థూలరూపముచే5. శబ్దస్పర్శాది విషయములు స్థూలము5 సూక్ష్మము5 ఈ20 నాయందు ప్రసన్నమగును గాక.

పంచ భూతములు, శబ్దస్పర్శాదులు5 జ్ఞాన కర్మేంద్రియములు10 మనోబుద్ధి చిత్త అహంకారములు4 .ఈ 24 నాయందు ప్రసన్నమగును ఆవు, మేక మున్నగు భేదములతో 28 విధములగు సృష్టి నాయందు ప్రసన్నమగునుగాక.

దేవసృష్టివిధములు 8 స్థావర సృష్టి విధములు 6 కౌమార మానస సృష్టి విధములు 2 జ్ఞాన కర్మేంరియ సృష్టి విధములు 10 అహంకార సృష్టి విధములు 3. సత్వ రజస్తమోగుణ సృష్టి విధములు 3 ఈ 32 నాయందు ప్రసన్నమగును గాక.

36 అక్షరములు గల బృహతీ ఛందస్సు నాయందు ప్రసన్నమగును గాక.

40 అక్షరములు గల పంక్తి ఛందము నాయందు ప్రసన్నమగును గాక.

44అక్షరములు గల త్రిష్టుప్ ఛందము నాయందు ప్రసన్నమగును గాక.



48 అక్షరములు గల జగతీ ఛందము నాయందు ప్రసన్నమగు గాక.

అన్నమును, ఉత్పత్తియును, మరల మరల ఉత్పత్తియును, భోగాది విషయమయిన సంకల్పము లేదా యాగము నాకు కలుగుగాక! అన్నముయొక్క ఉత్పత్తికి కారణమయిన సూర్యుడు నాకు కలుగుగాక ! ఆకాశము నాకు కలుగుగాక ! ఆకాశమునందు పుట్టిన వాయువు నాకు కలుగుగాక ! అంతమునందు పుట్టినది నాకు కలుగుగాక !

అంతమున ఉండేది నాకు కలుగుగాక ! ప్రపంచములో పుట్టిన చరము, అచరము నాకు కలుగుగాక ! ప్రపంచము ఆత్మగా కలిగిన భగవానుడు నాకు కలుగుగాక వాజము మొదలైనవాటికి చైత్రము మొదలయిన మాసముల అర్థములు చెప్పి, అవి యన్నియూ నాకు సంతోషముగా కలుగుగాక అను ఇంకో సమన్వయము కూడా పెద్దలు చెప్పారు.

ఈ అనువాకములో పేర్కొన్న సరి సంఖ్యలు భూలోక సంబంధమైనవిగా, బేసి సంఖ్యలు దేవలోక సంబంధమైనవిగా కొంతమంది వ్యాఖ్యానించారు..

## నమక చమకాలు పూర్తయిన పిమ్మట చదివే శాంతి పాఠం

**ఓం ఇడాదేవహూః-మనుర్-యజ్ఞనీః-బృహస్పతిరుక్థామదాని శగ్ంసిషద్-విశ్వే-దేవాః సూక్తవాచః పృథివిమాతర్మా మాహిగ్ంసీర్- మధు మనిష్యే మధుజనిష్యే మధువక్ష్యామి మధువదిష్యామి మధుమతీం దేవేభ్యో వాచముద్యాసగ్ం శుశ్రూషేణ్యామ్ మనుష్యేభ్యస్తం మాదేవా అవన్తు శోభాయైపితరో౽నుమదన్తు**

**ప్రతి పదార్థము**

| | | |
|---|---|---|
| ఇడా | = | కామధేనువు |
| దేవహూః | = | దేవతలను ఆహ్వానించు గాక |
| మనుః | = | మనువు |
| యజ్ఞనీః | = | కార్యము చేయు గాక |
| బృహస్పతిః | = | బృహస్పతి |
| ఉక్థామదాని | = | మంత్రములు చదువు గాక |



| | | |
|---|---|---|
| శగ్ంసిషద్ | = | నిర్దేశిత మంత్రాలతో, మాటలతో |
| విశ్వేదేవాః | = | అందరు దేవతలు (విశ్వేదేవతలు =1. చక్షురాది ఇంద్రియాలు. 2. శ్రాద్ధకాలంలో పూజలు అందుకొనే దేవగణం. వసుబంధులు, క్రతుదక్షులు, ధురివిరోచనులు, పురూరవాద్రవులు. ) |
| సూక్తవాచః | = | చక్కటి మాటల పద్ధతి చెప్పుదురు గాక ! |
| పృథివిమాతః | = | ఓ భూమాత! |
| మామ్ | = | నన్ను ( మాకు) |
| మా హింసీః | = | ఆటంకములు కలిగించకు |
| మధుమనిష్యే | = | నేను ఎల్లప్పుడూ మంచి ఆలోచనలు చేయుదును, |
| మధు జనిష్యే | = | సత్కార్యములు పుట్టే విషయాలకు ప్రాధాన్యమిస్తాను |
| మధు వక్ష్యామి | = | మంచి చేయాలనుకొంటాను |
| మధు వదిష్యామి | = | మంచిమాటలు మాట్లాడుతాను |
| మధుమతీం | = | మంచి బుద్ధిని కలిగి ఉంటాను |
| దేవేభ్యో | | |
| వాచముద్యాసగ్ం | = | దేవతలకు ప్రీతికరమైన మాటలతో వస్తువులు తెచ్చి సమర్పిస్తాను. |
| మనుష్యేభ్యః | = | మనుష్యులకు (పితరులకు) |
| శుశ్రూషేణ్యామ్ | = | సేవ చేస్తాను. |
| తం | = | ఈ విధంగా చేసినందు వలన తనను(నన్ను) |
| దేవాః | = | దేవతలు, |
| అవన్తు | = | రక్షింతురు గాక. |



| | | |
|---|---|---|
| శోభాయై | = | నా జీవిత శోభ కొరకు |
| పితరః | = | పితరులు |
| అనుమదన్తు | = | అంగీకరింతురు గాక. |

**తాత్పర్యము**

కామధేనువు దేవతలను ఆహ్వానించు గాక !

మనువు కార్యము చేయు గాక !

బృహస్పతి మంత్రములు చదువు గాక

అందరు దేవతలు  చక్కటి మాటల పద్ధతి చెప్పుదురు గాక

ఓ భూమాత! నాకు  ఆటంకములు కలిగించకు.

నేను ఎల్లప్పుడూ మంచి ఆలోచనలు చేయుదును.

సత్కార్యములు పుట్టే విషయాలకు ప్రాధాన్యమిస్తాను.

మంచి చేయాలనుకొంటాను

మంచి మాటలు మాట్లాడుతాను

మంచి బుద్ధిని కలిగి ఉంటాను

దేవతలకు ప్రీతికరమైన మాటలతో వస్తువులు తెచ్చి సమర్పిస్తాను.

మనుష్యులకు (పితరులకు)  సేవ చేస్తాను.

ఈ విధంగా చేసినందు వలన  నన్ను  దేవతలు రక్షింతురు గాక.

నా జీవిత శోభను శుభాలతో పెంచుతూ పితృదేవతలు నాకు సదా మంచిని  అంగీకరింతురు గాక. (శుభమిచ్చెదరు గాక ! అని భావము.)

*ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.*

శివానుగ్రహముచే, బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి వంశ్యుడు, శ్రీ తాడేపల్లి పార్వతీశ శాస్త్రి, సుశీలల  మూడవ కుమారుడు తాడేపల్లి పతంజలి  రచించిన శ్రీ రుద్రాధ్యాయములోని నమక చమక టీకాతాత్పర్య విశేషములుసర్వము సంపూర్ణము.

**యదక్షర పదభ్రష్టం మాత్రహీనం తు యద్భవేత్**

**తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే**



# నమక చమకాలు: (అర్థ తాత్పర్య విశేషాలు)

## అనుబంధం 1. (రుద్రాభిషేక విధి)

ఓం నమశ్శివాయ   శ్రీశివాయ గురవే నమః

(సూచన :- ముందుగా ఆచమన సంకల్పాదులను, కలశ , గణాధిపతి పూజను చేయవలయును . ఆపిమ్మట పంచాంగరుద్ర ధ్యానము గావించవలయును. ఆపై 'అస్యశ్రీ రుద్రస్య ప్రశ్నస్య ......నుండి ఆరంభించి లఘున్యాసమును చేసి రుద్రదేవుని ధ్యానింప వలయును.

నమకములోని 11 అనువాకములను పూర్తిగా చెప్పి చమకములోని మొదటి అనువాకమును ఒక్కటి చెప్పవలయును. ఈ విధముగా 11 పర్యాయములు నమకమునకు ఒకొక్క చమక అనువాకము చొప్పున 11 పదకొండింటిని జోడించి చెప్పుచూ అభిషేకించవలెను. ప్రతిసారి క్రింది విధముగా వారపూజ - తర్పణము- రుద్రగాయత్రి జపము చేసి ఒక్కొక్క వారాభిషేకమును ఈశ్వరునకు సమర్పించి , తదుపరి వారాభిషేకమును సంకల్పింపవలెను. ఈ ప్రకారంగా పదకొండుమార్లు వారాభిషేకమును పూర్తి చేసిన దానిని " ఏకాదశ రుద్రాభిషేకము " అని అందురు.)

**అథ రుద్రాభిషేక విధి :**

**1. అథ రుద్ర ధ్యానమ్**

శ్లో॥ కైలాసే కమనీయ రత్నఖచితే కల్పద్రుమమూలే స్థితం
కర్పూరస్ఫటికేందు సుందరతనుం కాత్యాయనీ సేవితం
గంగాతుంగ తరంగ రంజిత జటాభారం కృపాసాగరం
కంఠాలంకృత శేషభూషణమముం మృత్యుంజయం భావయే ॥

ధ్యానం సమర్పయామి



**అథ ఆత్మని దేవతా స్థాపయేత్**

అంగ ప్రత్యంగములలో ఆయాయా దేవతలను ప్రతిష్టించుకోవాలి.

ప్రజననే బ్రహ్మా తిష్ఠతు । పాదయోర్విష్ణుస్తిష్ఠతు । హస్తయోర్హరి స్తిష్ఠతు । బాహ్వోరిన్ద్ర స్తిష్ఠతు । జఠరే అగ్ని స్తిష్ఠతు । హృదయే శివ స్తిష్ఠతు । కణ్ఠే వసవ స్తిష్ఠన్తు । వక్త్రే సరస్వతీ స్తిష్ఠతు । నాసికయో ర్వాయు స్తిష్ఠతు । నయనయో శ్చన్ద్రాదిత్యౌ తిష్ఠేతామ్ । కర్ణయో రశ్వినౌ తిష్ఠేతామ్ । లలాటే రుద్రా స్తిష్ఠన్తు । మూర్ధ్న్యాదిత్యా స్తిష్ఠన్తు । శిరసి మహాదేవ స్తిష్ఠతు । పృష్ఠే పినాకీ తిష్ఠతు । పురతః శూలీ తిష్ఠతు । పార్శ్వయో శ్శివాశంకరౌ తిష్ఠేతామ్ । సర్వతో వాయు స్తిష్ఠతు । తతో బహిస్సర్వతోఽగ్నిర్ జ్వాలామాలా పరివృత స్తిష్ఠతు । సర్వేష్వంగేషు సర్వా దేవతా యథాస్థానం తిష్ఠన్తు । మాం రక్షన్తు యజమానగం రక్షన్తు॥

**3. ఆవాహనమ్**

ఆరాధితో మనుష్యై స్త్వం – సిద్ధైర్దేవాసురాదిభిః
ఆరాధయామి భక్త్యా త్వాం – మాం గృహాణ మహేశ్వర ॥

ఈశానమావహయామి

**4. ప్రార్థనమ్**

శంకరస్య చరితం కథామృతం – చన్ద్రశేఖర గుణాను కీర్తనమ్ ।
నీలకణ్ఠ ! తవ పాదసేవనం – సంభవన్తు మమ జన్మజన్మని ॥
స్వామిన్ సర్వజగన్నాథ – యావత్పూజాఽవసానకమ్
తావ త్త్వం ప్రీతిభావేన – లింగేఽస్మిన్ సన్నిధిం కురు ॥

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ఇతి ప్రార్థన నమస్కారాన్ సమర్పయామి.

**5. ఆసనమ్**

త్రయంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్ ॥

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః రత్న సింహాసనం సమర్పయామి.

**6. పాద్యం**

సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వై నమో నమః
శ్రీ భవానీ శంకరాభ్యాం నమః పాద్యం సమర్పయామి



**7. అర్ఘ్యం**

భవే భవే నాతి భవే భవస్వమామ్ ।

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః అర్ఘ్యం సమర్పయామి.

**8. ఆచమనీయమం**

భవోద్భవాయనమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ఆచమనీయం సమర్పయామి.

**9. స్నానం**

వామదేవాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః స్నానం సమర్పయామి.

**10. వస్త్రం**

జ్యేష్ఠాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః వస్త్రం సమర్పయామి.

**11. ఉపవీతం**

శ్రేష్ఠాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ఉపవీతం సమర్పయామి.

**12. ఆభరణం**

రుద్రాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ఆభరణాని సమర్పయామి.

**13. గన్ధమ్**

కాలాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః గన్ధమ్ సమర్పయామి.

**14. అక్షతలు**

కలవికరణాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః అక్షతాన్ సమర్పయామి.

**15. పుష్పములు**

బలవికరణాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః పుష్పాణి సమర్పయామి.



**16. ధూపం**

బలాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ధూపం సమర్పయామి.

**17. దీపం**

బలప్రమథనాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః దీపం సమర్పయామి.

**18. నైవేద్యమ్**

సర్వభూతదమనాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః నైవేద్యం సమర్పయామి.

**19. తామ్బూలమ్**

మనోన్మనాయ నమః

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః తాంబూలమ్ సమర్పయామి.

**20. ఉత్తర నీరాజనమ్**

అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః ।

సర్వేభ్య స్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః ।

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ఉత్తర నీరాజనం సమర్పయామి.

**21. మన్త్రపుష్పం**

తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి।తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః మన్త్రపుష్పం సమర్పయామి.

**22. ప్రదక్షిణ నమస్కారం**

ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం

బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్ ॥

శ్రీ భవానీ శంకరాభ్యాం నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

**23.** భవ మొదలగు 8నామములతో జిల్లేడు మొదలగు 8 పుష్పములతో పూజ తర్పణం (24)



1. భవాయదేవాయ నమః - అర్కపుష్పం సమర్పయామి ।
2. శర్వాయదేవాయ నమః - చంపకపుష్పం సమర్పయామి ।
3. ఈశానాయదేవాయ నమః - పున్నాగపుష్పం సమర్పయామి ।
4. పశుపతయేదేవాయ నమః - నంద్యావర్తపుష్పం సమర్పయామి
5. రుద్రాయదేవాయ నమః - పాటలపుష్పం సమర్పయామి ।
6. ఉగ్రాయదేవాయ నమః - బృహతీపుష్పం సమర్పయామి ।
7. భీమాయదేవాయ నమః - కరవీరపుష్పం సమర్పయామి ।
8. మహతేదేవాయ నమః - ద్రోణపుష్పం సమర్పయామి ।

1. భవస్యదేవస్య పత్న్యై నమః - అర్కపుష్పం సమర్పయామి ।
2. శర్వస్యదేవస్య పత్న్యై నమః - చంపకపుష్పం సమర్పయామి ।
3. ఈశానస్యదేవస్య పత్న్యై నమః - పున్నాగపుష్పం సమర్పయామి ।
4. పశుపతేర్దేవస్య పత్న్యై నమః - నంద్యావర్తపుష్పం సమర్పయామి ।
5. రుద్రస్యదేవస్య పత్న్యై నమః - పాటలపుష్పం సమర్పయామి ।
6. ఉగ్రస్యదేవస్య పత్న్యై నమః - బృహతీపుష్పం సమర్పయామి ।
7. భీమస్యదేవస్య పత్న్యై నమః - కరవీరపుష్పం సమర్పయామి ।
8. మహతోదేవస్య పత్న్యై నమః - ద్రోణపుష్పం సమర్పయామి ।

॥ ఇతి అష్టపుష్పై పూజాం సమర్పయామి ॥

**24. తర్పణమ్**

**అథ తర్పణమ్**

1. భవందేవం తర్పయామి ।
2. శర్వందేవం తర్పయామి ।
3. ఈశానందేవం తర్పయామి ।
4. పశుపతిందేవం తర్పయామి ।
5. రుద్రందేవం తర్పయామి ।
6. ఉగ్రందేవం తర్పయామి ।
7. భీమందేవం తర్పయామి ।
8. మహాంతందేవం తర్పయామి ।

1. భవస్యదేవస్యపత్నీం తర్పయామి ।
2. శర్వస్యదేవస్యపత్నీం తర్పయామి ।



3. ఈశానస్యదేవస్యపత్నీం తర్పయామి ।
4. పశుపతేర్దేవస్యపత్నీం తర్పయామి ।
5. రుద్రస్యదేవస్యపత్నీం తర్పయామి ।
6. ఉగ్రస్యదేవస్యపత్నీం తర్పయామి ।
7. భీమస్యదేవస్యపత్నీం తర్పయామి ।
8. మహతోదేవస్యపత్నీం తర్పయామి ।

॥ ఇతి తర్పయిత్వా ॥

**25. రుద్రగాయత్రీ మంత్ర జపం**

ఓం తత్పురుషాయ విద్మహే । మహాదేవాయ ధీమహి । తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

పై మంత్ర జపం శక్తికొలది 11 మార్లకన్నా తక్కువ కాకుండా జపించాలి.

**26. అథ ఆశాసనమ్** (ఉపాసకుడు రుద్రునితో తన కోరికలను చెప్పుకొనుట.)

ఆశాస్తేఽ యం యజమానోఽ సౌ । ఆయురాశాస్తే । సుప్రజాస్త్వమాశాస్తే। సజాతవనస్యా మాశాస్తే। ఉత్తరాం దేవయజ్యా మాశాస్తే। భూయో హవిష్కరణ మాశాస్తే। దివ్యం ధామాఽఽ శాస్తే । విశ్వం ప్రియ మాశాస్తే। యదనేన హవిషాఽఽ శాస్తే। త దశ్యాత్తదృధ్యాత్ । త దస్మై దేవా రాసన్తామ్ । త దగ్నిర్దేవో దేవేభ్యో వనతే । వయ మగ్నేర్మానుషాః । ఇష్టం చ వీతం చ । ఉభే చ నో ద్యావాపృథివీ అగంహస స్పాతామ్। ఇహ గతి ర్వామస్యేదం చ । నమో దేవేభ్యః ॥

**27. నిర్మాల్య విసర్జనమ్**

ఓం భూర్భువస్సువః చండీశ్వరాయ నమః ఇతి ఉత్తరతో నిర్మాల్యం విసృజ్య పునః నూతన బిల్వదళాని ధారయేత్ ॥

**28. అథ పంచామృత స్నాన విధి:**

అనేన ఆముక – వారాభిషేకేన భగవాన్ సర్వదేవాత్మకః శ్రీ భవానీ శంకర స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు ॥



అనంతరం పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ । శ్రీ భవానీ శంకర దేవతా ముద్దిశ్య - శ్రీ భవానీ శంకర దేవతా ప్రీత్యర్థం ప్రథమ వారాభిషేకానంతరం ఆముక - వారాభిషేకమహం కరిష్యే ॥ (అన్యోన్య సహాయేన ఆముక - వారాభిషేకం కరిష్యామః ॥)

## అథ పంచామృతస్నాన విధిః

1. (పాలు)

ఓం ఆప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణియం ।
భవా వాజస్య సంగథే ॥ ఇతి క్షీరేణ స్నపయామి ॥

2. (పెరుగు)

ఓం దధిక్రాణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః ।
సురభినో ముఖాకరత్రృణ ఆయూగ్ంషి తారిషత్ ॥
ఇతి ధధ్నా స్నపయామి ॥

3. (నెయ్యి)

ఓం శుక్రమసి జ్యోతిరసి తేజో సి దేవో వః సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః ॥
ఇతి ఆజ్యేన స్నపయామి ॥

4. (తేనె)

ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః । మాధ్వీర్నస్సత్వోషధీః।
మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః ।మధు ద్యౌ రస్తు నః పితా ।
మధుమాం నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవంతు నః ॥
ఇతి మధునా స్నపయామి ॥

5. (చక్కెర)

ఓం స్వాదుః పవనస్వ దివ్యాయజన్మనే స్వాదురింద్రాయ సుహవేతునామ్నే ।
స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః ॥
ఇతి శర్కరేణ స్నపయామి ॥



6. (కొబ్బరినీళ్ళు)

యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చపుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతా స్తానో ముఞ్చన్త్వగ్ంహసః ॥

ఇతి నారికేళ ఫలోదకేన స్నపయామి ॥

పంచామృత స్నానానంతరం 'ఓం ఆపోహిష్ఠేతి...' శుద్ధోదక స్నానం సమర్పయామి ॥ అనంతరం గంధోదకాద్యైః స్నాపయిష్యే ॥

1. **అథగంధోదకమ్ :**

అప్సరస్సు యోగంధో గంధర్వేషు చ యద్యశః ।
దైవో యో మానుషో గంధస్సమా గంధస్సురభిర్జుతామ్ ॥

॥ ఇతి గంధోదకస్నాన సమర్పయామి ॥

2. **అథ పుష్పోదకమ్ :**

యోఽపాం పుష్పం వేద । పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి ।
చంద్రమావా అపాం పుష్పం । పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి ।
య ఏవం వేద ॥

॥ ఇతి పుష్పోదకస్నానం సమర్పయామి ॥

3. **అథ ఫలోదకమ్ :**

యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చపుష్పిణీః ।
బృహస్పతి ప్రసూతా స్తానో ముఞ్చన్త్వగ్ంహసః ॥

॥ ఇతి ఫలోదకస్నానం సమర్పయామి ॥

4. **అథ అక్షతోదకమ్ :**

ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః ।
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥

॥ ఇతి అక్షతోదకస్నానం సమర్పయామి ॥

5. **అథ సువర్ణోదకమ్ :**

తథ్సువర్ణగ్ం హిరణ్యమభవత్ ।
యథ్సువర్ణగ్ం హిరణ్యం దదాతి ॥

॥ ఇతి సువర్ణోదకస్నానం సమర్పయామి ॥



6. **అథ బిల్వోదకమ్ :**

మానో మహాంతముతమానో అర్భకం మాన ఉక్షంత ముతమాన ఉక్షితమ్ ।
మానో వధీః పితరం మోతమాతరం ప్రియామానస్తనువో రుద్రరీరిషః ॥

॥ ఇతి బిల్వోదకస్నానం సమర్పయామి ॥

7. **అథ భస్మోదకమ్ :**

మానస్తోకే తనయే మాన ఆయుషి మానో గోషుమానో అశ్వేషురీరిషః ।
వీరాన్మానో రుద్రభామితోవధీర్హవిష్మంతో నమసా విధేమతే ॥

॥ ఇతి భస్మోదకస్నానం సమర్పయామి ॥

8. **అథ దూర్వోదకమ్ :**

కాండాత్కాండా త్ప్రరోహంతీ పరుషః పరి ।
ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేన చ ॥

॥ ఇతి దూర్వోదకస్నానం సమర్పయామి ॥

9. **అథ రుద్రాక్షోదకమ్:**

త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివబంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

॥ ఇతరుద్రాక్షోదక స్నానం సమర్పయామి ॥

10. **అథ ఇక్షురసమ్ :**

స్వాద్వీం త్వా స్వాదునా । తీవ్రాం తీవ్రేణ ।
అమృతామమృతేన మధుమతీం మధుమతా ॥

॥ ఇతి ఇక్షురసస్నానం సమర్పయామి ॥

11. **అథ నవరత్నోదకమ్ :**

సహిరత్నానిదాశుషే । సువాతి సవితా భగః ।
తం భాగం చిత్రమీమహే ॥

॥ఇతి నవరత్నోదకస్నానం సమర్పయామి ॥



12. **అథ ద్రాక్షరసోదకమ్ :**

సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమో నమః ।
భవే భవే నాతి భవే భవస్వ మాం । భవోద్భవాయ నమః ॥

॥ ఇతి ద్రాక్షరసస్నానం సమర్పయామి ॥

13. **అథ ఖర్జూరఫలరసోదకమ్ :**

వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమశ్శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమస్సర్వ భూతదమనాయ నమో మనోన్మనాయ నమః ॥

॥ ఇతి ఖర్జూరఫలస్నానం సమర్పయామి ॥

14. **అథ కస్తూరీసలిలమ్ :**

అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః ।
సర్వేభ్య స్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః ॥

॥ ఇతి కస్తూరీ సలిలస్నానం సమర్పయామి ॥

15. **అథ జంబూఫలరసమ్ :**

తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి ।
తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

॥ ఇతి జంబూఫలరసస్నానం సమర్పయామి ॥

16. **అథ ఆమ్రరసమ్ :**

ఈశాన స్సర్వ విద్యానామీశ్వరస్సర్వభూతానాం
బ్రహ్మోఽధిపతి ర్బ్రహ్మణోఽధిపతిర్ బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్ ॥

॥ ఇతి ఆమ్రరసస్నానం సమర్పయామి ॥

17. **అథ హరిద్రోదకమ్ :**

అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరోసురాస్తేషాగ్ం సర్వభూతానాం



మాతామేదినీ మహతామహీ సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృథ్వీ బహులా
విశ్వాభూతా కతమా కాయసా సత్యేత్యమృతేతి వసిష్ఠః ॥

॥ ఇతి హరిద్రోదకస్నానం సమర్పయామి ॥

18. **అథ మలాపకర్షణ స్నానమ్ :**

ఆపో హి ష్ఠా మయోభువస్తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే ।
యో వ శ్శివతమోరస సః । తస్య భాజయతే హ నః ।
ఉశతీరివ మాతరః । తస్మా అరం గమామ వః ।
యస్యక్షయాయ జిన్వథ । ఆపో జనయథా చ నః ॥

ఓం ॥ శం చ మే మయశ్చ మే ప్రియం చ మేఽనుకామశ్చ మే కామశ్చ మే సౌమనసశ్చ మే భద్రం చ మే శ్రేయశ్చ మే వస్యశ్చ మే యశశ్చ మే భగశ్చ మే ద్రవిణం చ మే యన్తా చ మే ధర్తా చ మే క్షేమశ్చ మే ధృతిశ్చ మే విశ్వం చ మే మహశ్చ మే సంవిచ్చ మే జ్ఞాత్రం చ మే సూశ్చమే ప్రసూశ్చమే సీరం చ మే లయశ్చ మ ఋతం చ మేఽమృతం చ మే యక్ష్మం చ మేఽనామయశ్చ మే జీవాతుశ్చ మే దీర్ఘాయుత్వం చ మేఽనమిత్రం చ మేఽభయం చ మే సుగం చ మే శయనం చ మే సూషా చ మే సుదినం చ మే ॥

*ఓం శాంతి శాంతి శ్శాంతిః*

*॥ ఇతి మలాపకర్షణ స్నానం సమర్పయామి ॥*

**29. అథ శ్రీరుద్రనమక లఘున్యాసశ్చ**

*॥ ఓం శ్రీశివాయగురవే నమః ॥*



## అథ శ్రీరుద్రనమకమ్

అస్యశ్రీరుద్రస్యప్రశ్నస్య । అఘోరఋషిః । అనుష్టుప్ఛందః । సంకర్షణమూర్తి స్వరూపోయోఽసావాదిత్యః పరమపురుషః స ఏష రుద్రో దేవతా । అగ్ని క్రతుచరమేష్టకా యాగ్ం శతరుద్రీయే జపే (అభిషేకే) వినియోగః ॥

సకలస్య శ్రీరుద్రాధ్యాయస్య । శ్రీరుద్రోదేవతా । ఏకాగాయత్రీచ్ఛందః త్రిస్రోఽనుష్టుభః । తిస్రఃపఙ్క్తయః । సప్తానుష్టుభః । ద్వేజగత్యౌ । శ్రీభవానీశంకర దేవతా ప్రీత్యర్థే శతరుద్రీయే జపే (అభిషేకే) వినియోగః ॥

| | | |
|---|---|---|
| నమశ్శంభవే చ | అగ్నిహోత్రాత్మనే | అంగుష్ఠాభ్యాం నమః । |
| మయోభవే చ | దర్శపూర్ణ మాసాత్మనే | తర్జనీభ్యాం నమః । |
| నమశ్శంకరాయ చ | చాతుర్మాస్యాత్మనే | మధ్యమాభ్యాం నమః । |
| మయస్కరాయ చ | నిరూఢపశుబంధాత్మనే | అనామికాభ్యాం నమః । |
| నమశ్శివాయ చ | జ్యోతిష్టోమాత్మనే | కనిష్ఠికాభ్యాం నమః । |
| నమశ్శివతరాయ చ | సర్వక్రత్వాత్మనే | కరతలకరపృష్ఠాభ్యాం నమః । |

| | | |
|---|---|---|
| నమశ్శంభవే చ | అగ్నిహోత్రాత్మనే | హృదయాయ నమః । |
| మయోభవే చ | దర్శపూర్ణ మాసాత్మనే | శిరసే స్వాహా । |
| నమశ్శంకరాయ చ | చాతుర్మాస్యాత్మనే | శిఖాయై వషట్ । |
| మయస్కరాయ చ | నిరూఢపశుబంధాత్మనే | కవచాయహుం । |
| నమశ్శివాయ చ | జ్యోతిష్టోమాత్మనే | నేత్రత్రయాయ వౌషట్ । |
| నమశ్శివతరాయ చ | సర్వక్రత్వాత్మనే | అస్త్రాయ ఫట్ ॥ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥



## ధ్యానమ్

ఆపాతాళనభఃస్థలా న్తభువన బ్రహ్మాండ మావిస్ఫురత్
జ్యోతిః స్ఫాటికలింగ మౌళివిలసత్పూర్ణేందు వాన్తామృతైః ।
అస్తోకాప్లుతమేకమీశ మనిశం రుద్రానువాకాన్ జపన్
ధ్యాయేదీప్సితసిద్ధయే ధ్రువపదం విప్రోఽభిషించే చ్ఛివమ్ ॥ ౧

బ్రహ్మాండవ్యాప్తదేహాః భసితహిమరుచా భాసమానా భుజంగైః
కంఠే కాలాః కపర్దాఃకలితశశికలా శ్చండకోదణ్డ హస్తాః ।
త్ర్యక్షా రుద్రాక్షమాలాసలలితవపుషాః శ్శాంభవా మూర్తిభేదాః
రుద్రశ్రీరుద్రసూక్త ప్రకటితవిభవా నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్ ॥ ౨

### ఓం నమోభగవతే రుద్రాయ

### అథ ప్రథమోఽనువాకః

ఓమ్ ॥ నం ॥ నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః । నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః । యా త ఇషుశ్శివతమాశివం బభూవ తే ధనుః। శివాశరవ్యాయా తవ త యా నో రుద్ర మృడయ। యా తే రుద్ర శివా తనూరఘోరాఽపాపకాశినీ । తయా న స్తనువా శంత మయా గిరిశన్తాభి చాకశీహి। యామిషుం గిరిశన్త హస్తే॥ **(1)** బిభర్ష్యస్తవే । శివాం గిరిత్ర తాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్ । శివేనవచసా త్వా గిరిశాచ్ఛా వదామసి । యథానస్సర్వమిజ్జగద యక్ష్మగ్ంసుమనాఅసత్ । అధ్యవోచదధి వక్తా ప్రథమో దైవ్యోభిషక్ । అహీగ్శ్చ సర్వాఞ్జమ్భయన్థ్సర్వాశ్చయాతు ధాన్యః । అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సు మఙ్గలః । యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు **(2)** శ్రితాస్సహస్రశోఽవై షాగ్ం హేడ ఈమహే । అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః । ఉతైనం గోపా అదృశన్న దృశన్ను దహార్యః । ఉతైనంవిశ్వా భూతానిస దృష్టో మృడయాతి నః । నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే ।



అథో యే అన్య నత్వానో ఽహం తేభ్యోఽకరం నమః ॥ ప్రముఞ్చధన్వనస్త్వముభయో రార్త్నియోర్జ్యామ్ । యాశ్చతే హస్త ఇషవః ॥ **(3)** పరా తా భగవో వప । అవతత్యధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే । నిశీర్యశల్యానాం ముఖాశివో నస్సుమనా భవ । విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత । అనేశన్న స్యేషవ ఆభురస్య నిషఙ్గథిః । యాతే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః । తయాఽస్మాన్ విశ్వతస్త్వమయక్ష్మయాపరిబ్భుజ । నమస్తే అస్త్వాయుధాయాఽనా తతాయ ధృష్ణవే । ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే । పరి తే ధన్వనో హేతిరస్మాన్వృణక్తు విశ్వతః । అథోయ ఇషుధిస్తవాఽఽరే అస్మన్ని ధేహితమ్ ॥ **(4)** ॥౧॥

నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్నిరుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహా దేవాయ నమః ॥

నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం చ పతయే నమోనమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమో నమస్సస్పిఞ్జరాయ త్విషీమతే పథీనాం పతయే నమో నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమో నమో హరికేశాయోపవీతినే పుష్టా నాం పతయే నమో నమో భవస్య హేత్యై జగతాం పతయే నమో నమో రుద్రాయాత తావినే క్షేత్రాణాం పతయే నమో నమసూ్తా తాయాహన్త్యాయ వనానాం పతయే నమో నమః ॥ **(5)** రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమో నమో మన్త్రిణే వాణి జాయ కక్షాణాం పతయే నమో నమో భువన్తయే వారివస్కృతాయౌషధీనాం పతయే నమో నమఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం పతయే నమో నమః కృత్స్నవీతాయ ధావతే సత్వనాం పతయే నమః ॥ **(6)** ॥౨॥



నమస్సహమానాయనివ్యాధిన ఆవ్యాధినీ నాంపతయేనమో నమః కకుబభాయ నిషజ్గిణే స్తేనానాం పతయే నమోనమో నిషజ్గిణఇషుధిమతే తస్కరాణాంపతయే నమో నమో వఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే నవెూ నవెూ నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నవెూనమస్సృకావిభ్యోజిషాగ్ం సద్భ్యోముష్ణతాం పతయే నవెూ నమోఽసిమద్భ్యో నక్తం చరద్భ్యః ప్రకృన్తానాం పతయే నమోనమ ఉష్ణీషిణే గిరిచరాయకులుఞ్చానాం పతయే నమో నమః ॥ **(7)**

ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చవో నమో నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానే భ్యశ్చవో నమో నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చవో నమో నమోఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చవో నమో నమ ఆసీనే భ్యశ్శయానేభ్యశ్చవో నమోనమస్స్వసద్భ్యో జాగ్రద్భ్యశ్చవో నమో నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమో నమస్సభా/ భ్యస్సభాపతిభ్యశ్చవో నమో నమో అశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చవో నమః ॥**(8)**

॥3॥

నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చవో నమో నమ ఉగణాభ్యస్తృగ్ం హతీభ్యశ్చవో నమో నమో గృత్సేభ్యోగృత్సపతిభ్యశ్చవో నమోనమో వ్రాతేభ్యోవ్రాత పతిభ్యశ్చ వో నమో నమో గణేభ్యోగణపతిభ్యశ్చ వో నమో నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమో నమోమహద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమో నమోరథిభ్యోఽరథేభ్యశ్చ వో నమో నమో రథేభ్యః ॥ **(9)** రథపతిభ్యశ్చవో నమో నమస్సేనాభ్య స్సేనా నిభ్యశ్చ వో నమో నమః క్షత్తృభ్యస్సంగ్ర హీతృభ్యశ్చవో నమో నమస్తక్షభ్యోరథకా రేభ్యశ్చవో నమో నమః కులాలేభ్యఃకర్మారేభ్యశ్చవో నమోనమః పుఞ్జిష్టేభ్యోనిషాదేభ్యశ్చవో నవెూనమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చవో నవెూ నవెూ

